* శ్రీరస్తు శ్రీ. *

* శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః. *

ఉ॥ శ్రీరమణీశునిన్ విబుధసేవితపాదుని శేషతల్పునిన్ నారదముఖ్యసన్ము
నీంగణాదినుతున్ ప్రభు భక్తవత్సలున్। సారసలోచనున్ మదగజారివిహా
రుని సుధాపయోబ్ధి కావేరి నివాసుడైన కరి వేల్పుగునం బెరుమాళ్ల గొల్చెదన్॥




* ఆనసీ వైద్యగ్రంధము *

చిన్న శ్రీనివాసరావు గారిచే,

తెలుగున రచియింపబడి,

శ్రీశ్రీ బొబ్బిలి మహారాజావారి సెలవు ప్రకారము

శ్రీ రంగారాయ విలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడి ప్రకటింపబడియె.

రెండవ కూర్పు ౧౦౮౦ ప్రతులు.

కాపీరైటు,


BOBBILI, SRI rangaraya vilasa press, printed by
K. padmanadha patnayak. 1894

# PREFACE TO THE SECOND EDITION

The first edition of this book which was approved by the District Surgeon, Vizagapatam, as a useful work, was published under the orders of the President, District Board Vizagapatam.

There being no book of this kind in Telugu, H. H. the Rajah of Bobbili is kindly pleased to encourage the author to bring out this edition with several alterations in view to its meeting the wants of the Telugu people, who do not understand English and helping them in cases of emergency, when qualified medical men are not available.

A general index and prescriptions for the diseases mentioned in this book are added at the end of the book, and some diseases as Leprosy, Anaemea, Impotency & are now introduced.

There is, of course, hardly any original matter in this book. It is mostly a translation of what is contained in the standard works of Eminent Authors. The numbers of prescriptions referred to in the treatment of diseases, are given opposite the names of the diseases in the index. Most of the prescriptions are taken from Tanner, Robert and Lancet

The writer craves the indulgence of the public for any short comings in this work which is his first attempt.

Any suggestions or corrections will be thankfully received.

Bobbili<br>15th January 1894

Ch. Sreenivasaram<br>Hospital assistant

# ప్రకటన.

శ్రీ సర్వేశ్వర కరుణాకటాక్షంబున విశాఖపట్టణపు డి॥ ప్ర॥ వారు నెం ౩౦౭ గల ౨౬-౬-౯౨ సం॥న డి॥సర్జన్ వారు యీ గ్రంథము బాగా నున్నదనియు నుపయోగ కారియనియు తెలియచేసినట్లు వ్రాయుస్తూ గ్రంథమును సమాప్తి చేయవలసినదిగా ఆర్డరు చేయించిన పైయుని యుండుల ప్రథమ యడిషను ప్రచురింపబడినది.

కొన్ని నవీనహాంశములను చేర్చి కొంతమార్పుచేసి, యీ రెండవ యడిషను శ్రీ॥ హి॥ హై॥ బొబ్బిలి మహారాజావారి సెలవుపైని తయ్యారు కాయగా తెనుగు భాషలో, ఇంగ్లీషు శాస్త్రపడికట్టునా॥ రోగనిదానములు యిడవలెను వ్రాసియుంచుట లేక, ఆంగ్లేయభాష తెలియనివారలకు, దానియొక్క మార్గమును బోధించుటకు అప్పుడు చికిత్సలవలన నివారణ చేయబడు రోగములు సులభముగా తెలియబడును, శాస్త్రజ్ఞానులగు వైద్యులు లేనిచో యీ గ్రంథసహాయ్యంబున కొంతసాధనము చేసికొనగలరనియు, శ్రీమహారాజావారు అచ్చువేయించి ప్రకటన చేయుటకు నంగీకరించిరి.

ఈ యడిషనుకు తెనుగు, ఇంగ్లీషుగల విషయసూచికయును, రోగములలో వాడెడు యోగములును, నంబరువారీగా ప్రత్యేకించి గ్రంథాంతంబున చేర్చబడెను.

పాండురోగము, కుష్టు, నపుంసకత్వము మొదలగు రోగములు చేర్చబడెను. ఆంగ్లేయ వైద్యులలో గొప్ప డాక్టరులువ్రాసిన గ్రంథములలోని సంగ్రహములుకొన్ని కూర్చి యీగ్రంథము వ్రాయబడినది. ఇండెక్సులోనే రోగమునకు ఎదురుగా ఆ రోగములో వాడేమందు నంబరు వ్రాయబడియున్నది. ఈ యోగములు లెన్నెట్టు అను పేరునుంచి లానెరు రాబర్టువారి గ్రంథములనుంచి వ్రాయబడినవి.

---

Ch. Sreenivasarow

Hosp. Assistant

Member of Bodhanandany Sabha, Bobbili. 1894.

THIS BOOK,

IS RESPECTFULLY DEDICATED.

TO,

*HIS HIGHNESS, SREE RAJAH RAVU*

VENKATA SWETACHALAPATHI

RANGAROW BAHADUR GARU.

MAHA RAJAH OF BOBBILI.

# ERRATA.

| Page No. | Line No. | Prescription No. | Read | For |
|---|---|---|---|---|
| 9 | 14 | | Febricula. | Febricul. |
| 13 | 1 | | Small Pox. | Smallpox. |
| 32 | 8 | | Hæmoptysis. | Hamoptysis. |
| 44 | 8 | | Scrofulous Constitutions | Scrophulous constitutions. |
| 48 | 9 | | Heart disease. | Hart disease. |
| 54 | 3 | | Infantile Aphthæ. | Infantile Aphthoe. |
| " | 12 | | Convulsions. | Convnlsions. |
| 62 | 17 | | (Hepatic Abscess) Abscess of Liver. | (Hepatic Absces) Alscess of Liver. |
| 63 | 2 | | Hepatic Abscess (Abscess of Liver.) | Hepatic Abseess(Abseess of Liur.) |
| 74 | 20 | | Diarrhœa. | Diarrhea. |
| 76 | 12 | | Cholera. | Cholere. |
| 81 | 8 | | Lead Colic. | Lead Colie. |
| 82 | 20 | | Malæna. | Malena. |
| 83 | 6 | | Round Worm. | Romd worm. |
| 90 | 1 | | Diabetes Mellitus | Diaetes Mellitus |
| 99 | 11 | | Impotency. | Iuepotency. |
| 107 | 19 | | Epilepsy. | Epebpsy. |
| 113 | 22 | | Infantile Tetanus. | Iufantile Tetonitis. |
| 133 | 2 | | Impetigo. | Mpetigo. |
| 142 | 14 | | Puerperal Peritonitis. | Peurperal Peritonitis. |
| 151 | 8 | | Gonorrhœa. | Gonorrhea. |
| 153 | 15 | | Gonorrhœa. | Gonorrhea. |
| 154 | 17 | | Chancre. | Chanere. |
| 157 | 18 | | Hereditary Syphilis. | Heriditary Syphilis. |
| 158 | 7 | | Anæmia. | Anemia. |
| 160 | 2 | | Ferrum Reductum. | Frreum Reductum. |
| 161 | 24 | | Leproys. | Leqrosy. |
| 164 | 1 | 5 | Pill Scilla. | Pillscilla. |
| 165 | 1 | 6 | Best effeets. | Besteffcts. |
| 165 | 5 | 7 | Rhei | Rhii. |
| 166 | 1 | 13 | Granulated Sulphate of Iron. | Granulated Sulpkate if iron |
| " | 3 | 14 | Digetalis. | Dietalis. |
| " | 6 | 14 | In dropsical. | ns dropsical. |
| 167 | 7 | 15 | Jaundice. | Jaunbice. |
| " | 1 | 17 | (Knoll.) | (K!oll). |
| " | 3 | 20 | Extract Rhei. | Extract Rhci. |
| 168 | 2 | 21 | Quinia Sulphætas. | Quenia sulphatas |
| 171 | 6 | 33 | Secondary syphilitic Eruptions. | Seeondary syphelitie Ereeptions |

| [illegible] | [illegible] | Prescr. No. | | [illegible] |
|---|---|---|---|---|
| 172 | 2 | 38 | Sodii Salicyl. | Sodii Salyee. |
| 173 | 4 | 39 | Decoct Cinch. | Decoct Cinch. |
| " | 6 | 41 | Cutaneous. | Cutanius. |
| " | 2 | 42 | Liquid. | Liqwid. |
| 174 | 5 | 46 | Cough. | Congh. |
| 176 | 5 | 50 | Table spoonsful. | Table spoonfuls. |
| 178 | 18 | | Pleurisy | Pluerasy. |
| 179 | 1 | 59 | Cholera drops. | Chobra drops. |
| " | 8 | " | Cinnamon. | Cianamon. |
| " | 1 | 60 | Juniper. | Juniper. |
| 180 | 3 | 63 | 8 Ounces. | 6 Ounces. |
| 181 | 6 | 67 | Fever. | Feaver. |
| 182 | 6 | 69 | Soaked. | Soked. |
| " | 6 | 70 | Soaked | Soked. |
| " | 6 | 71 | Salivation. | Salevation. |
| " | 2 | 72 | Glycerine | Glyceine. |
| 183 | 5 | 73 | Ounce. | Ounces. |
| " | 6 | " | Anæmia. | Anamia. |
| " | 2 | 76 | Camphor. | Campher. |
| 184 | 10 | 78 | Septicæmia. | Septicoemia |
| 185 | 4 | 81 | Cinnamon water. | Cinmomon. |
| 186 | 6 | 84 | Fevers. | Feavers. |
| 192 | 6 | 106 | Brain and Spinalcord | Brainspinalcard. |
| " | 6 | 107 | Neuralgia. | Nuralgia. |
| " | 5 | 108 | Days | Dexys. |
| " | 6 | " | Expected. | Epected. |
| 193 | 6 | 112 | Keep. | Kcep. |
| 194 | 4 | 116 | Divide. | Devide. |
| " | 5 | " | Habitual. | Habitval. |
| 195 | 5 | 117 | Congestion. | Congeston. |
| " | " | " | Bilious. | Belious. |
| 197 | 4 | 126 | Pregnancy. | Pregnaucy. |
| 198 | 7 | 129 | Diarrhoea. | Diarrhea. |
| 199 | 2 | 2 | Pepper | Peper. |
| " | 5 | 5 | Meals. | Mals. |
| 20 | 1 | 7 | Appetite. | Apetite. |
| " | 1 | 9 | Darrhœa. | Dearrhœa. |






**శ్రీ సర్వేశ్వరాయనమః.**

క॥ సర్వలోకైకవంద్యుండు సర్వశక్తి। సర్వసంపన్నుడతికృపా
శాలి। బాలి యెల్లలోకంబులేలెడు నీశ్వరుండు। నిఖిలజనులకొసంగుత
సుఖము లెప్పుడు॥

శాస్త్రసంబంధియైనట్టి చర్చవిడచి, యెల్లజనులకు దెలియునట్లు చ
క్రింద వ్రాయబడియున్న వారిశాస్త్రములయొక్క భాగములు తెల్గుభా
షచే బల్కబడియె.

జే ఆర్, బారో.<br>
జీ, డేవిస్సు. } వీరిచే రచియింపబడిన సంక్షేపము.

డాక్టరు హూపరు వైద్యశాస్త్రము.

డాక్టరు టానెరు డిటో.

డి॥ రాబర్ట్సు. — డిటో.

డి॥ చెర్చిలు ప్రసవవైద్యశాస్త్రము.

డి॥ ప్లేఫేరు.— డిటో.

### తూచుటకు మానము.

౨—ధాన్యపుగింజలు. ... ౧—గ్రేను.

౨౦—గ్రేనులు. ... ... ౧—డ్రాము.

౩—డ్రాములు. ... ... ౧—తులము.

౮—డ్రాములు. ... ... ౧—ఔన్సు.

౧౬—ఔన్సులు ... ... ౧—పౌను.

### ఊష్ణములు. Fevers.

తమకాక విస్తారముగానుండు సకలరోగములు ఊష్ణములనబడును.

విధములు— ఇతరరుగ్మతవలనకలుగనిదిన్నీ కలిగినదియును, ఇందులో మొదటివిధముయొక్క హేతువుదృశ్యముకానిది.

రెండవది— దెబ్బవల్లనుగాని కురుపులు వరుపులు మొదలగువానివలన కలుగుచున్నది ఇందువల్లనే దీనిని (Symptomatic) అందురు.

జ్వరభేదములు

౧ ఆహికజ్వరములు.
౨ పాళిజ్వరములు.
౩ బడి వేటుష్ణములు.
౪ సన్నిపాతజ్వరములు.
౫ దద్దురూష్టములు.

గుణములు— కొంచముగాగాని విశేషముగా గాని చలికలిగి శరీరము వెచ్చపడును నాడి త్వరగానుండును శరీరముకదల్చుటకు ఆసక్తికలిగియుండును విశేషముగా దప్పిపుట్టును ఆకలి లేకపోవుట కడుపులోదేవుల్చుట యొకానొకప్పుడు వాంతి- విశ్రాంతి లేకుండుట- నిద్రపట్టకుండుట నాలుక తెల్లగా బెరడుగట్టియుండుట గాఢమయినరంగుగలిగి కొంచముమూత్రము విరోచనమందము గలిగుండును.

హేతువులు— ఆధారహేతువు- ప్రజ్వాలహేతువు.

ఆధారహేతువు— నాజూకయినతత్వము కలిగియుండుట చలిగాలి మొదలయినవాటికి నోర్వనిశరీరము కలిగియుండుట దుర్బలముగానుండుట మనస్సునందు సంతోషము లేకుండుట.

ప్రజ్వలములు- గాయములు- దెబ్బలు- భోజనం క్రమంగా చేయకబోవుట వాయువునందు భేదముకలుగుట ఇవి సాధారణమయిన ప్రజ్వలములు హేతువులనుగురించి విస్తారముగా తెలియచేయుటకు శారీరం అందరికీ తెలిసివుండదు.

(చికిత్స- రెండు సంగతులు ఆలోచించవలయును.)

౧- చలవనుకలుగచేసే టటువంటిగాని- చమటను పుట్టించేటటువంటిగాని వాంతులనుగాని ఓకరింపును కలుగచేసేటట్టుగాని విరోచనంకలుగజేసేసాధనంనుగాని చేసి దేహమునందుండు రక్తం యొక్క వేగమును తగ్గించవలెను.

౨ శరీరమునకుబలం, ఉష్ణనాశనం, సత్తువకలుగజేసెడు పత్యములతో తిరుగాజ్వరం రాకుండునట్లు కాపాడవలయును.

ఆహ్నికజ్వరము మన్యపుజ్వరము. (Ague)

సూత్రం- ఒకవిధమయిన చెడువాయువువలన కలిగినదై పాళీగావచ్చుచుండును.

గుణములు- ఇవి మూడువిధములుగా పాళీయొక్క మూడురూపములనుసట్టి చేయబడినవి.

రూపములుయెవ్వన- చలిరూప- కాకరూపం- స్వేదరూపం.

చలిరూపం- నిస్సత్తువ- వెన్నువెంబడి చలిపుట్టుట- వణుకు- నోరరుచి కడుపులోదప్పుట- వాంతి, గుండెభారం- నిట్టూర్పులు- వడలువిరుచుకొనుట- ఆవలింతలు చర్మపరితొందరయు, నాడిత్వరగాను, స్వల్పంగాను- నాలుక తెల్లగాను, మూత్రంస్వచ్ఛముగాను, విరోచనబద్ధ కలిగియుండును, ఈ రూపం మూడునాల్గునిముషములు మొదలుకొని నాలుగుమూడు ఘంటలవరకుండును. తనకాక స్వాభావికమునకుతగ్గును అప్పుడప్పుడు కఫవాంతములు చేయును.

కాకరూపము కొంచంకొంచం వేడికలిగి శరీరం క్రమంగా విశేషవేడిని పొందును- సౌఖ్యం లేకుండును, తలభారం నొప్పికలిగియుండును- ఊపిరసనిపాదిగాను- నాడిబలంగాను, త్వరగానుండును దాహాధికం- మూత్రం వి

శేషకంటు కలిగియుండడము, అప్పుడప్పుడు పరాకుమాటలున్ను కలిగియుండు ను తాను కాక ౧౦౪, ౧౦౬ వరకుండును.

స్వేదరూపము, మొట్టమొదట కొంతశరీరం పిదపశరీరమంతంతట విశేషచెమటలుండును- వేడితగ్గును- నాడి స్వాభావికముగానుండును- నాలుక శుభ్రముగానుండును- దాహముండదు ఆకలివేయును- విరోచనమగును- విస్తారం నిరుడగును- మనస్సుఖులాసాగానుండును- నిద్రసయితం కలుగును- ఈరూప మొకఘంట మొదలుకొని యారుఘంటలవరకుండును ఉపగుణములు గాఢనిద్ర చయితన్యము తప్పిన నిద్రవాతనొప్పులు- దగ్గు వడలు చుట్టుకుపోవుట- విరోచనములు, కామెర్లు, వాంతి యొకానొక రోగియందు కానబడును

ఆహికము, కొంత కాలంవరకూష్ణము లేకుండునట్లుండి తిరిగీ వయిన చెప్పిన లక్షణములతో రావడం- ఆహికమనబడును.

(ఇవి మూడువిధములు.)

౧ ఏకాహికమనగా ౨౪ ఘంటల కొకపరియాయయంవచ్చునది.

౨ ద్వ్యాహికము ఇది ౪౮ ఘంటల కొకపరియాయయంవచ్చునది.

౩ త్ర్యాహికము-ఇది ౭౨ ఘంటల కొకపరియాయయింవచ్చునది.

వీటిలో ద్వ్యాహికం సాధారణంగా కలుగుచున్నది ఈ యూష్ణమునందు యేకాహికం ద్వ్యాహికంగాను ద్వ్యాహిక మేకాహికంగా నొకానొకప్పుడగును. ఇందు మొదటివిధంగా రూపభేదంనొందినప్పుడు మంచిగుణంగా నెంచబడును. రెండవదిమంచిదిగాదు.

ఈ యూష్ణంవల్లకలిగే ఫలితములు- జ్వరబిళ్ల, పులదబ్బ (Liver) పెద్దది కావడం (కుడిపక్కలోబిళ్ల) ఈ రెంటిలో జ్వరబిళ్ల సాధారణం సాధ్యాసాధ్యవివేకం- ఈ దేశమందు నీచలిజ్వరం విశేషకాలమైతే నేతప్ప నుపద్రవము ను కలుగచేయునది కాదు. అయితే పురాణించుటవల్ల శరీరంనుండి దీనిని తొలగించుట దుస్తరము,

నిర్ధారించుట- ఏకాహికజ్వరము హెక్టిక్ జ్వరంవలెనుండును, ఈ విషయమై ఉదహరించబడిన సంగతులవలన దీనిని తెలుసుకొనవచ్చును హెక్టిక్

జ్వరంలో నుష్ణం సాయంత్రము మధ్యాహ్న ఏకాహికమందు ఉదయమందును కలుగును హెక్టిక్ జ్వరంలో స్వేదరూపము చాలా నుండి రాత్రియందు చెమటను పుట్టించును- ఏకాహికమందంత నుండదు హెక్టిక్ జ్వరమందు ముఖము గాదరించుచుండును ఏకాహికమందు ముఖము వాడిపోయి చముదు కప్పివుండును హెక్టిక్ జ్వరం విడిచినతరువాతను నాడిత్వరితంగానే యుండును ఏకాహికమందు తిరిగి నాడిస్వభావసిద్ధముగానుండును హెక్టిక్ జ్వరము కురుపుపుట్టుటవల్లగాని చీము దేహములో ప్రవహించుటవల్లనుగాని కలుగచున్నది, ఏకాహికమితర వ్యాధిజన్యము కాదు హెక్టిక్లులో ౧౦౧, ౧౦౨, కంటె కాక యెక్కువుండదు.

హేతువులు- సాధారణంగా నుష్ణంకలిగే హేతువులవల్లను, ముఖ్యముగా విషవాయువు వల్లను.

ఈ వాయువు చిత్తుగలిపల్లపు భూములనుండివచ్చెడియు నుద్భిజ్జపదార్థములును జంతుపదార్థములును కుళ్ళుటవల్లను పుట్టెడివాయువైయున్నది. ఈవిషయవాయువు శరీరమునందు ప్రవేశించిన తరువాత నుష్ణమును కలుగచేయుటకు రెండుదినము మొదలుకొని ముప్పదిరోజులుపట్టును.

చికిత్స- శాంతిఅని- ఉపశాంతిఅని రెండువిధములు- ఉపశాంతి యుష్ణమున్నపుడున్ను శాంతి యుష్ణమువిడచినపుడున్ను చేయవలసియుండును ఉపశాంతియందు మొదట చెయ్యవలసినది రూపములను త్వరగా అంతపుచ్చుటమున్ను దుర్గుణములను పోగొట్టడమున్నై యున్నది శాంతి యందు మొదట యుష్ణమురాకుండా కాపాడవలెను- తరువాత శరీరమునకు బలముకలుగచేయవలెను.

ఉపశాంతి- చలిరూపమునందు కాకచేసే అవుషధములను పైకి లోపలికిన్ని త్వరగా శరీరమునందు కాకపుట్టుటకై యివ్వవలెను- వాంతికిచ్చుటవలన నీరూపము త్వరగాపోవుచున్నది- విశేష కాక చెయ్యకూడదు.

యిపికాక్ ...... ౨౦ వడ్లగింజలెత్తు.
టార్టర్ యిమిటిక్. ౧ వడ్లగింజెత్తు.
వేడినీళ్లు ........ ౧ గిన్నెడు.

కలిపి వెంటనేయిచ్చితె వాంతియుడ్చు పైగుణకారినిచ్చును.

స్పిరిట్స్అమోనియా. ... ౧౫చుక్కలు.

టించర్ ఓపీయమ్ ..... ౧౦చుక్కలు.

కర్పూరపునీళ్లు. ... ... ౧గిద్దెడు.

కలిపి యిచ్చినయెడల కాకపుట్టును. ... ... ... ... ...

కాకరూపము- ఈ రూపమునందు చలవచేయకలుగచేసేటటువంటిన్నీ చెమటను పుట్టించేటటువంటి ఔషధములన్నియివ్వవలెను. జేమ్సుపౌడరు ౬ వడ్లగింజలెత్తు రెండేసిఘంటలకొకపర్యాయం ఇవ్వవలెను అంటుమనీపౌడరు ౨ వడ్లగింజలెత్తు రెండేసి ఘంటలకొకపర్యాయం యివ్వవలెను.

స్వేదరూపము ఇందులోచలిగాలి తగలకుండా దేహమున్ను గాపాడవలెను. — — — — — — — — — —

శాంతి- ఉష్ణంరాకమునుపు ౫, ౧౦, ౨౦, ౩౦, వడ్లగింజలెత్తు క్వైనన్ అనేయౌషధం మాత్రజేసిగాని, ౧౨వంతులు నీళ్లలో ఒకవంతు గంధకపు ధృతివేసి క్వైనన్ ౧ వడ్లగింజెత్తుకు ఒకొకటిచుక్క చొప్పునకలిపి నీళ్లతో ౨ ఘంటలకొకపరియాయం జ్వరం తిరిగీ తగలకముందే యివ్వవలెను, ఈజ్వరమునందిది ముఖ్యమయినయౌషధము లైకర్, ఆర్సెని, కేలిను, అన పాషాణపు అరఖు ౪ చుక్కలు మొదలు ౧౦ చుక్కలువరకు వృద్ధిచేసి యేకముగా గాని, నల్లమందరఖులో కలిపిగాని, ౪ ఘంటలకొకపరియాయ ముష్ణము లేనపుడే యివ్వవలెను- ఈ ముఖ్యమయినచికిత్సకు పూర్వమే — —

---

పొటాష్- టార్ట్ రేటీస్. — — — — —

డికాక్షన్- ఆలోజు- కంపౌండు- — — — —

ఈ రెండూ కలిపి యివ్వవలెను- ఇందువల్ల విరోచనములు బాగాయగును. — — — — — —

పార్శ్వవాతము- పార్శ్వనొప్పి- పదింట అయిదింట కలిగెడు వాంతియేమి విరోచనము లేమి యీజ్వరమునకు చేయు ముఖ్యచికిత్సవలన కుదురును నల్లమందరఖున్నూ యీతిరున్ను యిచ్చినయెడల చలిరూపం త్వరగావిడు

చును. ఇవి డ్రాము మోతాదు చొప్పున నివ్వవచ్చును, ఈ మందు కాకరూప మునందున్న గుణమిచ్చును- వున్నము లేని వేళ నిచ్చుమందులు.

ఫెర్రైయెట్ ఆ క్వాయినీని పేరైటస్ ౫ వడ్లగింజలు.
సిరప్పై ఆరేన్షియై .......... ౧ డ్రాము.
దాల్చినీ అరిష్టమువేసిననీళ్లు. ... ... ౧ గద్దెము.

కలిపి ఘంటఘంటకు యియ్యవలెను. — —

ఎక్స్ట్రాక్టు కాలొసింతు... ... ౫ గ్రే
కేల్ మిల్ ....... ...... ౫ గ్రే

కలిపి రెండుమాత్రలు చేసి విరోచనమ్మును కావడమునకై యప్పుడప్పుడి వ్వవలెను.

రోగంరాకుండా చేసే సాధనములు ఉదయ సాయంత్రములయందు చందు గాలి శరీరమునకు తగలనివ్వకూడదు భూమిమీదను పడుకుండకూడదు కొం డ ప్రదేశములయందు- జోబస్థలములయందుండు తోటలకుగాని నదులకు గాని యవతలబస చేయవలెను అట్టిజోబస్థలములందు పాటుపడుటకు వెళ్ల కమునుందు సత్తువైన వేడిపదార్థములుభుజించి- మరివెళ్లవలెను- క్వైనస్ రెండుమూడు వడ్లగింజలెత్తు రోజూపుచ్చుకొనుచుండవలెను వాసస్థలము లు బహుశుభ్రముగా నుండవలెను, ఈ రుక్మతవల్లకలిగెడు పాండువజ్వరబ ల్ల అతిసారము మొదలైనవి దీనియందుకలుగుచున్నవి వీటిసాధనములు వెను కనుండి చెప్పబడును.

వెం॥ ౧, ౮, ౨౨, ౨౬, ౩౧, ౪౮, ౪౯, ౫౦, ౬౭, ౮౮, యిచ్చేది.

---

(పాళీజ్వరములు.)

( Remittent Fever )

సూత్రం- స్పర్శవల్లకలిగినదై యొకప్పుడు కొంచంగానున్న మరియొక ప్పుడు విస్తారంగాను జ్వరంకలిగి యెప్పుడువిడువక యుండునది.

ఇది రెండువిధములు- ౧ జ్వరము పైత్యజ్వరము.

గుణములు- ఆహ్నికజ్వరమునందు మొదటగల గుణములే కలిగియుండును

గాని చలి విస్తారముగానుండదు-కుదువు సాధారణగామునుండదు-తలనొ
ప్పి- భారంవిస్తారముగానుండును- మొగం కాండ్రించుండును, అప్పుడప్పు
డు పరాకుమాటలుండును- కడుపులోనున్న ప్రకృతులందున శూలకలిగివుం
డును. కడుపులోతిప్పు పసరువాంతి- విరోచనబద్ధం- స్వల్పఅల్పాచమానం
యివి మొదటకలిగెడుగుణములు పురీషమునల్లగాను, ఆకుపత్సగాను,విశేష
వాసనగలిగుండును- విశేషంగా నుష్ణముండును- వాలుక బూడెదపూతన
ట్లుండును-* వాడి వకరీతిగానటించదు జ్వరంతగ్గగానే శరీరమందు చమట
పట్టును, ఇప్పుడు చిన్నపాళీఅనబడును,రోగి స్వల్పయూష్ణమువల్ల బాధపడు
ను, యిపుడు తలతిప్పు- సుస్తీకలిగుండును- యీలాగున రెండుఘంటలు సరి
యంతముండి తిరుగా నుష్ణముహెచ్చును, యీలాగు చిన్నపాళీతరువాత
పెద్దపాళీతిరుగా చిన్నసాళీవరుసగా రమేషు ౧౪, ౨౧, ౨౮, రోజులువచ్చి
అటుపయిని విస్తారం చమటపట్టి రోగము తొలుగును జబ్బుచేసే సంగతుల
యందు చిన్నపాళీకనుగొనుటకు అవకాశముదిక్కుకుండును చర్మము పత్సి
బడును,నాలుకపత్సనై శ్లేష్మముచే కప్పబడియుండును,విరోచనందుర్గంధము
కలిగుండును,బలముడుగును,నాడి చేతిక్రింద తాడులాగున త్సేయుండును.
పళ్లయందునరములు లాక్కొనిపోవును, మైకముకప్పును అటుపైని హానికర
మైన ఒడలు తెలియకుండా నిద్రలాగువుండే స్థితిలోకి తెచ్చును, దీనిపరిమితి
౫, ౬, రోజులుగాని ౫, వారములుగాని సాధారణముగా ౧౫, దినములైవు
న్నది- పైత్యోష్ణమునందు పై చెప్పిన గుణములుగాక కడుపులో బాధయు
న్న పసరువాంతి విశ్రాంతిలేకుండుట మైకముగాని పరాకుమాటలుగాని
కలిగుండడము ముఖము కాండ్రించియుండును.

నిధానించుట- ఆహిక జ్వరమునుంచి జ్వరం పూర్ణంగా విడచిపెట్టక
పోవడంవల్లను బడివేటుజ్వరమునుంచి చిన్నపాళీ పెద్దపాళీ కలిగుండుట
వల్లను, ఈ జ్వరమునుపోల్చనగును.

సాధ్యాసాధ్యావివేకము- చిన్నపాళీవిస్తారపు సేపుండినయెడలను పె
ద్దపాళీ విశేషతీక్షణముగా లేకుండినను మంచిగాను సాధ్యముగాను యెం

* స్వాభావికముకంటే, ౨·౧౦ వఱకు కాక హెచ్చును.

చేబడును, ఆహికజ్వరముకంటె నీజ్వరమిబ్బంది పెట్టును, ఈ జ్వరములో వట్టి జ్వరము పైత్యజ్వరమంత తొందరను కలుగ చేయును.

చికిత్స- ఆహికజ్వరమువలెనే చిన్నపొరి కలిగినప్పుడు క్వైనాగాని, పాషాణ సంబంధమైన యౌషధములుగాని నివ్వవలెను. ఈ జ్వరము విశేష నీరసమును గలుగచేయునది గనుక—విరోచనసాధనము వగైరాలు జాగ్రత్తగా చేయవలెను. ఈ రుగ్మత సంభవించిన స్థలమునుండి యితర స్థలమునకు రోగిని పంపించుటీజ్వరమందు ముఖ్యము, జ్వరము తగ్గినప్పుడు-క్వయినను Quinine ౧౦ లేక, ౧౫ గ్రేనులు రెండు ఘంటలకొకటి మారు యిచ్చేది. వార్బర్గుసు, అరఖు, Warburg's tincture. ఈ జ్వరమునందు-మంచి గుణము యిచ్చును.

ఈ జ్వరమువల్ల విరోచనములు, గ్రహణి, జ్వరబల్లలు. పాండువు సంభవించును. ( నెం ౧, ౨౨, ౩౧, ౨౫, ౨౬, ౪౮, ౫౦, ౬౭. ౮౮, ) ఇచ్చేది.

—(*)—

(బడి వేటు ఉష్ణము.)

( Febricuia )

ఎడతెగక విశేష ప్రజ్వలముగా కొంచము సేపులో పొయ్యేదై యున్నది. తరుచుగా అర ఘంటలు కాస్తున్నది.

గుణములు, శరీరము విశేష వేడి, నాడి వేగము, మొగము కాండ్రించియుండుట, నాలుకయందు తెల్లగానుండుట. విదాహము, ఆకలి, మందము, నిస్త్రాణ, తల, నడుము, అవయవములలోను స్థిరముగాని నొప్పులు సాధారణముగా గలిగియుండును. అప్పుడప్పుడీజ్వరము, చలితోవచ్చి చమటలో విడిచిపోవును.

హేతువులు, దాహము, చలిగాలి, శరీరమున, బట్టకప్పుకోకుండా పట్టించడము. క్వాకైనగడులు భోజనమందుగాని, దాహమందుగాని మితిమించుట, విస్తారముతాగుట, అంటువ్యాధియైన (సిమ్ప్లెస్ ఫీవర్) బలవంతులయందు ప్రవేశించినపుడుగాని, మశూచకము మొదలగు అంటువ్యాధులవల బాధను పొందినవాడు తిరుగా ఆ రోగము అంటినపుడుగాని, యీ

జ్వరము కలుగుచున్నది. నిరూపించుట, యితరజ్వరములనుంచి బాధ స్వల్పముగా నుండుటవల్లను, మహోదిక జ్వరమునుంచి నడుములో నొప్పివిశేషముగా యుండుటలో లేకుండుటను యీజ్వరము కనుగొనబడును. సాధ్యాసాధ్యవివేకము- ఇబ్బంది కలుగజేయునది కాదు చికిత్స- విస్తారతీఁడివల్లగాని, తాగుటవల్లగాని, వచ్చినజ్వరమునకు వాంతికి యివ్వవలెను, ఉష్ణము-యొక్క గుణములు సాధారణంగా-(F నెం ౮, ౨౨, ౩౧, ౪౮, ౪౪, ౮౮)

ఇచ్చుటవల్ల పోవును. యిందువల్ల విరోచనమగును, బలము చేయని హారము యివ్వవలెను. విస్తారముగా, జ్వరము కలిగినపుడు- (డోవర్సుపౌడరు) ౧౦ గింజలెత్తు రాత్రి పడుండునపుడిచ్చి యుదయమున పైని చెప్పిన విరోచనమయ్యే మందు యివ్వవలెను. రోగి వక రోజు పరుండవలెను. తేయాకునీళ్లు ఉద్భిజ్యపదార్థములతో సత్తువలేనివి-చలవ కలుగచేసే దాహవస్తువులు పథ్యంగా నివ్వవలయును. జ్వరమున్నంతవఱకు. F నెం ౮౮, ౯౪, ఝూముఝూముకు యిచ్చేది.

---

## సన్నిపాతజ్వరం Typhoid Fever.

దీనిని ౨౧ రోజు ఉష్ణమని అందురు. (గుణములు) బుగ్గలు యెఱ్ఱగాను, మొగమునందొక విధమైన, ఆశగానుండే లక్షణముండును, తొందరగాను, స్వల్పంగాను, దుర్బలంగాను, నాడి యుండును, నాలుక నల్లగాగాని గోధుమవర్ణముగాగాని యుండి ఎండిపోయియుండును. పళ్లయందు. పళ్ల కుదుళ్లయందు మలినము గలిగుండును. విరోచనం చెడువాసనగా నుండును, తరుచుగా తెలియకుండా విరోచనమగును, మూత్రంకొంచము చిక్కగా కొంచముగానగును శరీరముయొక్క *చర్మమెండిపోయి

---

* కాక నాలుగైదు రోజులు వఱకు క్రమంగా హెచ్చును. సాయంత్రము, ౨ డి ఉదయముకంటెయెక్కువ గానుండును. ప్రతి పుదయము, ౧ డి తక్కువ యుండును. గనుక—ప్రతిరోజు ౧ డి కకయెక్కువగా నుండెను ౧౦౪ వఱకు యెక్కును, ౧౦౮ వఱకు కాక హెచ్చుట కలదు. జ్వరంతగ్గునప్పుడు ప్రతిరోజు పుదయం ౧ లేక, ౨ కాక తగ్గుచుండును.

న్నట్టు పొడిఁగానుండును. విశేష గాఢమైన జబ్బు చేసినపుడు, ప్రలాపము-
చేతులు, కాళ్లు, పుణుకొఁనుటపక్క బట్టలు తీసి వేయుట విశ్రాంతి లేకుం
డుట, మైకము, తెలివితప్పియుండుట, శరీరంమీద నల్లనిచుక్కలు, వెక్కి-
ళ్లు, కడుపుపొంగు మూత్రం బంధించుట, గొంతులో గురుకు కలిగియుం
డుట- ఊపిరిన్నీ, రోగియొక్క దేహమున్ను, పీనుగవాసన వేసుటయు, క
డుపుపైని నొప్పి, వాంతి, కడుపులో తిప్పు, విరోచనములు కలియుండును.

హేతువు- చెడిపోయిన జంతు పదార్థములను భుజించుట వల్ల-
వేసవిలో విశేషంగా గలుగుచున్నది. చెడిపోయిన జంతు పదార్థములు
కలసిన నీళ్లుయేమి, గాలియేమి, శరీరమున ప్రవేసించుటవల్లను గలుగును.

చికిత్స- నరములకున్ను, రక్తముగల నాళ్లకున్ను, సత్తువ గలుగున
ట్లు చేయవలెను. ఇందుకు వైనుసత్తువగల వస్తువు, (పథ్యము) బ్రైనను-
నల్లమందు, అమోనియా, మొదలైన వాటవల్ల కుదర్చ నగును. ఈ రుగ్మ
తయందు విరోచనబద్ధం గలిగినపుడు అథోమార్గం గుండా పిచ్చకారితో
నాయుద మివ్వవలెను. అటుపైని గ్రేపొడరు తరుచుగా నోరు, స్వల్పం
గా పట్టీవటకు యివ్వవలెను. నొకుక్క పిడచలు గాని—గట్టి పదార్థము
లుగాని—తినకూడదు- కోడిగుడ్లు, పాలు, అరరూటు, అనేక తరహాలు
గా నివ్వవచ్చును. ఇందులో నేవి పుచ్చుకు నేవారవే పుచ్చుకొనవచ్చును.
గుడ్లు కొంచముడకబెట్టి కాపీతో గాని—తేనీళ్లతో గాని—కలిపి యివ్వ
వలెను. (బీఫ్టీ) యనే గోమాంసరసము నొకటి పుచ్చుకొనవచ్చును- పో
ర్టువైను మొదటనుంచీ కొంచము మొదలుకొని క్రమంగా మూడర్థపా
వుల వటకు నివ్వవచ్చును. ఇందువల్ల బలము కలుగును, రుగ్మత బాగా ప్ర
వేసించుచున్నపుడు, విరోచన బద్ధమైనయెడల సరగిన్దైను ఆముదంలో ౧౦
చుక్కలు (నల్లమందరఖు) వేసి యిప్పించవలెను. కడుపులో తిప్పు, సోడా
వాటరులో మంచున్ను, హైడ్రోసైనిక్ ఏసిడ్, అవేయురఖు రెండుచుక్క-
లు, కలిపి యిచ్చినయెడల కుదురును. కడుపుపైని నొప్పి విస్తారంగా నుం
డిన, సలఉడజర్ జలగలు, నాభికి కుడిప్రక్కను గాని—గుదస్థానము చుట్టు
న్ను గాని—కటిపెంచి రక్తము పీల్పించవలెను. నొప్పి పుట్టినయెడల వేడి

నీళ్లలో గుడ్డ ముంచి పిడిచి దానితో కాచుట, అవపిండి, పోల్టీసు, వేయుట. టర్పెంటాయిలు, కడుపుకుఁ బూసి ఆ పైని వేడినీళ్లు, కాచుటవల్లనున్నపోవుచున్నది. విరోచనము కట్టుటకు యీ దిగువ నుదహరించిన మందు యివ్వవలెను. (F) నెం ౪౭ యిచ్చేది.

కంపౌండు సినమన్ పౌడర్. ... ... ... ... ౨౦ గేర్ని.

నల్లమందరఖు. ... ... ... ... ... ... ౫ చుక్కలు.

చాకుమిక్చర్. ... ... ... ... ... ... ౧ గిద్దెడు.

ఇవి కలిపి రోజును మూడునాలుగు పర్యాయములు, నివ్వవలయును- ప్లంబై కంఓపియోపిల్, 3, ౫, ౧౦ జలెత్తు రోజుకు మూడు పర్యాయములు నివ్వచ్చును. రక్తము పడుట కలిగినపుడు కసగలిగిన వస్తువులు, నివ్వవచ్చును. నల్లమందు, మైలతుత్తం, కలిపి యివ్వవచ్చును. ౫ గేర్నులు, గేలికేసిడ్, మూడు పర్యాయములు రోజుకు యిచ్చిన రక్తము కట్టును. టర్పెంటైను. ౧౦, ౨౦ చుక్కలు యిచ్చుటవల్ల రక్తము కట్టుటయే కాక కడుపుపొంగును. తీసును- వెక్కిళ్లు క్లోరిఫారమ్, వాసనజూచుటవల్ల పోవును. విశేష దుర్గుణములు లేనపుడు క్వైనన్, అఱగింజయెత్తు- ౧౫ చుక్కలు నీళ్లతో జేర్చి గంధకపు ధృతిలో కలిపి గిద్దెడు సింకోనా కషాయంతో రోజుకు రెండుమూడు పర్యాయములు రోగము కుదిరేవఱకు నివ్వవచ్చును. రోగము కుదిరిన తరువాత, భోజనమునందు కొద్దికాలము బహుజాగ్రత్తగా నుండవలెను. అజీర్ణవస్తువులేమాత్రము తిగిలినను, రోగము తిరగబడుచున్నది. జ్వరము తగ్గేసాధనములు. (F) నెం ౮౮ యిచ్చేది. నెం ౨౫, ౨౬, ౩౧, ౪౮, ౬౭, ౭౯, ౯౬ లు యీ జ్వరముకు సాధనముబుగా తెలియువలెయును.

---

## దద్దురు ఉష్ణము. Eruptive Fevers.

జాతులు. ౧ మసూచికము, ౨ చిన్నమ్మవారు, ౩ వేపపువ్వు- ౪- అడ్డపుట్టి- ౫ జడుపు.

౧ మశూచకము- లేక—స్ఫోటకము. Smallpox,

దీని విషము శరీరములో ప్రవేశించిన తరువాత, ౧౦ దినములకు- ఉష్ణము తగులును. అందునడుము నొప్పి విశేషముగా నుండును. జ్వరమునకుండు గుణములన్నీ యుండును. జ్వరము తగిలిన, ౪౮ ఘంటలకు దద్దురు మొదట నుదుటను, మణికట్టు యందును, కానబడి శరీరమందంతట- క్రమముగా వ్యాపించును. రమూరమీ, ౩౬ ఘంటలకు దద్దురు బాగా కలుగును. అపుడు జ్వరము తగ్గును. (తరిహాలు-) ౨- స్పష్టము. ౨- మిళితము. ౩- భీతోత్పత్తి- ౪- బలహీనము. (స్ఫోటకమందు) గుణములు ముఖ్యముగా- ౧- స్పష్టమునందు చలి వేసిన తరవాత- ౪౮ ఘంటలకు, దద్దురు కలుగును. ఇది మొదట యెఱ్ఱగాను, స్వల్పమైన చిన్న బొటిలలాగు లేచును. మూడవ దినమున ముత్యములగును. అనగా—కుండలగును. వీటిక్రింద ఘట్టిగాను మధ్యను, గుంటయునుండును, వీటియందు నిర్మలమైన రసము కలిగియుండును. ౫- దినమున ప్రతికుండచుట్టు యెఱ్ఱని మచ్చ కలుగును- ఈ మచ్చ వృద్ధిపొందగా- ౬- వ నాడు, కుండ మధ్యనుండు గుంట లేసంగా మొనకలిగి యుండును. ఇపుడు వాటియందు చీముండును. ౯వ నాడు కుండలు పగిలి మాడలు కట్టుటకు ఆరంభించును. ఈ ౯ దినములవఱకు కొంచము గొప్ప జ్వరము కలిగియుండునుగాని—ఇపుడు విడిచి పెట్టును- కుండలు విస్తారంగా వేసినట్లయిన తిరుగా ఉష్ణమువచ్చి, ౪- ౫- దినములుండును. అటుపైని, ౧౦ దినముల వఱకు మాడలు కట్టుచుండును. దద్దురారంభించినది మొదలు, ౧౪ వ నాటినుంచి మాడలు రాలుటకు ప్రారంభించును ప్రతికుండయందు- ౫- ౬ గదులును వాటి మధ్య త్రాడును కలిగియుండును. ఈ గదులలో రసముండును. త్రాడు కుండయొక్క పైభాగమును లోపలికి అణది పట్టియుండును. ఇందువల్ల మధ్యను గుంట కాకుండును. చీము పట్టినపుడీ త్రాడుపోచున్నది- అందువల్లనే మొన తేరును. ఈ లాగు గదులు కలిగినందుకు దృష్టాంతము మాడ రాలగానే మత్సయందు గుంటలు చూచుచున్నాము.

**౨- మిళితము- దీనియందు మొదటి దినము, ౨ దినముపైని చెప్పి**

న గుణములే యుండును. గాని— జ్వరము తీవ్రముగా నుండును. ౩ వ దినమున నోటియందు గొంతుకయందు ముక్కు మొదలైన అపాయస్థలము లందు కుండ దద్దురు కానబడును రుగ్మత విశేషతీవ్రమై దద్దురు విస్తారమై నయెడల పరాకు మాటలు, మైకము, సంధిగుణములు పుట్టించును.

౩- భీతోత్పత్తి- ఇది భయంకరమైనది. ఈ పైని చెప్పిన గుణము లు గాక— విశేషతొందర గుణములు కలిగియుండును. శరీరం యావత్తు నల్లగా కానబడును. ఇందువల్లనిది- (బ్లాక్ ఫాక్) కుండలు మాడినవని అం దురు. ఈ జాతి, ౫- ౬ వ దినమున రోగిని చంపును. తిరిగి వచ్చే జ్వరము కుండలు చీము పట్టినపుడు, ఉష్ణము తిరుగా తగులును. తరుచుగా గాఢ ముగా కాచును, కుండలు వొకటికొకటి కలిసిపోయి అసహ్యాకరమైన కు రుపులు కలుగచేయును. ఒకానొకపుడు వీటియందు కుళ్లుపుట్టి రోగినిచం పును- ఊపిరి, తిత్తులు గుండెకాయ, నెదడు వీటియందు వరపు కలుగచే యును. అమ్మవారు విడిచిన నీబాధలువల్ల జీవించుటకు రోగికి అయిష్ట ముగును.

౪- బలహీన- ఇది వడ్డిటీకాలు పడ్డతరవాత గాని— ఇంగ్లీషు టీ కాలు పడ్డతరవాత గాని— వచ్చేరుగ్మత యిది సూక్ష్మముగా నున్నది. ఇందువల్ల మనుష్యునికి యిబ్బంది కలుగదు.

చికిత్స- జ్వరమునకు సాధారణముగా ఉష్ణములో చేయు చికిత్స యే దీనికిని చేయవలెను- అయితే గాఢచికిత్స గూడదు.

కార్బోనేటు పొటాష్... ... ... ౨౦ గింజలు-

నిమ్మపండ్ల రసము. ... ... ... ... ॥ అర అవునుసు.

ఈ రెండూ రెండుగిద్దెలు నీళ్లలో ప్రత్యేకముగా కలిపి యొకదాని తోనొకటి కలిపికొంచము పొంగినప్పుడిచ్చేది, కుండలు పోస్తున్నపుడునిద్ర కలుగుటకున్నూ కుండలయందుండు బాధ పోవుటకున్ను నల్లమందివ్వవలె ను. పత్యము సత్తువను కలుగచేసేటట్టున్ను కాకవస్తువు కానివిన్ని యివ్వ వలెను॥ బలహీనమైనపుడు వంటికి సత్తువిచ్చే ఔషధములు నివ్వవలెను. పోర్టువైను, అమోనియా, ఖారకు మొదలైనవి యివ్వవచ్చును. రుగ్మత

మళ్లునపుడున్ను, తిరుగా జ్వరము కలిగినపుడు సత్తువ వచ్చునట్లు సాధనం చేయవలెను. స్వల్పముగా విరోచనసాధనం చేయవలెను. కేల్ మైన్, గాని — బోరకుగుండ గాని — కుండలుపైని జల్లవలెను. విశేష సుస్తికి బ్రాంది, నల్లమందు, క్వైనీన్, ఆరతికర్పూరం, పోర్టువైను యిచ్చి పో గొట్టవచ్చును. నేం ౩౯,౪౪ అగత్యముగుచో నిచ్చేది.

---

## చిన్నమ్మవారు, లేక ఆట్లమ్మ. Chicken Pox.

గుణములు- స్వల్పమైన ఉష్ణము, ౨౪ ఘంటలు కాచును, అటుపైని వీడిన పటానీ గింజలంత లేసి కుండలు లేచును, అవి బహు నిర్మలము గానుండును. వేడినీళ్లచినుకులు దేహమందు పడుటవల్ల కలిగిన పొక్కులు వలెనుండును. ప్రతికుండచుట్టు యెఱ్ఱనిమచ్చ కలిగివుండును. వీటిని యింగ్లీషులో (ఎరివెూలా)అందురు- కుండలన్నీ యొక్కపర్యాయము గలుగవు మొదటకానబడుకుండలు యెండిపోయి ముడుచుకొని మూడు నాలుగు రోజులలో పక్కులుకట్టును- యీమాడలటుపైని మూడురోజులలోరాలును కాబట్టి యీరుస్మత వారముర్రోజులకంటె యెక్కువ మితిగలదికాదు- తిరుగా నుష్ణమించులోతగలదు ఈయుష్ణమునకు (శెకెండరీఫీవర్)అని పేరు ఈ రుస్మతకు చికిత్సలేకుండనే కుమరుచున్నది- విరోచన బద్ధమైతే సాధారణముగానయ్యేలాగు కంపౌండురూబర్బుపౌడరు ౧ డ్రాము నీళ్లలోకలిపి యివ్వవచ్చును. — — — — —

హేతువు- ఇది అంటురుస్మతేగాని మశూచకము పుట్టించే హేతువు ఈరుస్మతనుపుట్టించదు- యిది చిన్నపిల్లలయందున్ను దుర్బలశరీరముకలిగి నల్లగానుండేవారియందున్ను కలుగుచున్నది- పెద్దవాళ్లయందు సాధారణముగాకలుగును దీనియొక్కకాలములో టీకాలువేస్తే యీరుస్మతయొక్కలక్షణములు కానబడవు అనగా కార్యకారికాదు టీకాలువేయుటవల్ల యీరుస్మతరాకుండా కాపాడలేదు నెం ౪౪ వాడేది.

—(౦)—

## ( వేపపువ్వు. )

**(Measles,)**

గుణములు- ముందుగా శైత్యముచేసినను గుణములుకలుగును చలి నిస్త్రాణ, శిరోభారము, తలనొప్పి, ముక్కడము, దగ్గుగొంతుకు వొలుగు రాయడము ఊపిరితీయుటకుయిబ్బంది, తుమ్ములు,ముఖముమరద,కండ్లమంట, కన పొట్టలుబ్బు, కండ్లనుంచి ముక్కునుంచి నీళ్లుకారడము, వాంతి, కడుపులోతిప్పు, విదాహము, నాలుకయందు మలినము కలిగియుండి జ్వరములో సాధారణముగానుండే గుణములుండును తనుకాక ౭౨ ఘంటలైనతరవాత దగ్గి వంటియందు స్వల్పబొటిములు పుట్టును- యిది మొదట ముఖముమీద ముందుగా దోమకాటులాగు కానబడును యివిమొదట ప్రత్యేకముగానుండే గుండ్రని మత్తులుగానుండును క్రమంగా నివికూడుకొని గుంపు గుంపులుగానగును మొఖమొనంద మెడయందుతప్ప ఈబొటిమలు దేహమునకలసేయుండును- సాధారణముగా నీదద్దురు కలిగిన మరునాడు జ్వరముపోతున్నది మూడవ దినమునుంచీ బొటిమలు తగ్గుటకు ఆరంభించును ౫వనాటికి బొత్తిగాపోవును- అప్పుడు చర్మంమీద వుల్లిపొరలాగు పొట్టులాగురాలిపోవును-ఇవ్వుడీస్థితిలో ఒకానొకపుడు విరోచనములుపట్టుకొనును దద్దురు కనపడగానేయున్నము శైత్యగుణలమున్నీ పోవుచున్నవి గాని సాధారణముగా అనేకమందికి హెచ్చయి దద్దురుపొట్టులాగు రాలుసమయము పోవుచున్నది- ఈరుగ్మత సాధారణముగా ౯ రోజులు మొదలు ౧౨ రోజుల వరకునుండును- కొందరు వేగమే తెరిపిగానుందురు.

నిధానించుట- అడ్డపుటియందు దద్దురు అర్ధచంద్రాకృతిగాను మిక్కిలి యెరుపుగానుంధును- వేపపువ్వులో మొదట జలుబుగుణంలన్నీ గలిగియుండును అడ్డపుట్టిలో నుష్ణంవచ్చిన నాల్గవదినమున దద్దురు పుట్టును- గొంతుకు పచ్చిపుండుచేసియుండును- రోజియోలా అనేరుగ్మతయందు గొంతుప్రభావమునగలుగదు. ఈలక్షణములవల్ల నీవేపపువ్వు నీరెండురుగ్మతలనుంచీ భేదింపవచ్చును.

— — —

సాధ్యాసాధ్యావివేకము- సాధారణముగా యిబ్బందికలుగచేసేది

కాదు, బలమైన దేహములయందు హానిని కలుగజేయుట యరుదు, దుర్బలులైన పిల్లలయందీరుక్మతయొక్క శైత్యగుణములు, ప్రబలములాయనా, యిబ్బంది కలుగజేయును. దుర్గుణము లేవనగ విశేష ఆతురత, గొంతుపుయలుగురాయుట, వాంతి, వెకిళ్లు, విరోచనములు, పరాకు మాటలు, కాళ్లు, చేతులు, చలవలు, విస్తారము చమట- నరములు చుట్టుకునిపోవుట.

హేతువులు—మశూచకమునకువలెనే యిదిన్నీ అంటుజాతి వ్యాధియైయున్నది. దీని విషము శరీరములో ప్రవేశించిన పిమ్మట- ౭ మొదలు- ౧౮ రోజులు వఱకు రుక్మత కానబడదు. ఒకపర్యాయము రుక్మత గలిగిన తరవాత తిరిగి యారుక్మత తరుచుగా గలుగదు. ఒకానొకప్పుడు రెండేసి, అంటుజాతులయొక్క విషములు దేహములో ప్రవేశించి యొకటి పోయిన తరవాత నొకటిగాని—యొకటి యుండగా మఱియొకటిగాని—వచ్చును. మశూచకము వేపపువ్వు యీలాగు వచ్చును, నెంరలా- వాడుక చేయవచ్చును.

## అడ్డపుట్టి. Scarlet Fever,

సూత్రము—విశేష మెరుపుగానుండే దద్దురుతో కూడిన జ్వరము.

ఇదిమూడు విధములు. ౧ సాధారణము. ౨ మధ్యమము. ౩ తీవ్రము. ఇందులో మొదటిది యిబ్బంది చేయునది కాదు— మూడవది తరుచుగా మృతికలుగజేయును.

—*) మధ్యమము. (*—

పైన చెప్పిన అంటువ్యాధులవలెనే జ్వరము తగిలిన రెండవరోజున మంకెనపువ్వు ధాతువు [illegible]గిన దద్దురు కనబడును. గొంతుకలో నుసి గలిగి కొండనాలుక [illegible] స్థలమెఱ్ఱబడి గుటక వేయుటకు దుస్తరముగాను నొప్పిగాను నాలుక యెఱ్ఱగాను చెవులయందును చెక్కిళ్లవెనకను నొప్పిగానుండును. ఉష్ణము బహుతీవ్రముగా కాయును, తనుకాక- ౧౦౪ డి, వఱకు హెచ్చును. త్వరితనాడికలిగి యుండును. అనగా నాడి, త్వరగానుండును. విభ్రాంతి తలనొప్పి బలహీనము ముఖము వెల్తికళకలిగి

ను, ౬,౭వ దినమునుంచి దద్దురు తగ్గును, దద్దురనగా దోమ కాటులాటి చిన్న బొటిమలు కలిగి వుండును. ౮ వ దినమునుంచి దద్దురుయావత్తు, ఉల్లిపొరలాగున రాలిపోవును. ఈలాగు, ౨- 3- వారములు రాలును, ఇప్పటిలో సాధారణముగా జ్వరము కలుగుచున్నది. ఇదియే ( శెకెండరీఫీవర్ ) అని యందురు. ఈసమయమందే రోగియొక్క ముక్కులోనుంచి చెవి నుండి రక్తము పడుటారంభించును. కళ్లు కలుగును, మెడమీద భాగము, కుళ్లుట కారంభించును. అందువల్లనున్ను చావును, కలుగచేసేటట్టు రక్తము సారును. శరీరములోని మూలుగుదబ్బ (లివర్) గాని- యాపిరితిత్తులు గాని—బాధనొందును. విరోచనములు- గ్రహణి కలుగవచ్చును. ముఖ్యముగా, ఈ రోగమువల్ల కలుగునది, ఒడలు వాపు, ఈ రుగ్మతయందు సాధారణముగా గలుగును. అందువల్ల మూలుగుదబ్బ యాపిరితిత్తులు స్వాభావికముకంటే విస్తారము పని చేయవలసి యుండును.

—*) సాధారణము. (*—

ఈ తరహాయందు గొంతుక బాధకలిగి యుండును, పైనిచెప్పిన గుణములనేకముండును గాని—విశేషము వడిగా నుండవు.

—*) తీవ్రము. (*—

ఈ తరహాయందు రుగ్మత ప్రారంభము వచ్చినుంచీ మెడ దగ్గిర కుళ్లుట విస్తార రక్తము కారుట ముక్కువెంబడి, చెవులువెంబడి, ముడ్డి వెంబడి, మైతము- రక్తము కారును. ఇందులో గలుగు జ్వరము సన్నిపాతజ్వరము వలె నుండును. విశేష నిస్సత్తువు గలిగియుండును. ఇందులో చికిత్స కార్యము లేదు.

సాధ్యాసాధ్యవివేకము—సాధారణము యిబ్బందిలేనిదిగాదు. సాధ్యము రెండుతరహా బలమైన శరీరములలో కలిగితే జబ్బు కలుగదు. సాధ్యము, తీవ్రమునకు చికిత్స కార్యము లేదు.

ఆధారము, హేతువు— పంచితిండి, నీళ్లు, తాగకపోవుటవల్ల నితర అంటు దద్దురు జాడ్యములవలెనే యిదిన్ని, అంటురుగ్మతై వున్నది. ఆ యిరోపా ఖండములోనున్న అనేక స్థలములయందు యీ రుగ్మత కలుగ

డు. ఈ దేశమందు యిప్పుడు కానబడుచున్నది. ఈ రుగ్మతవల్ల బాధను, పొందినవారు తిరుగా బాధపడుట యరుదు. ఈ రుగ్మత వచ్చినవారికి తిరుగా వచ్చినపుడు సాధారణముగా దద్దురు కనబడదు గనుక—ఇదొక తరహాగలదు.

పరిమితి—రుగ్మత ప్రారంభము మొదలు దద్దురు కలిగే వఱకు ౨౪-౪౮, ౭౨ ఘంటలగును దద్దురు కలిగినది మొదలు యాదద్దురు పోయేవఱకు- ౬, ౮ దినములగును. దద్దురు పోయినది మొదలు రోగమయ్యే వఱకు 3 వారములు రమారమి యగును. రోగము పరిమితి ౮, మొదలు ౩౦ రోజులై వున్నది.

చికిత్స—విశేష కాక కాకుండా శుభ్రముగానుండే స్థలములలో రోగిని నుంచవలెను. జంతుసంబంధమైన భోజనము కాకుండా సులభముగ జీర్ణమయ్యేది పథ్యముగా నివ్వవచ్చును. నిమ్మవంటి రసము మంచినీళ్లలో కలిపి యివ్వవచ్చును. సోడా, యాసిడ్, ఇవ్వవచ్చును. దద్దురు పోయేటప్పుడు సాధారణమైన విరోచనముల మందివ్వవలెను. చికిత్స చేయుటకు నారంభించినపుడు ప్రథమతః.

ఇపికాకు.......... ౨౦ గింజలు.

వైను అంటిమనీ......... ॥ అర ఔన్సు.

పెప్పరుమెంటు వాటర్ ౧౨ డ్రాములు.

ఈ మూడు కలిపియిస్తే వాంతియగును. అటుపైని అనగా మరునాడు

మెగ్నిష్యా సల్ఫేట్ ......... ౧ ఔన్సు.

సునాముఖి కషాయము...... ౨ ఔన్సులు-

ఇవి కలిపి యివ్వవలెను. లేనియెడల తెల్లాముదము బాగా నివ్వవలెను. సత్తువైన రోగికివ్వడముగానున్నయెడల మొదట ౨౪ ఘంటలలో టార్టరు యమిటిక్ బహుస్వల్పముగా కడుపులో తిప్పుపుట్టేలాగు యిచ్చేది-తను కాక విస్తారముగా నుండినపుడు- ౧౦ నిమిషములు మించకుండా వేడినీళ్లస్నానము చేయించి కాక చేయకుండా చలవను కలుగ చేయవలెను. గొంతుకు బాధ విస్తారముగా వుండినా, జలగలు ౬, ౧౨ గవేసి [illegible]

మూలలందు అంటించవలెను. ఆ పైని నీళ్లతో వుడికించిన పోల్టీసు వెచ్చనిది విస్తారముగా గొంతుకకు వేసి కట్టవలెను. సాధారణముగా నొప్పి యున్నపుడు ఆవపిండి పోల్టీసు గొంతుకమీద కట్టవలెను. ఓపోడల్డాసు తైలము గొంతుకకు మర్దనా చేయించవలెను. కాస్టిక్ ౫ గింజలెత్తు ॥ అరడ్రాము నీళ్లలో కలిపి రోజుకు ౨ పర్యాయములు గొంతుకలో సెల్లగానున్న-భాగమునకు రాయవలెను. కంపౌండు యిన్ఫ్యూషన్ ఆఫ్ రోజులో మరికొంచము యాసిడ్ కలిపి గొంతుకకు తగిలేలాగున గండూషను చేసేది, గొంతుకయందు చెడు వాసన విశేషముగానున్నపుడు పెరమేంగినేటు పోటాష్ నీళ్లలోకలిపి పుక్కిలించవలెను. ౨ డ్రాములు క్లోరేటు, పోటాష్ నీళ్లు ౧ ఔన్సులో కలిపి ॥ అర డ్రాము హైడ్రోక్లోరికేసిడ్ చేర్చి ౬ ఔన్సుల నీళ్లలో కలిపి యిది పుక్కిలించి మింగవలెను. ఈ స్థితిలో నాలుగారు ఔన్సుల వైను రోజుకు నివ్వలెను. ఇందుకు క్వైనర్ ప్రశస్తము. సత్తువగల పదార్థములు పథ్యము వైనను యివ్వవలెను. దద్దురుపోయి పొరరాలిన పిమ్మట, ౧౫ దినములవరకు రోగి కాకమీద నుండవలెను. నివసించు గృహము చల్లగానుండకూడదు. రోగికి విశేషముగా సౌఖ్యము కలుగజేయవలెను. పరుండియుండవలెను. ఈ రుగ్మతయందు సన్నిపాత గుణములు కలుగునపుడు బహుహాని కలుగజేయుచున్నది. అప్పట్లో (నైట్రిక్కేసిడ్, క్వైనర్) అయినా యివ్వవలెను, కాక పుట్టించేదైనా, నివ్వవలెను. అనగా బ్రాంది. ఈ రుగ్మతవల్ల జలోదరము వల్లు వాపు కలుగుచున్నది. అందుల చికిత్స వెనుకనుండి తెలియజేయదగును.

---

## ఒడలు వాపు. General Dropsy.

సూత్రము—దేహమందంతట నీరొక విధమైన చర్మములోపలకును దేహములో మరికొన్ని పొరలలోను జేరుటవల్లనూ రుగ్మత కలుగుచున్నది. ఈ రుగ్మతయొక్క భేదములు తలలో నీరు జేరనపుడు హైడ్రోకెఫేలస్ పొట్టలోపలనుండే పిరి ప్రేగులను కప్పుకొనియుండే పొరలో చేరినపుడు, హైడ్రోత్రితో రేకప్పు యనిన్ని గుండెకాయను కప్పుపొరలో జేరినపుడు హైడ్రో పెరికార్డియా పేసులు పైని యుండే పొరలో చేరినపుడు - జలోదర

మనిన్ని, యస్సైస్, వృషణములలో నీరు చేరినపుడు [illegible]టిబుస్సు హైడ్రోసీల్ ఒడలు వాపు దేహమందంతట కలిగినపుడు ఒడలువాపు, అనసర్కా- ఊపిరి తిత్తులందు కలిగినప్పుడు యుడీమాపల్మోనాలు యనియు వాడుకొందురు. వీటి నిగురించి ప్రత్యేకప్రత్యేకము తెలియజేయనగును.

హేతువు— దేహమునందు నీరును పుట్టించేటటువంటిన్ని ఆనీరుపీల్చి వేసేటటువంటి రెండు విధములైన నాళ్లు గలవు. ఈ నాళ్లలో నీరు పుట్టించే విస్తారముగా పనిచేసే రెండవ విధము, యప్పటిస్థితిగా పనిచేయుటను వల్లగాని కలుగుచున్నది, ఈ రెంటియందు సమత్వము చెడుటవలన్ను, నీరుస్తంభన కలుగుచున్నది. పీల్చే నాళములూరునుండి నీరు కలుగజేసేది పని చేయుటవల్ల కలుగుచున్నది.

—౧) ఈ రుగ్మత రెండు విధములు. (౧—

౧ అశుద్ధ రక్తము, ప్రవహించుటలో, ఆ ప్రవాహమునకు అడ్డు కలుగుటవల్లగాని నింపాదిగా ప్రవహించుటవల్లగాని— కలుగుచున్నది.

౨ వది— దీనియందు గుండెయున్ను, నిమ్మలమైన రక్తము, ప్రవహించే నరములున్ను, విశేషముగా పనిచేయుచున్నవి.

మొదటి విధము— గుండెకాయ యొక్క కుడిభాగపు వాపు అని, తెలియబడిన నరములను. త్రాళ్లతో కట్టుటవల్లగాని— కాయలు రక్తనరములమీద, నణచుటవల్లగాని— మరుగుదబ్బ, ప్లీహ- వీటియందు రక్తము, ధారాళముగా ప్రవహించక పోవడమువల్లనున్ను, కలుగుచున్నది. గర్భిణి గానున్నపుడిట్టి హేతువులవలనే వాపు కలుగుచున్నది. అనగా పిండమున్ను సంచి రక్త నరముల మీద నొక్కుటవల్ల నా రక్తప్రవాహమున కడ్డంచేసినదై రక్తములోనుండు, ఒక విధమైన నీరు రక్త నాళ్ల గుండా పైకి చమర్చబడి దేహమునందు వ్యాపించి యీ రుగ్మత కలుగజేయుచున్నది.

రెండవ విధము— గుండెకాయ యొక్క యెడమ భాగమువైపు కలుగుచున్నది. ఇందులో గుండెకాయ యస్త్రరక్తపు నరములు, ఆర్టరీస్ వరుచుటవల్ల కలుగుచున్నది. ఉదాహరణము— పేగులుపై పొరలేక బెసరాయిను పెరిటోనియమందు ఒరుపు వల్లనున్ను, చేపు దిగుటవల్లనున్ను, జలో

దరము నీటిబుడ్డ గలుగుచున్నది. గుండెకాయ పెరుగుటవల్లను కూడా, ఈ రుగ్మత పుట్టుచున్నది.

గుణములు—సాధారణముగా సాయంత్రమందు శీలమండలందు పాదములందు, వాపుతో వచ్చుచున్నది. ఈ వాపు పరుండునపుడు పోవుచున్నది. అయితే క్రమముగా నిలిచిపోయి పైకి వ్యాపించి తొడలు మొదలగు పైభాగములకు యెక్కుచున్నది. గాఢమైన జబ్బు చేసినపుడు చేతులు, వక్షస్థలము, మెడ, ముఖము, వీటియందు వాపులు గలుగును. శరీరములోపల సహితము యిట్టిస్థితిలో నీరుగలుగుచున్నది. వాపు కలిగిన చోటను నొక్కితే గుంటపడును. రీనల్ డ్రాప్సీలో తప్ప అనగా - గురజాలలో జబ్బుచేసి, అందువల్ల పుట్టు ఒడలు, వాపులోతప్ప అల్పాచమానము, కొంచముగాను, విశేషరంగుగానుండును. చర్మము చల్లగాను, యండిపోయినట్టు విస్తారము వాపున్నపుడు బిగిగాను, తళుకుగానుండును, క్రమముగా అనేకచోట్ల బద్దలై నీరు పైకి స్రవించును. ఒకానొకపుడు పొక్కులుగాని కుళ్లడముగాని—పుట్టును, గుండె కొట్టుకోవడము కడుపు పొంగడము, యెగవూపిరి, మైకము, కలిగియుండును.

సాధ్యాసాధ్యవివేకము—దేహములో కాజణములో భాగములవల్లను పుట్టినపుడును పురాణమైనపుడును విస్తారజబ్బు చేసినపుడును, తప్ప సాధ్యము.

చికిత్స, ౧ హేతువును తీసివేయవలెను. ౨ వంటియందు నీరును తగ్గించవలెను. ౩ మూత్రకోశములను నీరును పోగొట్టి కూదర్చవలెను.

౨. ఇందుకు చెమటను పుట్టించేటటువంటివిన్ని అల్పాచమానము, అధికముగా చేసేటటువంటివిన్ని, విరోచనమయ్యేటటువంటివిన్ని, ఔషధము యివ్వవలెను. మనిషియొక్క దృఢమునుపట్టి విరోచనములకు యివ్వవలెను. సురాకారము, ౧౦ గింజలెత్తు రోజుకు మూడు పర్యాయములు-నీళ్లలో కలిపి యివ్వవలెను. కంపౌండు జాలప్, ౨౦ లేక, ౪౦ గ్రేనులు-యిచ్చి విరోచనము చేయించవలెను. లేనియడల గింజలో వాల్గవవంతు సెమదలు, ౧ గింజెత్తు, యలిటీరియమ్, యిచ్చినయడల విరోచనమగును-మంచి మోతాదు రోగియొక్క స్థితినిపట్టి ఆలోచించవలెను.

పిల్ హైడ్రార్జిరై............ ౫ గింజలు.

పల్విస్ సిల్లా ............... ౧ గింజ.

డిజిటేలిస్ పౌడరు. ......... ॥ అంర గింజ.

ఇవి కలిపి మాత్రచేసి రోజుకు మూడు పర్యాయములు యివ్వవలెను. విశేషబలము చెడిపోయిన రోగులకు.

టింక్చరు డిజిటేలిస్...... ౧౫ చుక్కలు.

టింక్చర్ ఫెర్రై ....... ౨౦ చుక్కలు.

ఇవి గిద్దెడు నీళ్లలో కలిపి యివ్వవలెను. టింక్చర్ డిజిటేలిస్ సబ్బు తైలములో కలిపి పైకి మర్దన రోజుకు రెండు పర్యాయములు చేయించవలెను.

పిల్ సిల్లాకో.........౧౦ గింజలు.

క్యాల్ మేల్......... వకటి నాలుగోవంతు గింజ.

జూనిపెరాయిల్...... ౧ చుక్క.

ఇవి కలిపి మాత్రలుచేసి రోజుకు మూడు దఫాల నివ్వవలెను. ఈమాత్రలు నురుగు దబ్బ జాడ్యమువల్ల కలిగిన వాపులో నివ్వవలెను.

క్రిమిటార్టర్...... ౧॥ ఒకటిన్నర ఔన్సు.

సల్ఫేటు ఆఫ్ పొటాష్. ॥ అర ఔన్సు.

స్కాల్ పౌడరు......౨ డ్రాములు.

టార్టర్ యెమిటిక్...౧ గింజ.

ఇవి కలిపి నూరి మిలిగించెలో నాల్గవవంతు తీసి రోజుకు ౪-౫ పర్యాయములు నీళ్లలో కలిపి యివ్వవలయును.

ఎక్ట్రాక్టు కాలోసింతు...౪౫ గ్రేనులు.

గ్యాంబోజి... ... ...౩ గ్రేనులు.

ఎలిటేరియమ్...... ౧॥ ఒకటిన్నర గ్రేను.

ఎక్ట్రాక్టు అయ్యాసామిగ౨ గ్రేనులు.

ఇవి కలిపి బాగానూరి ౧౨ మాత్రలుచేసి యుదయం, సాయంత్రములందు ఒక్కొకటి చొప్పున యిస్తూ సురాకారము రోజుకు మూడుపర్యాయ

మూలు యివ్వవలెను. ఈ మాత్రలో బ్లూపిల్ మాత్ర వకటింటికి ॥ అరగిం జయొత్తు చేర్చవచ్చును. టర్పంటైను. క్యాంతారిడిస్ స్పిరిట్సు జూనిపర్, ఈ రుగ్మతలందివ్వవచ్చును. మెగ్నిష్యాసల్ఫస్, ౧ డ్రాము సురాకారము, ౧౦ గ్రేయిలు నీళ్లు, ౧ ఔన్సు కలిపి రోజుకు 3 - ౪ పర్యాయములు యివ్వవలెను.

సురాకారము... ... ... ౧౫ గింజలు.
పోటాసియమై కార్బోనేటిస్... ౩౦ గింజలు-
స్పిరిటస్ జూనిపరై... ... ... ॥ అరడ్రాము.
ఇన్ఫ్యూషను బకూ ......... ౧ ఔనుసు.

ఇవి కలిపి రోజుకు మూడుపర్యాయములు యిచ్చేది.

ఇందుకు పథ్యము, నీరుగల పదార్థములు యివ్వకూడదు. మాంసము, పాలు, రొట్టె, ఇవ్వవచ్చును. జిన్ సారాయి, యీ రుగ్మతలో పుచ్చుకోవడమువల్ల చాలా మేలు గలుగును. పథ్యమైన కాయకూరలన్ని తినవచ్చును. రుగ్మత కుదిరిన తరువాత పోర్టువైను మొదలగు రక్తమును- వృద్ధి పొందించే అవుషధములు యివ్వవచ్చును. F వెం ౯- ౧౪- ౧౭- ౬౦- వాడుక చేయవచ్చును.

---

జలోదరము. Ascitis,

సూత్రము— ఔసరాలో నీరు చేరుటకు జలోదరమని పేరు.

గుణములు— అల్పాచమానము కొంచముగును. విదాహము కాళ్లుకొంచము పొంగు, ముఖము కళాహీనమై యుండును. కొంచము వాపువుంటే ముఖమున నుండవచ్చును. కడుపు పెరిగి వుండును. కడుపుమీద, రెండు చేతులు వేసి వక చేతి వేళ్లతో వకపక్కనొక్కి రెండో చేతి వేళ్లతో మొదటి చేతి వేళ్లకు నెదురుగుండా కొట్టినయడల నీరు చేతికి తగిలినట్టులగును. కడుపు ఘట్టిగా నుండును, విస్తారము నీరు జేరితే యెగవూపిరి కడుపుమీద నరములు జేరడము కండ్లయందు నీరు గ్రమ్మట గలిగియుండును, విరోచన బద్ధము- కలిగి యుండును కాళ్లువాపును గలుగును. కొందరిలో కంఘు పచ్చబడును. ఈ

గుణమయకృదో)గసంబంధము కొంచము దగ్గుపుండును కొందరిలో మూత్రమువంటి తే తోడుకొనును- చిన్నపిల్లలో తులోదరము యకృతు పెరుగుటచే కలుగుచున్నది.

హేతువు- ఒడలు వాపుగలిగే హేతువులే యీరుగ్మతయందు గలుగుచున్నవి. బిడ్డనుకన్నతరువాత బెసలోపట్టు చెడుటవల్ల గలుగును. ప్లీహమొదలైనవాటిరుగ్మతలవల్ల గలుగును.

నిరూపించుట- ఇతరరుగ్మతలనుండి ప్రత్యేకించుటకు నీరుగ్మతలో రోగి యెటువపరుంటే అటువైపుకు నుదరము విస్తారముగానుండును. యీరుగ్మత పుట్టినపుడు ముందుగా పొత్తికడుపువద్దనుంచి వాపుపుట్టును కడుపుతోనున్నమనిషి కడుపులోపిల్ల కదలుచుండును యిదిగాక కడుపులోనపిండము యొక్క గుండె కొట్టుకోవడము వినపడును.

సాధ్యాసాధ్యవివేకము- ఒడలుయావత్తు వాపుకలిగినపుడు జలోదరముండడముగాని దేహమందీ ప్లీహమొదలగువాటివల్ల కలిగినపుడుగాని జలోదరమసాధ్యము రోగికి జ్వరముతగులుచున్నపుడును విస్తారముగా యెండిపోయినపుడు నిబ్బంది పెట్టును సత్తువుకలిగినట్టియు, వృద్ధులుకానట్టి వార్లయందు సంభవించి దుర్గుణములు లేనియడల కుదురును.

చికిత్స- దేహములోని నురుగుదబ్బ ప్లీహా మొదలగునవి చెడిపోయి యీరుగ్మతను కలుగచేసినపుడు నివారణ కావడము బహుఅసాధ్యము అయితే ఉపశాంతి విరోచనసాధనమువల్లను, మూత్రసాధనమువల్లను, కలుగుచుండును దేనియందైనా వరపువల్ల నిరుగ్మత కలిగినపుడు రససంబంధమైన మందులివ్వనగును పాస్టు-పలస్త్రీ వేయవచ్చును కడుపునందునొప్పి యుండునపుడు జలగలుపట్టించి ఆవపిండపోల్టీసు వేసి నీటికాపడము పెట్టేది అటుపైని నోరుపట్టునట్లు [illegible] యివ్వవలెను జలోదరము నురుగుదబ్బ ప్లీహాగుండె మొదలగువాటివల్ల కలిగినపుడు ఆస్థానములందు గుణమిచ్చే ఔషధములివ్వవలెను ఒడలు [illegible] చెప్పినవుషధములే యిందులోనివ్వవలెను.

:(o):

సురాకారము ...... ౧౦ గింజలు.

టించెరుసిల్లా ...... ౧౦ ని

రోజునకు మూడుపర్యాయములు నీళ్లలో కలుపు యిచ్చి యుదరము పైని ఫ్లానలుగుడ్డ బిగించికట్టవలెను. గుడ్డకట్టకిముందు-

అయొడన్ ...... ౧౦ గింజలు.

కొబ్బరినూనె. ... ౧ గిద్దెడు.

కలిపి కడుపుమీద రాయవలెను. లేనియడల టింక్చర్ డిజిటేలిస్ అయినా టింక్చర్ అయొడన్ అయినా సబ్బు తైలములో కలిపి కడుపుమీద మర్దనా చేసి ఫ్లానలుగుడ్డ కట్టవలెను. ఉదయసాయంత్రము ఒడలువాపులో చెప్పిన నం ౧౨ రు మాత్రలివ్వవలెను. ఔషధముచేత కు లొంగనపుడు ఆసుపత్రికి రోగిని తీసుకువెళ్లి కడుపు బొక్క పొడిపించి నీరు తీసివేసేది. నెం ౧౭. ౬౦ వాడేది. — — — — — — —

(జలావృతశ్వాసకోశము.)

హైడ్రోథోరేక్సు. (Hydrothorax.)

సూత్రము ఊపిరితిత్తులను కప్పే పొరలో నీరుచేరి యుండును.

గుణములు- ఎగవూపిరి- ఊపిరిధ్వనులు చాతీమీద చెవిపెట్టి జూచితే యీనీరు చేరియున్న భాగమున వినబడవు. గుండెలో భారమున్నట్టు కలిగియుండును. గుండెకొట్టుకోవడము యెక్కువగానుండును. పొడిదగ్గు కలిగియుండును. బాధ లేనప్రక్క ను పరుండుటవల రోగికి చాలా యిబ్బందిగా నుండును. సాధారణముగా పరుండలేడు వక్షస్థలములో యిరుప్రక్కలందీనీరు కలిగినపుడు పరుండుట అశక్యము. నీరు చేరిన ప్రక్క పైకి నుబ్బెత్తుగా కానబడును. ఈ వుబ్బెత్తులోపల యుండే నీటి యొక్క పరిమితి కొద్దియుండును. ఊపిరి బాగా తీసినపుడున్నట్టే ప్రక్క యెముకలు పైకివుండును.

చికిత్స- ఈ రుగ్మతయందు ఆసుపత్రికి తీసుకువెళ్లి విశేషజబ్బుగా నుండినయడల రంధ్రంపొడిచి నీళ్లు తీసివేయవలెను. నీళ్లు తీయించివేసినతరువాత గుడ్డబిగించి చాతిచుట్టూ కట్టవలెను. వాపులో చెప్పిన చికిత్స యావత్తు యీ రుగ్మతయందు చేయవచ్చును. ముఖ్యముగా డిజిటేలిస్ యివ్వవలెను. డ్రై కప్పింగు (Drycupping) వేసేది అనగా నిది గాజు ముంతకాక

(యిడిమాపల్మోనం.)

ఊపిరితిత్తులయందు నీరు చేరడము దీనియందు ఊపిరితీసుట యిబ్బందిగా

ణంమువలన నితరవాపులు కలుగును, వక్షస్థలములోని యితరవా పులవలె నిది సాధారణముగా కనుకొనుటకు శక్యము కాదు.

### * జలావృత హృదయము. *

### హైడ్రాపిక్స్ పెరికార్డియై. (Hydropericardium.)

గుండెకాయను కప్పియుండే పొరమధ్యను నీరు చేరుట- ఈరుగ్మత వా కొన్నిదెబ్బలుకొట్టి యూరకుండి తిరుగా కొట్టుచుండుటవలను గుండె కొట్టుకొనుటవల్లను గుండెలో పట్టువల్లను, కనుకొనవచ్చును. ముఖము తెల్లగానుండును ముఖమునందు వాపుకలిగియుండును సాధారణముగా క్రింది నిపొట్టయందు యీవాపు కలిగియుండును. — —

చికిత్స- ఈపైనిచెప్పిన రెండురోగములు ఒడలు వాపులోనిచ్చేమందు లవల్ల కుదురును- విరోచనములు, మూత్రము కావడమునకు హరించుటకు సా ధనములు చేయవలెను- హరించడము రసమువల్లను, పొటాస్ ఐడక్ వల్ల ను కలుగుచున్నది. నెం ౧౨౨ యిచ్చేది.

### స్కర్వి. (Scurvy)

మూత్రము- రక్తములో జబ్బు కలుగుచున్నది.

గుణములు- ఈరుగ్మత క్రమముగా నిస్సత్తువతో వచ్చును మొగము తెలిపోయిగాని పచ్చగాగాని యుండును. పళ్ళయొక్క కుదుళ్ళుబ్బి కొంచె ము రాపిడి తగలగానే రక్తము కారును. ఆకుమళ్ళు మెత్తగానున్న కపలి యుండును. ఊపిరి దుర్గంధముగా నుండును. చర్మము యెండిపోయినట్లున్న, తెళుపుగాను, బిరుసుగాను, కమిలినరంగుగల మచ్చలు రక్తమువల్ల కలుగు చున్నవి. కాళ్ళు, ఒడలువాపున్న శరీరములోనుండు దుమ్ములయందు నొ ప్పులున్న చాతీలో బిగించియుండునట్లుండుట యూపిరితీయుటలో బాధ గానుండడము అల్పబచ్చాసను విస్తారరంగుగాను, కొంచముగానైవి శే ష వాసనకలిగియుండును కురుపెకద్దైననున్నయెడల దానిఅంచు కమిలిన ట్లుండును. కురుపుమీద కళ్ళినట్లుండును అట్టికురుపునుంచి కన్నునీరు కారు చుండును. రుగ్మత పూర్ణముగా ప్రవేసించినపుడు ముడుకుతువంగకుండా లాకుక పోవడము కలిగియుండును. రోగికదులటకు అసాధ్యమై యుండును తెలపొండలువాపున్న పొట్లకలిగియుండును కడ లెండిపోయి యుండును

వాశికనుండి, నోటనుండి, పుత్సబుడ్డ వెంబడిని రక్తముకారును. విరోచనను లోను విరోచనములు దుర్గంధముగానున్ను రక్తమిశ్రముగా నుండును.

నిధానించుట- ఈరుగ్మత నొకపర్యాయం జూచినతరువాత పొరపాటు ను చెందుటకు అవకాశము చెందియుండదు.

హేతువులు- సత్తువగలపదార్థములు భుజియించకపోవుటచేత నుద్భిజ్జపదార్థములు తినకుండుటవల్ల నుప్పుపెట్టిన మాంసమువగైరాలు చాలాకాలము భుజించుటవల్లను అశుభ్రమువల్ల నీరుగ్మతకలుగుచున్నది. ఇంకా అశుభ్రవాయువు విశేషమలచటపొందెలాగున పాటుపడడమువల్లనుకూడా కలుగుచున్నది. సముద్రముమీద దూరప్రయాణం చేయునపుడును నాటునకూడా యీహేతువులు తటస్థించినపుడు సాధారణముగా నీరుగ్మత కలుగుచున్నది.

సాధ్యాసాధ్యవివేకము- నవీనములైనరుగ్మతలు జబ్బుచేయవు పురాణించుటవలన హానికలుగును.

చికిత్స- మంచితిండి, ఉద్భిజ్యపదార్థములతోను కొంచము పులుసుగలిగిన పండ్లతోనివ్వవలెను- నిమ్మదబ్బ- నారింజవగైరా పండ్లివ్వవలెను- సముద్రంమీదను రోజుకుగిద్దెడు నిమ్మపండురసంయివ్వవలెను- చారివ్వవచ్చును బార్కు- క్వైనా రసము మినరల్, యాసిడ్, గోరువెచ్చనినీళ్లు స్నానము చేయించవలెను. కొళ్లు, పసగరు, సిరకా, కలిపిననీళ్లతో కడిగించవలెను. బంగాళాదుంపలపొడి, నిమ్మరసం, పంచదార కలిపి దాహముగాని వ్వడము బహుగొప్ప [illegible] సాధారణముగా నాసుపత్రియందు వాడుక చేయబడును. [illegible] నాలిక్, యాసిడ్లు, కలవళ్లు వేళ్లు మొదలైనవి యివ్వవచ్చును బంగాళాదుంపలందు విశేషముగా సిట్రిక్ యాసిడ్, పొటాష్‌తో కలిసివుండును- ఈరుగ్మతకు ముఖ్యముగ నిమ్మపండురసం F [illegible] వాడుక చేసేవి.

### ప్లూరసీ. Plurisy

ఊపిరితిత్తులను కప్పిపొరయందు కలిగేవరుపు (యింప్లమేషన్) అయివున్నది.

భేదములు- ఒకవైపునుండేటిది రెండువైపులనుండేటిది కొంతమట్టుకు

నుండేటిదిన్నీ యివి నూతనములైగాని, దీర్ఘములైగాని, యుండును.

గుణములు- దీనిలో మొదటగుణము వక్షస్థలముయొక్క చన్నుమొనలుండే భాగములో తీక్షణముగా పోడిచేకొన్నట్టు యున్నది. ఈనొప్పి నోక్కుట వల్లనుగాని, దగ్గుటవల్లనుగాని, యూపిరి బాగాతీయుటవల్లనుగాని, నొప్పియున్న ప్రక్కను పరుండుటవల్లనుగాని, యెక్కువగును- ఎండు యూపిరి పొడిదగ్గుయుండును- యీదగ్గువల్ల రోగిబాధపడును ముఖమునందు వెర్రిశోభ యుండును ఉష్ణము, వేగముగాను స్వల్పముగాను శ్వాసకోశములలోని కురుపు చితుకుటవల్లనున్ను కుళ్లునాలుజబ్బువల్లనున్ను కూడాకలుగును అణచడముకు శక్యముకాని నాడికొట్టుకొనుచుండును నాలుక దిట్టముగ మలినముగలిగుండును. విబాహముప్రేరణము లేకుండుట స్వల్పముగా గాఢమైనరంగుగల అల్పాచమూనమగును.

హేతువులు- ఆధార హేతువు [illegible] నడికాలపు మనుష్యులందును గలుగుచున్నవి.

హేతువు- రొంప- చలవ- [illegible] టవలనగాని, హెచ్చుటవలనగాని, గలుగ [illegible] పక్కయెముకలు విరగడము, యుష్ణము [illegible]

చికిత్సనొప్పియున్నప్రక్కకు కాపడము పెట్టవలె, [illegible] ప్లాస్త్రిసుగాని, అవిశపిండిపోల్టీసుగాని వేయువలెను.

నల్లమందు........ ౧ గ్రే
క్యాల్ మెల్ ...... అర గ్రే
టార్టర్ ఎమిటిక్ ... కటియున్నిమిదవ [illegible]

కలిపి మాత్రలుచేసి ప్రూటకొకటిచొప్పున రోజుకు ౩ పర్యాయములివ్వవలెను. జేమ్సుపౌడరు స్వల్పమోతాదులుగా తరుచుగానివ్వవలెను.

టార్టర్ ఎమిటిక్ వకటి నాలుగవవంతు ఔ
మానుపల్లస్త్రీ

రెండుకలిపి నొప్పియున్నప్రక్కమీద రాయవలెను పొక్కపలాస్త్రీ కూడా వేయునప్పును విరోచనము, నీరుడు [illegible] పకారము సాధనములు చేయవలెను నొప్పియున్నప్రక్కను జలగలుకూడా పట్టించవలెను

సాధనమైయున్నది- నెం ౩ ౭ ౩ ఇచ్చేది.

కాలిక్ ఫ్లూరసీ.

పైనిచెప్పినరుగ్మత చాలాకాలముండ టవల్లనీస్థితిలోకి తేచ్చుచున్నది దీనియందు హేక్టిక్ జ్వరమున్ను నాడి తొందరగాకొట్టుకోవడమున్ను రోగిజబ్బు లేని వైపున పరుండుట అసాధ్యమున్ను కలిగియుండును జబ్బుప్రక్కయెత్తుగానుండును.

చికిత్స-

క్యాల్ మేల్. ౩ గ్రే

పిల్ సాపోనిస్ కో. ౧౨ గ్రే

౧౨ మాత్రలు చేసి ౩-౪ పర్యాయములు రోజుకొకటిచొప్పున యివ్వవలెను, నోరుపట్టగానే మానివెయ్యడం ఐడైడుఆఫ్ పొటాశియం ఫ్రాటకు ౫ గింజలెత్తు చొప్పున నీళ్లలోకలిపి యివ్వవలెను మనిషి విశేషనీరసించినపుడీచికిత్స వుపయోగించుచున్నది అయిడిన్ పలా (స్త్రీ) పైనిరాయించవలెను రోగియొక్క బలమును, సత్తువను, కలుగచేసేయౌషధములవలన భద్రపరచవలెను మనిషి విశేషం తూలిపోయినపుడు వైనుసత్తువగలతిండి యివ్వవలెను.

న్యూమోనియా. P nuemonia.

భేదములు- ఒకయూపిరితిత్తియందుగాని, రెంటియందుగాని, యీరుగ్మతప్రవేసించును ఊపిరితిత్తి పైభాగంగాని లోభాగంగాని, బాధపొందును- ఎడమవైపుకంటె కుడిభాగమందుండే తిత్తితరుచుగా బాధనుపొందును.

గుణములు- విస్తారముచలికలిగి జబ్బుచేసిన యూపిరితిత్తి ముందుభాగమందుగాని, యావైపుభుజములోగాని, నొప్పికలిగియుండును ఊపిరితీసుట కిబ్బందిగానుండును జిగురుకలిగి క్రమముగా యినపతుప్పురంగుగల కెళ్ల కలిగిన దగ్గుకలిగియుండును, ఈరుగ్మతలో నిదిముఖ్యమైన గుణముగానున్నది. జ్వరము, చపలనాడి, పొడిగాను కాకగాను దేహము- వేడియూపిరి- పెదివెలు నల్లగానుండుట తలనొప్పిగలిగుండును ఈకడపటి రెండుగుణములు శిరస్సునుండి తిరుగా వచ్చురక్తప్రవాహమునకడ్డుగల్గుటవల్ల గలుగు

చెవిసన్న కొన్ని తలవెంట్రుకలు రెండు వేళ్లతో నలుపుటవల్ల కలిగెడు ధ్వని వలెనుండును రుగ్మత పురాణించుటవల్ల నూపిరితిత్తి ఘట్టిపడి యీధ్వని నాసిపోచున్నది. చిన్నపిల్లలయందు ముక్కుశిరములు వ్రూపిరి తీయునపుడే గురుచుండును కాక ౧౦౮ వరకెక్కును నిముషమునకు ౪౦ మారులూపిరితీయును- వారము, పదిరోజులలో తరుచుగా జబ్బుచేయని స్థితిలో నివ్మళించును.

నిధానించుట- ఈరుగ్మతయందు దగ్గుయొక్క కెళ్లవలను యితరదగ్గుల నుండి భేదింపశక్యమగును.

హేవులు- ఆధారహేతువు విశేషధ్వనితో చాలాసేపు మాట్లాడుట విశేష సారాతాగుట.

ప్రజ్వలహేతువులు- చలవపైనుండు వాయువయందు మార్పుగలిగినపుడు నీరుగ్మతగలుగుచున్నది. వేపపువ్వువలనున్న కకార్యయిదగ్గు పీటివల్ల కూడా నీరుగ్మత గలుగుచున్నది.

సాధ్యాసాధ్యవివేకము- రోగియొక్కవైన్సు దేహపటిమి రోగమునుభవించుటకు పూర్వము రోగియొక్క ప్రవర్తనయివి యిందుకు ముఖ్యకారణముగానున్నది. బాల్యులు- పెద్దవాళ్లకంటె నీబాధనుతరుచుగ నొందుచుండురు విశేషముగ కెళ్లపడిపోవడ ము[illegible]ంతి కలగడము నీరుగ్మతలో మంచిగుణములుగనున్నవి- తలనొప్పి, [illegible]పొటలు, నాలుకపొంగు, పెదవెలునల్లపడుట, కాళ్లు చేతులునల్లపడుట, చలి హెక్టిక జ్వరము చికిత్సలోపడిన యోగయూపిరి నాలుకయందు మవినముగలిగి యుండడము దుర్గుణములైయున్నవి.

చికిత్సవిరోచనములకు సాధనముచేయవలెను యిపికాకు౨ గింజలు- టార్టర్ ఎమిటికు ౧ గింజలో ూవ వంతెత్తు నల్లమందు ప్రత్యేకముగా నీరుగ్మతలో నివ్వకూడదు- చాతీపైని పొక్కుపలా(స్త్రీ)గాని, టార్టర్ ఎమిటికు పలా(స్త్రీ)గాని, రసపలా(స్త్రీ)గాని, మర్దనా చేయవలెన.

క్యాల్ మెల్ ...... ౨ గ్రే

టార్టర్ ఎమిటికు... అర గ్రే

మాత్రలుచేసి రోజుకు ౨-౩ పర్యాయములివ్వవలెను హెక్టిక జ్వర

ము మొదలైన దుర్గుణములుగలిగినపుడు అమోనియాబ్రోంది మొదలగున
వి యివ్వవలెను క్వైనర్ మినరల్ ఆసిడ్ కలిపి యివ్వవలెను ఇందుకుపత్యము
కాకకారియ్యనవి సత్తువైన పదార్థములివ్వవలెను రోగియుండేగది చల్లగా
గాని వెచ్చగాగానియుండకూడదు రోగికి సుఖమైనంతవఱ్ఱకు తలక్రింద యె
త్తుపెట్టవలెను రోగము దీర్ఘకాలము నిలిచినతరువాత రసముగాని ఐయొడైడు
ఆఫ్ పొటాష్ బారుకుకషాయముతో కలిపిగాని ఇవ్వవలెను నెం ౨౫-౨౬
౪౮ ౭౫- ౮౮- ౮౯- ౯౦- ౯౧ ఇవ్వవలెను.

## హిమాప్టిసిస్- రక్తకాస Hamoptysis.

గుణములు- గుండెలో భారము- పట్టు- కాకకలిగియుండును. వూపిరివి
డుచుటకిబ్బంది దగ్గు ఎగయూపిరి జ్వరముకలిగియుండును. నోటివెంటర
క్తముపడినపుడు ముందుగా గొంతుకలో నుశిపుట్టును. నోరుప్పగానుం
డును దగ్గుతోబడ్డ రక్తము విస్తారముగాను ఒకటవూరుగాను పడినపుడు
మలినమైనరంగుగలిగి నురగగానుండును. సాధారణముగా యెఱ్ఱనిరంగుం
డును చపలమైనట్టిన్ని అణచితే నూరగుండే నాడికలిగియుండును. కొంత
మందియందు దగ్గుయేమిగొంతులోను నుసిలేనిదే నోట రక్తముచేరినిం
డును. పైకిపోయినరక్తముయొక్క పరిమితినిపట్టి దేహమందు గుణములుం
డును విశేషరక్తముపోతే నేతప్ప మృతికలుగదు.

నిధానించుట- రక్తము కక్కుకోవడము- హెమిటెమిసిస్ నుంచి యుమ్మి
నరక్తము నురగకలిగియుండుటవల్లను రక్త మెఱ్ఱరంగుకలిగుండుటవల్లను
భేదింపనగును. కడుపులోనుంచి వాంతిచేసుకున్న రక్తము నల్లగానున్న
కొంతముద్దకట్టినదిగానున్న జీర్ణకోశమునందుండు పదార్థములతో కలసి
యుండునుగాని నురగగానుండదు.

హేతువులు- ఆధారహేతువులు. తెగబలియుట- నాజూకైనదేహము
రక్తమునందొకవిధమైన జబ్బుగలుగుట- వూపిరితిత్తులయందు కాయలుపు
ట్టుట గుండెకాయయందు రోగముగలుగుట.

ప్రజ్వలమేకువు- విశేషము కసరత్తుగాని పాటుపడుటగాని దెబ్బలువ
గైరా విశేషధ్వనిగా చాలాసేపు మాట్లాడుట కాకనుంచి చలవకు తత్ష
ణము మారిపోవుట చల్లనిగాలి వైన్ను సారాయి హద్దులేక తాగుట స్త్రీ

యందు ముక్కు కావడము ఆటంకమైనయెడల రక్తము పిరితిత్తులలోనుం
డి నోటివెంబడపడును.

సాధ్యాసాధ్యవివేకము- ఇతరరుగ్మతవల్లను కలుగునపుడీరుగ్మత విశేష
శ్రబ్బంది కలుగచేయునది కాదు. మూలవ్యాధిగాని ముక్కుగానిపోయి యీ
రుగ్మత కలిగినపుడు హానికలుగచేయును క్షయలోగాని క్షయకుముందుగా
ని యీరుగ్మత కలిగినపుడు విస్తారకాలము రోగిజీవించినను హానికలుగును
గుండెకాయ జబ్బువల్ల గలిగినపుడు త్వరగా హానికలుగ చేయుచున్నది.

చికిత్స- మంచుగెడ్డ నోటియందుంచవలెను, మంచుకలిపిననీళ్లువగైరా
దాహమిచ్చుటవల్లను బహుకార్యకారి. గంధకపుధృతి నీళ్లలోకలిపినది ౩౦
చుక్కలు గిద్దెడు నీళ్లలోకలిపి రోజుకు ౪-౫ పర్యాయములివ్వవలెను. నల్ల
మందరఖు ౧౦ చుక్కలు మోదాత్తుకు చేర్చుట కూడా మేలుకలుగచే
యును. పటికగుండ చేసి ౫ గింజలెత్తు పూటకివ్వవలెను. గేలికేసిడ్ అదే ప్ర
కారము రోజుకు ౩-౪ పర్యాయములివ్వవలెను. నల్లమందు ౧ గింజెత్తు
గెలికేసిడ్ ౫ గింజలెత్తు గంధకపుధృతినీళ్లలోకలిపినది ౫ చుక్కలు యినఫ్
ఫ్యూషన్ రోజీయాసిడై ౧ నర ఔన్సుకలిపిరోజుకు మూడుపర్యాయములి
వ్వవలెను. పిల్యూలా ప్లంబైకం నోపియోకై గింజలు మొదలు ౫ గింజలె
త్తువరకు రోజుకు మూడుదఫాల నివ్వవలెను.

టింక్చరు విరాటిరివిరిడిస్ ...... ౧౫ చుక్కలు.
అక్వీఅన్నీసై ... ... ... ౧ ఔన్సు

కలిపి రోజుకు మూడుదఫాలనివ్వవలెను. మేటికోగుండ నల్లమందుతో
గాని వట్టిదిగాని అయిదుగింజలెత్తు మాత్రచేసి ౩ పూటలందివ్వవలెను-
యీసాధనములన్నీ యీరుగ్మతయందు ముఖ్యముగా చెప్పినవిన్నీ గుణమి
చ్చేవియై యున్నవి నెం ౩౭- ౭౭- ౭౯ యివ్వవలెను.

## క్షయ. Phthisis.

గుణములు- ఇదిముఖ్యమైన రెండువిధములు చాతి బిగించినట్టు మొద
టనుండును. దేహములో కాకగానుండును. స్వల్పమైన నుసిగల దగ్గుకలు
గును. నిస్త్రాణ- అశక్తి- పాటుపడునపుడగుపడుచుండును, ఉన్నతస్థలా

లేవగానె ప్రతిరోజుగాని, రోజువిడిచిరోజుగాని, నీళ్లలోకలిపి రోగి యొక్క బలమునుపట్టి యిచ్చి కొంచము వేడినీళ్లివ్వవలెను. పాడిదగ్గు కలిగివున్నపుడు వాంతికిచ్చుటవల్ల హానికలుగును. రాత్రియందు విశేషచమట, దగ్గు, *జ్వరము, గుండెదడ, విరోచనములు, రక్తకాస, ఇవి మిక్కిలి యిబ్బంది కలుగచేయును. గుండెదడ- టింక్చర్ డిజిటేలిస్ 10 లేక 20 చుక్కలు నీళ్లతో నిచ్చుటవల్ల కుదురును. దగ్గు- కసగలవస్తువలు బుగ్గనుంచుటవల్లను. నల్లమందు స్వల్ప మోతాదులుగా నిచ్చుటవల్లను కంపౌండు సిరల్ పిలు. ౯ గింజలెత్తు- యక్టాక్టకోనియయిచ్చుటవల్లకుదురును. యక్టాక్టఆఫ్ స్ట్రమోనియం 1-6 గింజెత్తు స్ట్రమోనియంచుట్టలు కాల్చుటవల్ల దగ్గుకుదురును. యక్టాక్టలిక్కరసులోకలిపి బిళ్లచేసి బుగ్గనుంచుకుంటె దగ్గుకుదురును. ఇది ముఖ్యమైన యౌషధము-జ్వరము. డిజిటేలిస్సు కలిపిక్వయినను పెద్దమోతాదులవల్లను గోరువెచ్చని నీళ్లలో గుడ్డముంచి పిండేసి ఒడలంతట తుడుచుటవల్లను అయిడోఫారం చాతీకిపూయుటచేతను పోవును. దాహములివ్వవలెను రాత్రియందు చమటలు గంధకపుద్మృతి నీటిలోకలిపినది ౨౦ చుక్కలు నీళ్లలోకలిపి రోజుకు 3 పర్యాయములివ్వవలెను. ఈమందులో ౧-౪ వంతు గింజమార్ఫియా,కలుపుట శ్రేష్ఠము. ఇంచుముఖ్యము జింకుఆక్సైడు ౨ గ్రేన్సులు రాత్రియిచ్చుట దీనితో బెలడోనాగాని మార్ఫియాగాని కలపవచ్చును- క్వయినను గేలికేసిడ్డు యివ్వవచ్చును పికాక్రొటాక్సీను (pi crotxine .) 1/60 గ్రే మాత్రలుగాయిస్తేకట్టును మస్కరీను- పిలోకార్పీను- అగరికసు- చమటను, కట్టించును, వాంతి- హైడ్రోక్లోనికేసిడు, బిస్మితు యిచ్చుటవల్ల కుదురుచునది.

| | |
|---|---|
| కార్బొనేటు బిస్మితు. | ౧౦ గింజలు. |
| హైడ్రొక్లొనికేసిడు. | ౫ చుక్కలు. |
| తుమ్మజిగురు. | ౧ డ్రాము. |
| సిరిపైఆ రేష్టిమె | ౧ డ్రాము. |
| నీళ్లు | ౬ డ్రాములు. |

---

* దగ్గుకు F నెంబరు౬యిచ్చేది. * బలహీనమునకు F నెం ౭౩-౧౨౯-ఇచ్చేది

కలిపి రోజుకు మూడుపర్యాయములివ్వవలెను. బలహారము కానివస్తువులు పత్యము. మాంసాదులు పెట్టకూడదు. విరోచనములు కలిగియున్నయెడల F నెం॥౧౮౯-౧౩౦ ఇచ్చేది. అజీర్ణమునకును కార్బొనేటు సోడియిచ్చేది. F నెం ౧౫౩- ౧౨౨- ౬-౧౨ యిచ్చేది. ఘట్టి పదార్థము లేమి, నోకట్టిపిడచ లేమి తినకూడదు. జావవలెనుండు పదార్థములు భుజించవచ్చును. రక్తకాసకలిగున్నయెడలను, రక్తకాసలో చెప్పిన యౌషధము లివ్వవలెను. రుగ్మతయొక్క కడపటి దశయందు నైనను, అమోనియా, బహుకార్యకారిగా తలంచి యివ్వవలెను. మాల్టు, చాపనూనెహైపొఫాస్ఫేటుతైము, కొబ్బెరనూనె, మేకపాలు, గాడిదపాలు, పాలమీగడ, వీటిచే కొందరికి కుదురును డాక్టరుకోచిగారి ట్యూలకిలీను. (Tubercuine) పిచ్చికారిచే బహువేగము కుదురును. పిల్లలలో నెం ౮౫ యివ్వవలెను.

## రొంప. Cold.

నాసికయందు ఒకవిధమైన యొుపు గానున్నది.

గుణములు- ముక్కులో బిండపెట్టినట్టుండును తల బరువుగా నుండు మొదట ముక్కు నాసికలు పొడిగానుండి తరువాత రొంప కారును వరుపు హెచ్చినకొద్దీ కండ్లనీరు కమ్ముచుండును గొంతుకు ఎలుగురాసి పొడిగా నుండినట్లుండున. ఊపిరితీయుట కిబ్బందిగానుండును శరీరమంతట నొప్పి బహునీరసముగానుండును ఈగుణము లొకరోజుగాని, రెండు దినములుగాని, యుండిపోవును.

ఇందుకు చికిత్స- తరుచుగా జేయడము సంభవించదు. అప్పుడపుడు ఒక్కమారు దేశమంతట జనులను బాధించును- అప్పుడు విశేషతీవ్రముగా గుణములు కానబడును. అప్పటిలో దీనిని, ఇన్ఫ్లూయంజా అనివాడుకొందురు. ఇప్పటిలో నీదిగువ చెప్పబడు మందులవల్ల కుదుర్చబడును. సాధారణమైన శైత్యములో F నెం॥ ౮- ౭౯ చే పోవును. ...

| | | |
|---|---|---|
| పొటాసిక్లోరసు. ... | ... | ౫- గ్రేంజలు. |
| బాౕరింది. ... | ... | ౧- ఔన్సు. |
| నీళ్లు. ... | ... | ౧- ఔన్సు. |

కలిపి పుచ్చుకొనుటవల్ల కుదురుచున్నది. లేనియెడల విరోచనములకు పుచ్చుకోవలెను. — — — — —

వాంతికి, ఇపికాకు. — ౨౦ గింజలు.

టార్టర్ ఎమిటిక్ — ౧ గింజ.

వేడినీళ్లలో కలిపి పుచ్చుకోవలెను. అటుపైని అర్ధపావు వేడినీళ్లు వాంతి ఐనప్పుడు పుచ్చుకొంటూ వుంటే సులువుగా వమనమగును. వేడినీళ్లలో పాదములుంచుకొని పావుఘంట వేళ వఱకు కూర్చోవలెను. ఇందువల్ల రొంప పోచున్నది డోవర్సుపౌడరు ౧౦ గింజలెత్తు పరుండబోవునపుడు పుచ్చుకోవలెను. బారుకు మొదలైనవి యివ్వవచ్చును. — —

స్పిరిట్సు తరునైటరు. — — ౨౦ చుక్కలు.

టింక్చరు క్యాంఫరు. — — ౧౫ చుక్కలు.

ఇపికాకు. — — — — ౧ గింజ.

స్పిరిట్సుక్లోరిఫారం సాధారణమైన రొంపయందిచ్చుటవల్ల కుదురును. రాత్రి పరుండు వేళను కడుపునిండా చల్లని నీళ్లు తాగవలెను యిందువల్లనే కొందరికి కుదురుచున్నది. ఇన్ఫ్లూయింజాలో (Influenza,)

టింక్చర్ ఓపియమ్. — — ౧౧ చుక్కలు. —

స్పిరిట్సుతరు. — — — ౪౦ చుక్కలు. —

కర్పూరపునీళ్లు. — — — ౧ ఔన్సు. — —

కలిపి యివ్వవలెను. — — — — — — — — —

ఇపికాకువైను. — — — ౧౦ చుక్కలు.

సిరపుపాపవరిసు — — — ౧ డ్రాము.

స్పిరిట్సు అమోనియా. — — ॥ అరడ్రాము.

కర్పూరపు నీళ్లు. — — — — ॥ అర ఔన్సు.

ఇవి కలిపి యిచ్చుటవల్ల పోవుచున్నది. F. సెం ౫, ౪౮, ౮౪, వాడేది.

సైనాంఖ్ టాన్సులేరిస్. గొంతునొప్పి.

గుణములు- రొంపలో సాధారణముగా వచ్చుచున్నది. కొండనాలుక యుద్రేకించియున్న వెనకభాగమంతయు నొరుపుగలిగి యుండును.

## బ్రాంకైటిస్. Bronchitis

ఊపిరి తీయు నాళమునందు ఒకవిధమైన యొరుపునకు బ్రాంకై టిస్ యని పేరు ఇది మూడు విధములు. — — —

౧. అక్యూటు బ్రాంకైటిస్ ... ...

౨. క్రానిక్. ... ... ...

౩. సీనైల్ కటార్. ... ... ...

౧—అక్యూటుబ్రాంకైటిస్. ... ... ...

గుణములు- గుండెలలోనొప్పి బరువు - పట్టుకలిగి యుండును. ఛాతిలో బోరవెనుక పచ్చిగా నుండును. తెల్లనైన పలచని కెల్ల గలిగిన దగ్గు గలిగి రోగముముదిరిన తరువాత కెంఖముద్ద కట్టియుండును జ్వరము న్ను దగ్గుటవల్లగాని పనిచేయుటవల్లగాని యెక్కువయ్యె యెగయూపిరిన్ని గలిగి విశేష రొంపయుండుండు గుణములు కలిగియుండును. — —

౧౧ క్రానిక్ బ్రాంకైటిస్.

గుణములు, యీరుగ్మత అక్యూటుబ్రాంకైటిస్ వల్లగలుగుచున్న ది. అప్పుడపుడు ప్రత్యేకముగా గలుగుచున్నది. రొంపయుండుండు గుణ ములతో ప్రవేశించి అక్యూటుబ్రాంకైటిస్ యందుండు గుణములు గరిగి యుండును, గాని గుణములంత తీవ్రముగానుండవు కెంఖ యొకప్పుడు వి స్తారముగాను ఒకప్పుడు స్వల్పముగాను పడును. ఈ రుగ్మత అనేకతర హాలుగా శరీరమున పుట్టి కలుగుచున్నది. — — —

౧౧౧- సీనైల్ కటార్.

గుణములు ఎగయూపిరి యీ సధ్వనిగల దగ్గుతో కెంఖ పడడము, మాంద్యము, నిస్సత్తువ, కాళ్లు, చేతులు, చలవలు కమ్మియుండుట కొన్ని కేసులయందు, కెంఖ విస్తారముగా గలిగి దానిని యుమ్మివేయుట కవకాశ ము గలుగుగకె యూపిరితీయలేక, మృతిబొందుదురు. ఈ రుగ్మతయందు గొంతుక యూపిరి నాళము యావత్తెర్రగానుండి యూపిరి నాళము యొ క్క చివరలు కఫముచేత నిండి యుండును. — — —

చికిత్స— సీమ అవశేషించి పోష్టీసు. చాతీకి వేసేది. తీవ్రమైన గుణ
ములు తగ్గిన తరువాత చాతీపైని పాకేజీమందు వేసేది. —— ——

చాతీకి జలగలు గాని, కపింగుగ్లాసు గాని, పట్టించవలెను.

టార్టరు యెమిటికు ¼ గ్రేనుమైకరు అమోనియా యాసిటేటుతో-
చేర్చి యిచ్చినేని నవీనపు బ్రాంకైటిస్ కుదురును. ఇపికాకు ౫ గింజలె
త్తు రోజుకు 3 పర్యాయము లివ్వవలెను. నల్లమందు, క్యాలమెల్, కలిపి
రోజుకు ౨ పర్యాయములు యివ్వవలెను. టార్టర్ యెమిటిక్, ఆయింటు
మెంటుగాని బ్లిస్టరుగాని, గుండెలు మీద వేయవలెను. దుర్బలతయొక్క-
అత్యధికాశయమందు వైనుఅమోనియా, మొదలైనవి యివ్వవలెను. నల్లమం
దు ప్రత్యేకముగా జాగ్రతగా నివ్వవచ్చును. ౨౦ చుక్కలు. ఇనపయడిన్
(టించర్ ఫెర్రై ప్ల్సి) టర్పెంటైను యొక్క ఆవిరి పీర్చడమువల్లను మేలు
గలుగజేయును. విశేష వేడిగాలిలో రోగినిలువరాదు. ఈ దుర్బలతచిన్న
పిల్లలయందు కలిగియున్నపుడు వాంతికిచ్చుటవల్లను కఫముపడిపోయి మేలు
చేయును. క్రానిక్ బ్రాంకైటిస్ లో నిద్రకారణముగా సాధనము చేయవలెను.
జలగలు పట్టించ నక్కరలేదు. కంపౌండుస్క్విల్ పిల్ బహు శ్రేష్ఠమైన-
మందుగా నిందులో నుపయోగించుచున్నది- దీనిని డోవర్సు పౌడరుతో గా
ని కోనియమ్ తో గాని కలిపివ్వవచ్చును. ప్రత్యేకముగా ౫ గింజలెత్తున రో
జుకు ౨- 3 పర్యాయము లివ్వవచ్చును. ఊపిరితీయుట కిబ్బందికలిగినపుడు
ఉదయమందు వాంతికిచ్చుటవల్లను నివారణయగును. వారమునకు ౨ మూ
పర్యాయములు, వో కానోకపుడు వాంతికి సాధనము చేయనగును. శరీర
ము చలిఘాలి తగలకుండా కాకగానుంచవలెను. చాతీమీదంతట ఎంప్లా
స్ట్రిం పైసిస్ అంటించవలెను. తుమ్మజిగురు. బాలింతబోలు- సాంబ్రాణిటా
లు అమోనియాకమ్, గాల్బనమ్- కోపేబాటర్పెంటైను యీరుగ్మతలో
నిచ్చేమందులైయున్నవి. ముసలి కాలమునందు విశేషదుర్బలత కలిగినపుడు

అమోనియా కార్బోనేట్ .... ... ౫ గింజలు.

స్పిరిటుక్లోరిఫారమ్ ... ... ½ అరడ్రాము.

సెనిగాకషాయము ... ... ½ అరవున్సు.

కలిపి రోజుకు ౨-౩ దఫాల నివ్వవలెను. — —

సిల్లాసిరపు ॥ అరడ్రాము మిక్చరా అమోనియాకమ్ డోస్కు కలిపి ౨-౩ దఫాల రోజుకు యివ్వవలెను. బలమును గలగజేసే టించిన్ని పైనివ్వవలెను. ఒడలువాపు కలిగినపుడు మూత్రమధికమయ్యే యౌషధము లివ్వవలెను- చాలాకేసులయందు చలిఘూలితగులుటవల్లను, వుపశాంతి కలుగును గాని, వేస్త దేహమునకు తగలడముతోడనే పూర్వపు గుణములుతిరుగా విశేషబలముగా వచ్చును. ఉదయమునందు రోగిగుడిలోనుంచి పైకివచ్చినపుడు చేతిరుమాలు మడతపెట్టి ముక్కురంధ్రములకు అడ్డుగానుంచి దానిగుండా యూపిరి తీయవలెను. స్ట్రామోనియమ్, చుట్టలు కాల్చుటవల్లనున్ను క్లోరడైక్, పూటకు ౯౦ చుక్కలు పుచ్చుకొనుటవల్లను యూతెరిడైక్, పూటకు ॥ అరడ్రాము పుచ్చుకొనుటవల్లను శాంతము చేసిన, నైట్రిక్ యాసిడ్, ప్లాటింకు, పేపరు కాల్చుటవల్లను, ఇపికాకు, ౫ గింజలెత్తు తుమ్మజిగురు గుండ ౧౦ గింజలు క్లోరేటుపాటాష్, ౫ గింజలెత్తు కలిపిరోజుకు ౩ పర్యాయములు యిచ్చుటవల్లను. రుగ్మత కుదరును, దగ్గు విశేషముగానున్నపుడు. — — — — —

టింక్చరు క్యాంఫరుకో, ౨౦ చుక్కలు- — —
వైనుయిపికాకు, ... ౫ చుక్కలు. — —
లేక యిపికాకు గుండ- ౧ గింజెత్తు. — —
టింక్చరు అయ్యాసాఫి. ౧౦ చుక్కలు. — —
టింక్చరుసిల్లా. ... ౫ చుక్కలు. — — —
సల్ఫ్యూరిక్ యీథర్. ॥ అరడ్రాము. — —
కర్పూరపు నీళ్లు ...... ౧ అవున్సు. — — —

కలిపి రోజుకు ౩ పర్యాయములు యివ్వవలెను. ౧౦ గింజలెత్తు యిపికాకు, పంచదార పాకముపట్టి, రెండు మిశ్రమముచేసి జీడెలపాకము తెచ్చి, జీడెలరూపున ౨౦ చేసి రోగికి వొక్కొక్క జీడె బుగ్గను వుంచుకొని ద్రవమును, మింగుచుండవలెను. శైత్యమును కలుగచేసేవిన్ని అజీర్ణము కలుగచేసే వస్తువులను పత్యము చెప్పకూడదు. Fornr నెం ౪౭. ౬౧-౭౫, ౭౭, ౮౦, ౮౧, ౮౨, ౮౩, ఇచ్చేది. — — — —

## కోరింట దగ్గు, కక్కాయి దగ్గు Whoopingcough

గుణములు- రొంప కుండే గుణములతో ప్రవేశించును. జ్వరము- స్వల్పముగా గాని, బొత్తిగా లేకుండుటగాని, కలిగియుండును. నిద్రపోవుటయు విశేష ఆతురత కలిగి యుండును. ౧౪ దినములైనపిమ్మట దగ్గువచ్చినపుడు యెడతెగకుండా చాలాసేపు వుండును. దగ్గు వున్నపుడు యూపిరి చెలింపక పిల్లకాయ స్మృతిబొందుచున్నట్లు కానబడును. రుగ్మత సాధారణముగా చిన్నపిల్లలందు కనబడును. దగ్గువచ్చినపుడు యూపిరి విడుచుటలో షుష్టిగాను, స్వల్పముగానుండే ఊర్ధ్వశ్వాసము వలువారు యెడతెగకుండనట్లుగా విడివి దగ్గిదగ్గి పిల్లకాయ యూపిరి లేకుండునట్లు గనబడును. అటుపైని దీర్ఘమైనట్టి వూపిరిని లోపలికి చాలసేపుగా తీసుకొనును. ఇందువల్ల ఆఘుడియును వచ్చునట్టి దగ్గు శాంతించును. నిశ్వాసములో ఒక విధమైన ధ్వని గలుగును. ఈధ్వనికి, హూప్, అని పేరు. ఇదే యీ రుగ్మతయందు ముఖ్యమైన గుణము. దగ్గు యిట్లైనని కొంచముసేపుండి కొన్నహుడులవల్లగాని, వాంతివల్లగాని, ముక్కువెంబడి రక్తము పడుటవల్లనుగాని, అంత్యమైన రుగ్మత యెంత తీవ్రముగాను, తరుచుగాను, వడిగాను, యీపై గుణములు తిరుగా కానబడుచున్నవి. విస్తారముగా బలముగాను, రుగ్మతయందు రోగికి విశ్రాంతి గలుగక మూర్ఛగలిగి క్రిందపడిపోవును. ఈ దగ్గు సాధారణముగా, ౪ మాసములుగాని ఒకొక్కప్పుడు సంవత్సరము వఱకుగా నుండును. — — — —

హేతువులు—అంటువ్యాధై యున్నది. పిల్లలయందు ముఖ్యముగా కలుగుచున్నది. పెద్దవాండ్లందు సయితము క్వచితుగా కలుగును. వసంత ఋతువు శరదృతువు వీటియందిరుగ్మత హెచ్చును.— —

ఉద్రేక కారణములు—ఒకవిధమైన విషవాయు వూపిరినరముల యందు ప్రవేశించుటచే గలుగుచున్నది. — — —

సిధాంసించుట—బ్రాంకైటిస్- న్యూమోనియా- రొంప వీటియందు వూష్టము కలిగియుండును (కోరింటదగ్గులో) వూష్టము సాధార

ముగా నుండదు. రోగి ఆకలిగా నుండును. దీనియందు హూపే, ముఖ్యా గుణము, దగ్గు వచ్చినపుడాటలాడుచున్న పిల్లలు పెద్దవాండ్లవద్దకు వచ్చి, శరీరమును పట్టుకొని దగ్గిదగ్గి దగ్గు విడిచిన పైని తిరుగా నెప్పటివలె నాడుకొందురు.

సాధ్యాసాధ్యవివేకము— చిన్నలవైస్సుకంటే వాళ్ల దేహతత్వమును పట్టి విశేషహాని గలుగుచున్నది. ౩ మాసముల వైస్సుగల దృఢమైన, దేహము కలిగినటువంటి పిల్లకాయయందు రుక్మతచేసి ప్రబలించినను హానికలుగదు, పిల్లవాండ్లకు ౪ సంవత్సరములు వయస్సున్నను రాజరోగిదేహులైన యెడల (Scrophulous - constitutions.) స్వల్పముగా నీరుక్మత ప్రవేసించినను మృతిబొందుదురు. — — —

చికిత్స—ఉపశాంతి కలుగ చేయడమే సాధనముగానున్నది. మరియూ చకజాడ్యమువలె నిదియును, ఒకవిధమైన విషవాయువువల్ల గలుచున్నది. —గనుక దాని నిర్ణయకాలమువఱకు, అది నిలిచుండును. మొదట వాంతి కిప్పవలెను. డైల్యూటునైట్రిక యాసిడు ౧౫ పదిహేను చుక్కలు ప్రతి ౪ నాలుగు ఘంటలకు యిచ్చుటవల్ల గుణము కలుగ చేయును — అంటుమనీ, 1/12 గింజ యెత్తు గాని యొక 1/6 గింజెత్తుగాని, రోగియొక్క ప్రాయమునుపట్టి గ్రీపొడరుతో కలిపిగాని, ప్రత్యేకముగా గాని, కడుపులో తివ్వ పుట్టేవఱకు రోగికి, ౩-౪ పర్యాయములు యివ్వవలెను. అప్పుడపుడు సాధారణముగా విరోచనమయ్యేలాగు సాధనము చెయ్యవలెను. జంతుసంబంధమైన ఆహారము కాకుండా జీర్ణమయ్యేవస్తువులు పథ్యము చెప్పవలెను. రోగికి చలిగాలి తగలకుండా నుంచవలెను. ప్రశాంతికలుగునపుడును- దగ్గుయందు విశేషముగా నిబ్బంది కలుగునపుడును, టార్టర్ ఎమిటిక్, నల్లమందుతో కలిపి యివ్వవలెను. ( F నెం ౯౧, ౧౧౦· యిచ్చేది.— — — — —

యాంటుమోనియల్ ,,వైను, ½ ఔన్సు. — —

లాడనమ్. ... ... ౧ డ్రామ్. — —

మొత్తమున ౧ వకటిన్నర ఔన్సు అయ్యేలాగు ఆవిరినీళ్లు కలిపి యొక సీసాలో నుంచుకొని ౧౦ సంవత్సరముల వయస్సుగల చిన్నవాండ్లకు ౬౦

చుక్కలు చొప్పున రోజుకు ౨-౩ దఫాల నివ్వవలెను. కఫము లేకుండా నున్నపుడు వారముకు ౨-౩ దఫాల వాంతికి యివ్వవలెను. చాతీమునను, ఆవపిండి పోల్టీసు వేయవలెను- అయుడీన్ పేంటు, చెయ్యవచ్చును —

స్పిరిట్సు క్లోరిఫారము ¼ అరడాము. — —
ఇపికాకు. ... ... ౫ గ్రేనులు. — —
తేనే. ... ... ౧ డ్రాము. — —
నీళ్లు- ... ... ౧ ఔన్సు. — — —

ఇవి కలిపి యొక సీసాలోనుంచుకొని సంవత్సరము వయస్సు గల వానికిని రోజుకు ౩ దఫాలను, ౧౨ మోతాదులు చేయుపలెను. కస్తూరి-వెల్లుల్లి- ఇంగువ- కర్పూరము- బొరకు- ఈ ... లో నివ్వవచ్చును. బ్రోమైడ్ ఆఫ్ పొటాసియమ్, ఇవ్వవచ్చును. — — —

వైనమ్ ఇపికాకు- .... ౫ చుక్కలు. —
టింక్చర్ ఓపియం. ... ౧ చుక్క. —
సోడాబై కార్బోనాన్.... ౨ గింజలు. — —

నీళ్లు కొంచము కలిపి ౬ ఘంటలకొక పర్యాయము యివ్వవలెను.

| | |
|---|---|
| ఇపికాకు. ... ౧ గింజ- | కలిపి ౧౨ పొట్లములు కట్టి |
| క్లోరేటుపొటాష్. ౫ గింజలు. | ౧ సంవత్సరము వయస్సు |
| యక్ట్రాక్టుకొనియం. ౫ గింజలు | గలవానికి రోజుకు ౩-౪- |
| సినమన్ పౌడరు. ౧౦ గింజలు | పర్యాయములు యివ్వవలెను. |

ఇపికాకు. ... ... ¼ గింజ.— —
డోవర్సు పౌడరు- ... ... ౧ గింజ- — —
తుమ్మజిగురు గుండ.... ౫ గింజలు. — —

౧ సంవత్సరం పిల్లలకు కలిపి రోజుకు ౩ పర్యాయములు యివ్వవలయును.

---

## ( ఆస్తమా ) అనగా ఉబ్బస. Asthma.

గుణములు—ఈ రుగ్మత సాధారణముగా అజీర్ణమును పట్టి కలుగుచున్నది. తరుచుగా రాత్రియందు కలుగుచున్నది. చాతీయందొక వి

ధమైన పట్టుపట్టినట్లుండె యూపిరి విశేషము యిబ్బందితో తీయబడును.
రోగి తన యూపిరి క్రమముగానుండుటకు వాయువను కోరుచుండును ఈ
శ్రీమగల, యెగఊపిరి యందొక విధమైన గురుగు ధ్వని కలుగుచుండును.
( Wheezingsound ) రోగి పరుండుట నవకాశమై యిబ్బందిగానుండెను స్వ
ల్ప దగ్గు కలిగియుండును- మాటలాడుటకు యిబ్బందిగా వుండును. ఈగు
ణము నొకరాత్రి యావత్తుండి క్రమముగా తగ్గును, లేనియెడల కఫము వి
స్తారముపడి అటుపైని త్వరగా శాంతించును. ఈలాగునదఫదఫాలను, ౩
౪,౫ రోజులు పరియంతము కనపడుచుండి, అటుపైని చాలా కాలముగాని
కొంత కాలముగాని, కానబడకుండును. ఒకపర్యాయము రుగ్మత కలిగినవారు
వాత యేమాత్రము ఆధారము గలిగినను, తరుగా కానబడుచుండును. బా
ధకనబడినపుడు రోగి యూపిరి క్రమముగా తీయుటకు, విడుచుటకు, యి
బ్బంది కలిగి తన శయ్యపైనుండి లేచి యింట్లో, యిటూ అటూ తిరుగుచు,
కొంగొనిగాని, కూర్చున్నపుడు, తన చేతులు మోకాళ్లపైనుంచుకుని శరీర
ము ముందుకు వంచుకొని భుజములపైని నెత్తుకొని యుండును తలయం
దు నొప్పి ప్రథమములో కొందరికి గలిగియుండును. రక్తమొకప్పుడు స్వ
ల్పముగాగాని, అధికముగాగాని, కలుగును ఈ రుగ్మతయందుండు వూ
పిరి యొక్క ధ్వనియున్ను, ఆకారమున్ను, ముఖ్యముగా పట్టియిచ్చును.

హేతువులు—ఆధార హేతువు, వంశపారంపర్యాయం వచ్చునది.
గానున్ను, కంచుపమనుగానుండే శరీరములయందున్ను కలుగును. —

ఉద్రేక హేతువు—సమ్మర్థనము, పొగ కలిగినట్టియు, కాకగలయిం
డ్లు కొందరికి యీరుగ్మతను కలుగజేయుచున్నవి- కొందరియందు చలిగా
లివల్లను, మరికొందరికి వేడిగాలివల్లను కలుగును. గంధకము, ఇపికాకు,
పొగాకు, వీటియొక్క ధూళివల్ల కొందరికి కలుగుచున్నది- విశేష కసర
త్తు- విస్తారముగా మాట్లాడుట యెడతెగని ఆలోచనయు చలికి, చెమ్మకు,
బహిరంగమైయుండుట మామూలుగా శరీరమును విడిచిపెట్టే ప్రతివస్తు
వులలో నేదైనను, ఆటంకమౌటవల కలుగుచున్నది. అజీర్ణ రుగ్మత ము
ఖ్యముగా నీరుగ్మతను కనపర్చుచుండును. ఊపిరి నాళముయొక్క మాం

-ఘు పోటులు వాటంతటవి ముడుచుకొనుటవల్ల నీరుగ్మత కలుగునన్నూ చుదురు.— — — — — —

చికిత్స—ఉపశాంతి, శాంతి, రెండువిధములు, ఉపశాంతి వెంట నే జేయవలెను. ఇందుకు, టింక్చర్ లోబిలియా, ఈతరియా, ౧ డ్రాము గాని, ఇపికాకు ౨౦ గింజలుగాని, టార్టర్ ఎమిటిక్, ౩ గింజలుగాని, నీళ్లలో కలిపి యిచ్చుటవల్ల వాంతి అయిన చాలా మేలిచ్చును. కాళ్లు చేతులు, కాపించుటగాని, శరీరమంతా కాకను యుంచవలెను. విశేషకాలము బాధ యుండినయెడల కొనియం లోపలికి పిర్చ్వవిధమున పీఛించవలెను. అజీర్ణముచల్ల కలిగినయెడల, అందుకు సాధనము జేయవలెను. దుత్తూరపాకు చుట్టలు కాల్చుటవల్ల వెంటనే యుపశమించును. చాతీమీద నావపిండి పోల్టీసుగాని, కపింగుగాని, వేయవలెను- నల్లమందు యీగి రుక్లోరిఫారంబెలడోనా, ఇంగువ, వెలీరియనా, వీటివల్ల కొందరికి కుదురును. టింక్చర్ ఓపియం, ౨౦- ౩౦. చుక్కలు- ఈతరుసల్ఫ్యూరిక్,౩౦- ౬౦ చుక్కలు నీళ్లలో వెంటనే యిచ్చుటవల్ల, అప్పటిబాధ కట్టును. రోగికి బాధ కలుగునని తోచినపుడు ముందుగానే వాంతికి పుచ్చుకొనుటవల్ల గాని, దత్తూరపాకు చుట్టలు కాల్చుటవల్లను కొందరిలో పొగచుట్ట కాల్చుటవల్లను అడ్డి వేయుచున్నది. అజీర్ణమును పుట్టించేవస్తువులు పథ్యమివ్వకూడదు సూక్ష్మముగా జీర్ణమైనట్టియు సత్తువగలుగజేయునట్టి పథ్యముచెప్పవలెను. విరోచనములనుగురించి ఘుట్టిశ్రద్ధచేయవలెను కడుపుపొంగు యెప్పుడు విస్తారముగానుంటుందో అప్పుడు పటిక, శొంఠి పొడిమాత్రలుచేసి గాని, పొట్లములుగాగాని, రోజుకు ౩ పర్యాయములు యిచ్చుటవల్ల పోవుచున్నది. బాధయుపశాంతి అయినపిమ్మట బాధను పుట్టించే హేతువ యేదైనా కన్నకొనినయెడల వానిని ముఖ్యముగా విడువవలెను. జీర్ణ శక్తిని కనుగొనచుండవలెను. విరోచనబద్ధములు కాకుండనుంచవలెను. అయితే అది మిక్కిలీ విరోచనములకు యివ్వకూడదు. — —

యోగము ( F )నెం ౧౮, ౩౬, ౭౧ లు. యిచ్చేది.

---

౧. ౭ గ్రేనుల కెఫీను వుపయోగించును.

టార్టర్ రెమిటిక్, అయింటుమెంటు గుండెలపైని రాయించవలెను. సారాపకైరాలు యివ్వకూడదు. బాధ లేని దినములలో తిరుగా బాధ రాకుండా లోహసమ్మంధమైనట్టిన్ని జింకుసంబంధమైన మందు లివ్వవలెను. పొటాస్ ఐడన్, కొన్నిటియందు కాపాడుచున్నది. పాషాణ ద్రావకము రోజుకు 3 పర్యాయములు నీళ్లలో, ౫ దేసి చుక్కలు కలిపియిచ్చి కళ్లుమంట యెప్పుడు కానబడునో అప్పుడు మాని వేయవలెను. జబ్బు చేసినప్పుడు, క్లోరిడీన్, ఈతడీన్, నైటరు పేపరు కాల్చడము, పెరక్లోరిడీను యిచ్చేది. — — — —

## గుండెకాయల యందు కలుగు రుగ్మతలు. Hart Disease.

ఇవి మూడు విధములు, ౧ గుండెను కప్పుకొనివుండే పొరయందు వారుపు కలుగునపుడు, పెరికార్డైటిస్ అనబడును. ౨ గుండెకాయయందు, రుగ్మత ప్రవేసించునపుడు కార్డైటిస్ అనబడును. 3 గుండెకాయి కొవ్వుట, దగ్గుట - అట్రఫి అనిన్ని, గుండెకాయి పెరిగినపుడు హైపర్ట్రఫియనిన్ని, ౫ గుండెకాయ విడునపుడు, డైలిటేషన్ యనిన్ని, ౬ నీలిరుగ్మతగానున్నపుడు, సైనోసిస్ యనిన్ని వాడుకొందురు. — —

## ౧ పెరికార్డైటిస్. Pericarditis.

ఈ రుగ్మత సాధారణముగా మేహ వాతమునుంచి గలుచున్నది.

గుణములు చలివచ్చిన పిమ్మట నెడగుచను మొనక్రిందను చాతీకి మధ్యప్రదేశము వైపు విస్తారముగాగాని, కొంచముగాగాని, నొప్పికలిగియుండును. ఇది యెడమ చంక వైపు, యెడమచేతి వైపు వొకానొకపు డెడమ చేతి మొకా - పోటీవలెను నొప్పి కలిగియుండును. ఈ నొప్పి బహు శ్రమను కలుగ జేయుచు పొడుస్తు వుండును. గుండెవొక్కినట్లుండును. చాతీయెముకల మధ్యాన నొక్కుటవలన పక్కను పడుకోవడమువల్లను నొప్పి యున్నపుడు వైనన్ని లేనపుడు కనబడుచుండును. గుండెయదురు చపలముగా నుం

[illegible]

ముగ్గా నుండె నాడి కలిగియుండును అరుదుగా స్వల్పమైనటువంటి క్రి
గా నడవనటువంటిన్ని విశేషమురితము కలిగినటువంటిన్ని నాడి కలి
ండును. ఎగయూపిరి గాని యూపిరి తీయునపుడు నిట్టూర్పులు లేక వె
ను కలిగియుండును చాతిలో బరువు విశేషముగాను విశ్రాంతి లేకుండు
శేషముగా శుభ్రవాయువ గోరుచుండుట శరీరము చమటలుపట్టిగాని
గాను వేడిగాను కానియుండుట ముఖము వాడియుండి, ఒకానొకపు
నరములు లాక్కొనిపోవడముగాని, పరాకుమాటలుగాని కలిగియుండు
ంగి నిద్రపోయినయెడల భీతికలిగిన కలలువచ్చి మేలుకొనుచుండును రు
హాని కలుగచేయునపు డూపిరి విశేషమిబ్బందిగా విడుచుచు ముఖము
వులినట్లుండి కడుపుకండ్లుగలిగి శరీరము ముచ్చెమటలు పట్టియుండును
ంతికలుగును.—— —— —— —— —— —— —— —— —— ——

నిధానించుట—ఈరుగ్మతను ఫ్లూరసీ,న్యూమోనియాలనుంచి ప్రత్యే
చుట అసాధ్యమైనను వాటియందుండు ముఖ్యగుణములనుపట్టి ప్రత్యేకిం
గును. ఈరుగ్మతయందు గుండెకాయకున్ను పొరకున్ను మధ్యను శీరమ్
నే నీరు చేరడముగాని మఱియొకవిధమైనటువంటి ద్రవముపుట్టి రెంటినిక
డముగాని- ఒరుపు విశేషమాటవల్లను చాపునుగాని కలుగచేయును తరు
గా గుండెకాయ దానిపొరతో కలిసిపోవుట జరుగును. —— ——

సాధ్యాసాధ్యవివేకము- పట్టినీరు పుట్టురుగ్మతలుమాత్రము కుదురును
గా నిశ్శేషముగా కుదురును.—— —— —— —— —— —— ——

హేతువులు—ఆధార హేతువు— వంశ పారంపర్యాయముగా వచ్చు
దిన్ని మేహాశరీరము వాతశరీరములందున్న పురుషులలో ౧౦ సం॥లు
ందలుకొని ౩౦ సం॥ లవఱకు కానబడుచున్నది. —— ——

ఉద్రేక కారణములు— చలవ మేహవాతము శరీరమునందు వ్యాపించు
లన గుండెకాయకు చుట్టు ప్రక్కలనుండు పరిలిత్తులయొక్క గాని వాటి
ప్పే పొరయందుగాని ఒరుపు కలుగుటవల్లనున్ను గురదాలయందు రుగ్మ
లుగుటవల్లనున్ను చీము వ్యాపించవల్లనున్ను కలుగును. —— —— ——

చికిత్స— చాతీయందున్నబొప్పి పైనిక్షపంగు నుగాని జలగనుగాని ప

ట్టించవలెను లోపలికి టార్టర్ ఎమిటిక్ నల్లమందుకలిపిగాని, నల్లమందు క్యాలమెల్ కలిపిగాని ఘూమ్ముగోకపర్యాయ మివ్వవలెను,డిజిటేలిస్ ఈ రుగ్మతలో ముఖ్యముగా నివ్వవలెను, దీనివల్లగుండెదడతగ్గును,దానియం దుండు నీరుహరించును చాతీపైని రసపలాస్త్రీ మర్ధనా చేయవలెను మేహ వాతమువలన నీరుగ్మతకలిగినపుడు కాల్చికమివ్వవలెను డిజిటేలిస్ ౧ మొదలు ౩ గింజలెత్తువరకు రోజుకు ౨ పర్యాయములివ్వవలెను, టింక్చర్ డిజిటేలిస్ ౧౦ మొదలు ౨౦ చుక్కలువరకు ఆగుణమునే కలుగచేయడమునకివ్వవచ్చును, యుక్టాలిక్ట్ కాల్చినై ౧ గింజెత్తు రోజుకు ౪ పర్యాయములివ్వవలెను. అప్పుడప్పుడు విరోచనసాధనములు చేయుచుండవలెను. కాకచేయనట్టి వస్తువులివ్వకూడదు విస్తారపుపాటు పడకూడదు సత్తువను కలుగచేసే వస్తువులనివ్వవలెను. జెమ్సుపౌడరు రుగ్మతలో ౧౦ గింజలెత్తు రోజుకు ౩ పర్యాయములివ్వవచ్చును, నొప్పి విస్తారముగానున్నపుడు క్లోరల్ హైడ్రేట్ ౧౦, గ్రే॥ నీళ్లలోకలిపి యివ్వవలెను. ఈరుగ్మత పురాణించునపుడు గుండెదడ-ఎగయూపిరి పొడదగ్గు- యెడమువైపుపరుండుటకు శక్యతస్వల్పమైననొప్పి చాతీనొక్కినట్టుండడము, విశేషనిస్సత్తువ గలిగియుండును, ఈస్థితిలో హైడ్రోపెరికార్డియమ్ కలుగును. ఈలాగు పురాణించినపుడు, చాతీయందు నొప్పిగలస్థలమునందు పొక్కు పలాస్త్రీ వేయవలెను, వాతమువల్లకలిగినపుడు అందుకుతగినౌషధము లివ్వవలెను, విశేషబలహీనముగా నున్నపుడుఇన పఅరఖు పొటాసి ఐయడ్ స్పిరిట్ ఐడమ్మోనియా ఇవ్వవలెను.

| | | |
|---|---|---|
| టింక్చర్ ఆఫ్ ఐరన్ ...... | ౧౦ చుక్కలు | కలిపి రోజుకు |
| క్వైనైన్ ... ... ... ... | ౧ గింజ | ౩ పర్యాయ |
| నీళ్లు ... ... ... ... ... | ౧ ఔన్సు | ములివ్వవలెను |

ఐడైడాఫ్ ఐయరన్ ౧ గింజ గ్లిసరిన్ ౫ గింజలుకలిపిమాత్రచేసి రోజుకు ౨పర్యాయములివ్వవలెను సిరప్ ఆఫ్ లాక్టేటు ఆఫ్ ఐయరన్ ఇచ్చుటవల్ల దేహమునకు మిక్కిలి దృఢముకలుగును. నెం ౨౨ యిచ్చేది.

## యండోకార్డైటిస్ Endocarditis.

గుండెకాయయొక్క రెండవపార్శ్వమైన యండోకార్డియమ్ అనేదానియందోరుపు కలిగియుండును. — — —

**గుణములు**—విశ్రాంతి లేకుండుట గుండెయందు భారము మూర్ఛక ...గి ప్లూరసితోగాని, పెరికార్డైటిస్‌తోగాని, యీ రుగ్మతకలసి సంభవించి నపుడుతప్ప నొప్పికలిగియుండదు రుగ్మత పూర్ణావయవస్థలో నుండునపుడు జ్వరము తీవ్రముగానుండును శరీరము విశేషకాకగాను ఆరిపోయినట్లుండును, విదాహము- త్వరగాను వక్రతగాను గుండెకాయ కొట్టుచుండును చిన్నదైనట్లున్ను బలహీనమైనట్లున్ను తరుచుగా కొన్ని దెబ్బలుకొట్టి యూరకుండి తిరుగా కొట్టినదిగా నుండును. చల్లని చెమటలు పాలినటువంటివిన్ని ముడతలు పడ్డటువంటివిన్ని ముఖవర్ఛస్సు విశేష తొందర, యెగసూపిరి, మూర్ఛపొందుట, పెదవెలు, బుగ్గలు నీలిరంగుగా నుండును. చేతులు, మీకాళ్లు కొంచము పొంగుగలిగి యుండును కొంచముగా నరములు లాగుచుండును.— — — — —

హేతువులు— పెరికార్డైటిస్ యొక్క హేతువులే. ... ...

సాధ్యాసాధ్యవివేకము. ఈ రుగ్మత సాధారణముగా హానికలుగజేయుదు, చాలాకాలము శరీరమునందు స్థావరముగానుండును. ఈ రుగ్మతవల్ల గుండెకాయ పెరుగుట కలుగును. ... ...

చికిత్స— పెరికార్డయిటిస్ వలెనే రుగ్మతను కుదర్చవలెను. ...

## కార్డయిటిస్. Cardits.

గుండెయందువాపు కలుగుట, ఈరుగ్మతపైని చెప్పిన రెండు రుగ్మతలకు సంబంధించే గాని, ప్రత్యేకముగా రానేరదు. ఈ రుగ్మత రోగి చచ్చిన తరువాత శవమును కోసి పరీక్షించుటవల్ల తెలియనగును గాని, బాధగలిగి యుండునపుడు పట్టుపడుట కష్టము. ... ...

గుణములు— గుండెదడ, త్వరగాను, పూర్ణముగానుండు నాడియు, గుండెకాయ యుండు భాగమునందు బరువున్ను అప్పుడప్పుడు పొడిచే నొప్పియును. ఈ నొప్పి భుజము మొదలు ముంజేతి వఱకు గలిగివుండును కొంతమట్టు వెగటుసూపిరి కలిగియుండును. ఈ బాధలు కలిగినపుడు దేహమందుండు మాంసపు కండలయందెక్కడైన వాతనొప్పులు కలవేమో చూడవలెను. ... ... ... ... ...

చికిత్స— పెరికార్డయిడిస్ వలెనే బాగుచేయవలెను. ... ...

## గర్భమునందుండు రుగ్మతలు.

### పెరిటొనైటిస్. Peritonitis.

గర్భముయొక్క లోపల ప్రక్కను కప్పియుండి గర్భమందుండు పేగులు మొదలగువాటిని చుట్టియుండే పొరలేక వపయందు గలుగునట్టి వకవిధమైన (ఇన్ఫ్లమేషన్) Inflamation. యొరుపైయున్నది. ఈ రుగ్మత గర్భమందంతట చెదిరిగాని- కొంతమట్టుకుగాని- నవీనముగాగాని- పురాణముగాగాని- యుండును.

గుణములు—నవీన పెరిటొనైటిసు సాధారణముగా చలితోను, చపలమైన నాడితోను, అనగా త్వరగా కొట్టుకొనేది- ఉష్ణము నాభియందు యల్లప్పుడు వుండే విశేషనొప్పి యీ నొప్పి నడుములో పొడుచుచుండును. యీ గుణములతో వచ్చి నాడి తాడులాగున ఘట్టిగానుండి నొక్కబడక మినిటుకు ౧౨౦ దెబ్బలు కొట్టుచుండును, ఊపిరి తొందరగా తీయుచుండును, విదాహము నాలుక మలినముకలిగి కడుపువాచి యుండి బహు నొప్పికలిగి యుండును పక్కబట్టలు కడుపుమీద పడుటవల్లగాని- యేమాత్రమైన నొక్కినయెడల విశేషముగా రోగికి బాధకలుగును, రోగి తన పక్కమీద వెల్లకితల పరుండి మోకాలు పైకిముడుచుకొని యుండును. వాంతియు విరోచన బద్ధము కలిగియుండును. తలనొప్పి నిద్రలేమి కలుగును. రుగ్మత విశేష బలముగానున్నపుడు పరాకుమాటలు, కాళ్లు చేతులు, చలవలు వలముసు వాంతి చేసుకొనుటయు, కలిగి తుదకు మాంద్యము కలిగి మృతిబొందును. ప్రసూతైన స్త్రీలలో యీవ్యాధి కలిగినపుడు ప్రలాపము పరాకు విస్తారముగానుండును. పురాణ పెరిటొనైటిసు ఇందుపైని చెప్పిన గుణములుగాక బలహీనము గాను, ముఖము బహు తెసిగాను, విశ్రాంతి లేకుండుట, ఘట్టిగా విరోచన మిబ్బంది కలిగియుండును. ఒకవిధములో విరోచనములు- పచ్చకామిల్ల జలోదరము కొన్నివాపు జ్వరము కలిగియుండును. ... ... ... ...

నిధానించుట— సాధారణమైన కడుపునొప్పి, కడుపునొక్కుటవల్ల శాంతిగానుండి దఫాదఫాలను కానబడును. ఈ రుగ్మతయుండెల్లపుడు నొప్పికలిగి నొక్కితే నెప్పవగును. మేహరోగమువల్ల కలిగిననొప్పియందు నా

డిని రోగముగా నుండును. నొక్కితే విస్తరించక జ్వరము కలిగియుండును

ధ్యాసాధ్య వివేకము ఒరుపెంత విస్తారముగానుంటే అంతను ట్టుకు కఠినము చేయుచున్నది. నొప్పి కొంత భాగమునను కలిగియుండి నుంమలను లోబడినపుడు, సాధ్యమున్న విరోచన సాధనము చేసినపుడు, సైతము విరోచన బద్ధము గలిగియున్న యెడల నుగుణము నొప్పియు ధాత్తుగా పోవడము వెక్కిళ్లు రావడము మృత్యువు దగ్గరైనట్లు తెలియజేయుచున్నది.

హేతువులు—ఆధార హేతువు దుర్బలము. .. ... ..

ప్రజ్వలము—చలనప్రదేశములు సీసము విరోచనబద్ధము- గాయములు- దెబ్బలు శస్త్రచికిత్సలవల్లను, పిల్లను కనుట యీ రుగ్మతా పురజాలుయందు కానబడినపుడు అంటురుగ్మతవలె యితరులను అంటును- ...

చికిత్స— ౧౦- ౨౦- ౩౦ జలగలు కడుపుకు పట్టించవలెను. టర్పెంటైనను కడుపుమీద రాసి వేడికట్లు కాపడము పెట్టవలెను. అవపిండి, అవిశపిండి, పోల్టీసులు వేయవలెను. క్యాలొమెలు నల్లమందు కలిపి మాత్రలు చేసి తరుచుగా రోజుకు ౩- ౪ ౫ పర్యాయములు యివ్వవలెను. విరోచనబద్ధమైనపుడు తెల్లాముదమివ్వవలెను. సొక్కపలాస్త్రి గర్భముమీద వేయవలెను. టాంబరు ఎమిటిక్ 1/6 గింజెత్తు రోజుకు ౪ పర్యాయములు చొప్పున కడుపులో తిప్పకలిగే వరియంతము యివ్వవచ్చును. విశేషనొప్పి కలిగినప్పుడు క్లోరల్ హైడ్రేటు, ½ డ్రాము మోతాదు చేసి వేడి నీళ్లలో కలిపి యివ్వవలెను. క్లోరిడీను కూడా వుపయోగించుచున్న పాలు సగ్గుబియ్యము అరరూటుపిండి మొదలగునవి యివ్వవచ్చును. గంజి అన్నము పెట్టవలెను వెక్కిళ్లు పోవుటకు యీతరు సల్ఫ్యూరిక్ కడుపులోకి ½ అరడ్రాము మోతాదు చేసి యిచ్చుటవల్లగాని క్లోరిఫారమ్ వాసన జూచుటవల్లగాని శాంతించును. జలగెలు కడుపుమీద పట్టించుటకూడ వుపయోగించును యోగము నెం॥ ౧, ౯౪, యిచ్చేది. — — —

క్వైనను నల్లమందు, కలిపియిచ్చేది. నాభి అరిష్టు డిజిటాలిసు. కొన్ని తరహాలలో వాడుక చేయనగును. ద్రవపదార్థము చల్లనిది కొంచెము కొంచెముగా అప్పుడప్పుడిచ్చేది- మాంస కషాయము- సీరసములో,

చారింది యిచ్చేది, వాంతి విస్తారముగా వుంటే ఆసనము ద్వార ఆహార ము పిచ్చికారీ చేసేది. ... ... ... ...

Infantile Aphthoe or thrush.
ఇన్ ఫేంటయిల్ ఆఫ్థీ (థ్రష్)

గుణములు—వాంతి కడుపులోనొప్పి శిశువుయొక్క కాలు పైకి లాగుటవల్లను గాని, కడుపు నొక్కుటవల్ల గాని, శిశువుయొక్క మీకడు పువల్లను గాని, ఆనొప్పి తెలియబడును. విరోచనము ఆకుపచ్చరంగుగా నుండి, అందురక్తము- చీము మిళితమైయుండి హారముగాని నీళ్లుగానిలో పలికి పుచ్చుకున్నపుడు వెంటనే విరోచనమగును. పిల్ల విశేషముగా ఎండి యుండును. చర్మము మెత్తగాను, నాలుక యర్రగాను, నోరు- పెదవు లు- ఒరిసినట్టు కురుపై అందు పొక్కులవలెపుట్టి యూడిపోవుచుండును. ఆక లి మందమై యుండును. మాంద్యము కలిగియుండును. రుగ్మత బలముచే సినపుడు జ్వరము తీవ్రముగానుండును నరములు లాగుచుండును. కాళ్లు చేతులు వంకరలు పోవుచుండును. (Convulsions.) మాటలాడకుండా తె లివితప్పి పరుండును. తలయందు నీరుచేరి తల పెరుగును. ఈ మూడుగు ణములలో నేదైన కలిగినపుడు మృతికలుగును... ... ...

హేతువులు—భోజనమునందు క్రమము లేకపోవుట-... ...

ఇది యొకటి మొదలు ౧౦ మాసముల లోపుగానుండు పిల్లలయం దు కనబడుచున్నవి. ... ... ... ...

చికిత్స—ఆముదము స్వల్పముగా నిచ్చి విరోచనమయ్యేలాగు చే యవలెను. ... ... ... ... ...

రూబార్బు .. 3 గింజలు. } కలిపి రెండు పొట్లములుచేసి ఉదయముసా
మెగ్నీషియా ౬ గింజలు. } యంత్రమివ్వవలెను. — — —

గ్రేపౌడరు- ౨ గింజలెత్తు రోజుకు, ౨ పర్యాయములు యివ్వవలెను. యి పికాకు కూడా యివ్వవలెను నల్లమందు నీళ్లతో కడుపు కాపవలెను. రా త్రియందు నిద్రపట్టుటకు వేడినీళ్లు స్నానము చేయించవలెను. బల ము చేయు ని ఆహారము, పాలు నివ్వవలెను. ఈరుగ్మతా సంబంధమవ్వేటప్పుడు ర లేక ౫

సంవత్సరములవయస్సుగల వాళ్లకు సహితము గలుగుచున్నది. అప్పటి లో చికిత్స చేయడమందు క్యాలుమెలు, యిపికాకు, కింపౌండుపాకుపౌ డరు, నల్లమందుతో గాని, ప్రత్యేకముగా గాని, యివ్వవలెను. పటికనీళ్లు పుక్కిలించుటవల్లనున్ను వెలిగారము తేనెలో కలిసి నోటికి పూయుటవ ల్లను. కసగలవస్తువులు నోటికి పూయుటవల్లను బాగుపడును. నెలరరు యిచ్చేది. ... ... ... ... ... —

---

ఎంటరైటిసుమ్యూకోజా. Enteritis.

నాభి శైత్యము.

పేగులయందుపోరుపు కలిగియుండును. పెద్దవాళ్లలో గలుగుచున్నది. అజీర్ణమువల్లగాని, క్షయవల్లనుగాని, ప్రత్యేకముగా గాని, సంభవించును.

లక్షణములు—గర్భము వుండునవలె వుండును. నొక్కినప్పుడు వి స్తారముగును. నాడి తొందరగాను నొక్కితే నొక్కబడేదిగా నుండును. విదాహము, సుస్తీ, నిద్రలేమియు ముఖమునందాశ కలిగియుండును. నాలుక యెఱ్ఱగాను. సన్నగా వుండును. పెదవులయందును నోటిలోను పొక్కు లు గలిగియుండును- వాంతి కలిగియుండను. ఆకలిలేక యుండును. పోటు కడుపుపొంగు- అజీర్ణ విరోచనములు, విరోచనమందు విస్తారముగా నాం బము అప్పుడప్పుడు రక్తముగలిగియుండును. స్వల్పముగా నైవిస్తారముగాని, భోజనము చేయగానే విరోచనము కావడము ముఖ్యముగా నీరోగులయం దు గలిగియుండును. తీవ్రముగా వ్యాధి వున్నపుడు జ్వరముండును. చిన్న పిల్లలయందు విస్తారము ఉష్ణముండును. కడుపుపొంగు విస్తారము, నోటి యందు పోటుబ్రాతి వుండును. శరీరము పీకు- నుబ్బు నైకము వాతము కపుడు కలిగి స్మృతి కలుగజేయును కొన్నివిషములవల్ల నివ్యాధి సంభవిం చినపుడు బాధలు విస్తారముగానుండి వాతము చేసి, కాళ్లు, చేతులు చ ల్లబడును. — — — — —

సాధ్యాసాధ్య వివేకము—త్వరగా కుదరదు- ఆహారమునందు యేమాత్రము జబ్బు కలిగినను, పైన చెప్పిన గుణములు కలుగుచుండును.

హేతువులు — ఆధారహేతువులు॥ మబ్బలము. — —

ప్రజ్వల హేతువు — విస్తారముగా పాటుపడుట మనస్సునందు కోరికలు కలిగియుండుట, పైనయుండే కారణము నార్పులు కలుగుటవల్ల, యీ వ్యాధి తలయిలోనొక లక్షణముగా యున్నది. — — —

చికిత్స — కడుపుకు కాపడము పెట్టవలెను సులభముగా విరోచనము చేయించవలెను. తెల్లాంది మివ్వవచ్చును. మేనాకూడా సులభంగా విరోచనము చేయును. గ్రేపౌడరు 3 గింజ లెత్తు రోజుకు రెండుపర్యాయములు యిచ్చుటవల్లను గాని, క్యాలుమెలు, యిపికాకుతో గాని, డోవర్సు పౌడరుతో గాని, యిచ్చుటవల్ల కుదురును గంజితో నల్లమందు అరఖు కలిపి యథోమార్గముగా లోపలికి కొట్టవలెను. పథ్యములో బహుజాగ్రతగానుండవలెను. పథ్యపు వస్తువులు, ఉద్భిజపదార్థములలో బహుసులభముగా జీర్ణమయ్యేది యివ్వవలెను. కొంచము పాలు యివ్వవచ్చును. చాలాకాలము జీర్ణమైన పిస్తులు రోగిని మంటియొకచోటి కంపించవలెను. విరోచనములు అవుచున్నయెడలను, యోగం నెం॥ ౨౩, ౧౩౦ యిచ్చేది — — — — —

పిల్ ప్లంబైకం ఓపియో 3 లేక ౪ గింజలు యెత్తు రోజుకు 3 పర్యాయములు యివ్వవచ్చును. విరోచనమందు రక్తము పడునపుడు గేలీక్యాసిడ 3 గింజలు ప్లంబై ఆసిటాస్ ౧ గింజ గులకందు మాత్రయ్యేటట్టు కలిపి రోజుకు ౨ 3 పర్యాయములు యివ్వవలెను. దీర్ఘజాడ్యములో టించెరు ఫెర్రై అను ఉక్కు అరఖు ౨౦. 3౦ చుక్కలు మోతాదుగా నీళ్లతో నిచ్చేది. — — —

మైలతుత్తం ... — ¼ గింజ. — — —

పిల్ సేపోకంపోండు.. ౨ గింజలు. — — —

కలిపి మాత్రచేసి రోజుకు 3 పర్యాయములు యివ్వవలెను. ఈవ్యాధిలో నొప్పి, డోకు, వాంతి, కడుపు పొంగు పోయేలాగు సాధనము చేయవలెను. యిందుకు నెం॥ ౨౩ యిచ్చేది. — — — —

## రక్తవిరోచనము (Dysentery.)

### నులికడుపు.

భేదములు— ప్రత్యేకముగా కలుగునవి మరియొక వ్యాధితో కలిగియుండునవి.— — — — — —

మొదటివిధము గుణములు- కడుపులో విశేషనొప్పియున్ని పలుమారు దేహబాధకు వెళ్లుటకిచ్ఛయున్ను కలిగియుండును విరోచనములు నీళ్లువలెనున్ను చీము రక్తము మిశ్రమములై సాధారణముగా మలముకలిగి యుండకయుండును ఈ వ్యాధియందు పడుమ్యూకస్ అనుదానికి చీము జిగటఅని తెలుగులు పేరుకొందురు విరోచనము వాసనయొకవిధముగా నుండును ఒకానొకప్పుడు పెంటికలుపడును ఈలాగు విరోచనము పిష్టముకట్టినప్పుడు రోగి విశేషముగా తినుచున్న వాంతికూడాకలిగి యుండవచ్చును. ఏమాత్రమాహారము గర్భములోకి వెళ్లినను కడుపునొప్పియున్ని- ఆసనముపీకుడున్ను కలిగియుండును మూత్రముకూడా బాగా కాకుండును విశేషజ్వరము కలిగియుండును నాడి వేగముగానుండును శరీరము పొడిగానుండును. నాలుకయందు దట్టమైనట్టియున్ని తెలుపు- పచ్చరనముగల మలినము కలిగియుండును ఒకానొకప్పుడు యెఱ్ఱగాను నున్నగానుండును విశేషబలహీనము- కాళ్లు చేతులుపీకుట వెక్కిళ్లుకలిగియుండును. ప్రథమం కొంచెముగొప్ప జ్వరముండును.

హేతువులు— చెడువాయువు- చెమట- అకస్మాత్తుగా కట్టిపోవుట బట్టలేక చలిగాలిలో తిరుగుట, కసుకాయలను హద్దులేక తినుట, శరీరము విస్తారము కాక చేసి యున్నప్పుడు విశేషబలుపు పదార్థములను పుచ్చుకోవడము.— — — — —

నిదానించుట— దీనియందు ముఖ్యమైన గుణములు కడుపునొప్పి, పలుమారు దేహబాధకు వెళ్లవలెననియుండుట విరోచనమందు చీము, రక్తము, కలిగియుండుట.— — — —

చికిత్స— అనేకవిధములుగా నున్నది. — — —

అజీర్ణవస్తువులు మానడము కొనవస్తువులు ఔషధములుగా నివ్వవలయును క్లోరిడీనువలన చాలాగుణముగును. — — —

కొందరు రక్తముతీయుటచేతను విరోచనసాధనము చేయుటచేత

గును కొన్నిచోట్ల నీవ్యాధి యకృద్వ్యాధికి తరువాతకలుగును. ఇట్లుకలుగు నపుడు కలేజాయందు సురుపు కలిగియుండునని నిశ్చయించవలెను.

చికిత్స— యకృద్రోగముచికిత్సయును- నులిగడుపుకు పైనిచెప్పినట్టి సాధనములు తెలిసికొనిన సూక్ష్మముగాను, క్రమముగాను చేయవచ్చును.

యింప్లమేషన్.

ఇందు ముఖ్యముగా వాపు, శరీరపుకాకకంటే నెక్కువకాక, నొప్పి, ఎరుపుకలిగియుండును. దీనికి ఒరుపని, మేహమని, యీ గ్రంథంబున వాడంబడెను. — — — — — — — —

హిపటైటిస్.

కాలేజమునకప్పిపొరయందుగాని, కాలేజమునందుగాని, యింప్ల మేషన్ కలుగునపుడు హిపటైటిస్సనబడును. ఇది తరుణమని, పురాణమని, రెండువిధములు. — — — — — — — — —

తరుణయకృచ్ఛోహము. Acute Hepatitis.

గుణములు— తీవ్రమైనయుష్ణము, విదాహము, మూత్రము కొంచము, ఒకానొకప్పుడు సన్నిపాతజ్వరలక్షణములు కలిగి కుడిపక్క నింపుగా నుండి అందునొప్పికలిగియుండి ఆ నొప్పి కుడిభుజముకుపోడుచుచుండును. యీనొప్పి సర్వదా శ్రయించి యుండి యుండిన నూపిరితీసినను దగ్గినను, విస్తారమగును. కొంచముగాగాని, విస్తారముగాగాని, యూపిరితీయుట కిబ్బందికలిగి పొడిదగ్గున్ను యెడమపక్కను పరుండుటను నిబ్బందికలిగియుండును. సాధారణముగా విరోచనబద్ధము ఒకానొకచో విరోచనములుగాని నులిగడుపుగాని, కలిగియుండును. పచ్చకామెర్లయు, నాడిత్వరితముగాను, ఘట్టిగాను, శరీరముకాకగాను, పొడిగానుండును. జీర్ణకోశమునందుండు ఒరుపుచే నోకరింపున్ను వాంతియున్ను కలిగియుండును. కొందరియందు మనస్సువిచారస్థితిని పొందియుండును విరోచనము బురదరంగుగాని. యూకుపచ్చరంగుగానియుండి కడుపు కుడివైపు బిగించియుండును.

హేతువులు— యింప్లమేషన్ కలిగేయున్నికారణములున్ను దెబ్బలు, రక్తవిరోచనములు, న్యాయమైనయూయముగు రోగము. — — —

సాధ్యాసాధ్యవివేకము— ౩ ౹ ౭ రోజులందు విరోచనములుగ

శమునకువచ్చినవారికి రక్తముతీయుట యనుపయోగకరము మూడు నాల్గు గ్రేనులు రసవేహము రోజు రాత్రియందునిచ్చి నుదయమందు మెగ్నిషియాగాని, యెప్సంసాల్టు టెరాక్సికంగాని, యిచ్చేది- అయితే రోగి నీరసించకుండ చూచుచుండవలెను. నెం॥ 117- 120 యిచ్చేది.

మెగ్నిషియాసల్ఫేటిస్. ౭ డ్రా

మెగ్నిషియాకార్బోనేటిస్. ౨౦ గ్రే

పెప్పరుమెంటునీరు. ... ... ... ౧ ఔ

కలిపి ప్రతియుదయము నిచ్చేది.

మెగ్నిషియాసల్ఫేటిస్. ... ... ౭ డ్రా

టెరాక్సికంకషాయం ... ... ౧నర ఔ

కలిపి యుదయమందు కొన్నివారములిచ్చేది. అయిడన్ పలాస్త్రీగాని రసము ఐడనుకలసిన పలాస్త్రీగాని ప్రతిరాత్రియందు నొప్పియున్న స్థానముమీద రాయించవలెను. — — — —

తరుణరుగ్మత మూడువిధములుగా నంత్యమగును.

౧ నివారణ ఇది తరుచుగా కలుగదు.

౨ పురాణయింప్లమేషన్. — — — — — —

3 కురుపు ( Hepatic Absces ) Abscess of Liver.

ఈలాగు కురుపుకలిగినపుడు చీముపడితే నాడినిండుగాను వేగముగానుండును చలి, కుమపు, జలదరించుట, సలుపు,పక్క లోబరువుగానుండుట, చీము బాగాకలిగిన తరువాత హెక్టిక్ జ్వరమున్న రాత్రియందు చెమటయుకలిగి యుండును. — — — — — — —

చికిత్స— ఔషధసాధ్యము గాదు అయితే దానంతటది నివారణలోకి వచ్చునట్టుల సాధనము చేయవచ్చును నీరసింపచేసే సాధనము మానవలెను. నుంచిఆహారములు చే బలముపోకుండ చేయవలెను. ఇందుకు ఖనిజధృతులు లేదైన సత్తువను కలుగచేయు నౌషధములిచ్చేది రసముదివరలో ప్రయోగించుచున్నయెడల నిలుపుచేయవలెను. — — — — — —

## కాలఖండమునందు మాదు.

Hepatic Abscess (Abscess of Liver.)

ఈ కురుపులు వాటంతటవి బద్దలైపోయే మార్గములు.

౧ కురుపుకు కడుపుపక్కకు కలిసిపోయి సొల వేయును. యిలాగు పైకిబద్దలైనపుడు రోగికి నేయిబ్బందియు లేకుండును. కురుపు పెద్దదైతే మూర్ఛగాఢమై చనిపోవును. — — — — — — —

౨ కొన్నితరహాల యింప్లమేషనులో యీలాగు కలిసిపోవుటకలుగదు అప్పుడు వపహారలోకి కురుపుబద్దలై యావపయందు పెరిటొనైటిస్ యను రుగ్మతను కలుగచేయును. — — — — — — —

౩ ఒకానొకప్పుడు కురుపు జీర్ణకోశముతోగాని, కోలన్ అనే పేగులలో నొక భాగముతోగాని, పైత్య నాళముతోగాని యంటుకొని పగిలి-విరోచనముతో చీముపడుచుండును. ఈలాగు కలుగునపుడు బాగుపడినవారు కలరు. ... ... ... ... ...

౪ కురుపుకున్ను వక్షమును, గర్భమును, ప్రత్యేకించెడు మాంసముకున్న (Diaphragm) ఊపిరితిత్తులకున్ను మధ్యనంటు సంబంధము కలిగినపుడు చీము శ్వాసనాళముగుండా పైకుమ్మివేయబడును. ఇటులకలుగనేని హాని కలుగచేయుచున్నది, ... ... ...

చికిత్స— పైనికాపడము, పోల్టిసులు కట్టుట లోపున యోగం నెం 106- 114- 128 యిచ్చేది యిందు వకయంత్రములో చీముతీసి వేయుట శస్త్ర చికిత్స ముఖ్యములు. ... ... ... ...

## జాండిస్ అనగా పచ్చకామిల

Jaundice.

గుణములు— ముఖ్యమైన గుణములు, శరీరము, నేత్రము, మూత్రము, పచ్చగానుండును, విరోచనము తెల్లగాగాని, నల్లగాగాని, యుండును, బలహీనత, విదాహము కలిగియుండును. జీర్ణస్థానములు కూడా సంబంధమైన బాధనొందును. కడుపునందు ఆకలిలేమి, వాంతి కొలుపులు, కలిగియుం

దును పుచ్చుకొన్నట్టి స్వల్ప ఆహారమైనను బాగా జీర్ణము కాకుండ వి రోచనముగును. విరోచనబద్ధముగాని, విరోచనములుగాని, కలిగియుండు ను శరీరములో నీరోగము కలుగజేయు కారణమును తొలగించిన పిదప చాలా కాలము శరీరమునందు పచ్చదనముండిననూ సాధారణముగా నౌ షధ సాధనము లేకుండ నివారణగును. ... ... ...

చురుకు లేమి, నోటియందు చేదు, కడుపులో తెమలుచుట, చెమ టయు, ఉమ్మిన్ని పచ్చగానుండుట, చూపు పచ్చగానుండుట, నాడి నింపా దిగాను, కుడిప్రక్కలోనొప్పి విస్తారముగానుండునపుడు చెపలముగాను, ఘట్టిగానుండును, రక్తము నోటివెంట విరోచనము ద్వారా నొకప్పుడు ప దును.

హేతువులు—ఇవి రెండు విధములు.

ఇందు మొదటి విధము పైత్యపు రాళ్లవల్లనుగాని, పేగు నింపుగా వుండుటచేతగాని, దగ్గిరనుండు నితరావయవములు పెద్దలగుట వలనగా ని, కలుగును. ... ... ... ... ...

రెండవ విధము—పిత్తనాళమందు నలుపుగాని, యింప్లమేషను గాని, పుట్టుటచేతను- పైత్యము చిక్కబడుట వల్లనను కలుగును. ...

పైత్యపురాలు— (Gall stones.) ఇవి చిక్కబడిన పైత్యము వలన చేయబడి పండుటాకు వర్ణము కలిగి సర్వాణా- అణవబడుటచే అనేకప్రక్కలు కలదై తరుచుగా సోగురితనముగానుండు వారియందు కలుగుచున్నదై పిత్తకోశమునందు పుట్టుచున్నది. సాధారణముగానుండు పిత్తరాయి ఒక గోధుమల మొత్తు కలిగియుండును. ... ... ...

రెండు తులములు భారము కలరాలు నూకలవు. చిన్నరాలుగా నున్నచో నేని కొంతకాలమై పిమ్మట విశేషనొప్పిని కలుగచేయక పొట్టదిగువ నుండు పేగులోకి పైత్యనాళముగుండా జారిపోవును. ఈ రాయి పెద్దది గా నుండి నేని విశేషముగాయు నొప్పిన్ని కలుగజేయును. ఈ నొప్పియుండి యుండి వచ్చుచుండును. అప్పుడు రోగి సొమ్మసిలిపోవును. కొన్నిచోట్ల, వైను అమోనియా పారించి, నల్లమందు వగైరాలిచ్చవలసివచ్చును. ఈలాగువచ్చి న నొప్పి ౭ లేక ౮ ఘంటలు బాధపెట్టి- పేగులోనికి రాయిపడిపో వేగ మే నొప్పి నొంతించును. విశేష పెద్దరాలు పుట్టినపుడు పైత్యకోశమునకున్న

పేగులల్లోనొక భాగమునకుగాని కడుపుప్రక్కలకుగాని మధ్య నొరుపుకలుగచేసి అందువలనకురుపై ఆ కురుపు వెంబడిని పడును- మీదిపేగునందు కఫము నిండుటచేగాని పేగులయందు పుట్టునట్టియొక విధమైన పదార్థముచే నింపబడిగాని ఈ కామరలను కలుగచేయును- ఈ విధము చిన్నపిల్లలకు కలుగును. ఈరోగము విరోచనములకు సాధనము చేయుటచే కుదురును. దీనికే పయిత్యపు బల్లయని తెనుగున పేరు.

సమీపమందుండు భాగములు పెరిగి పైత్యనాళమునణుచుటచే పైత్యప్రవాహమున కడ్డైయందువలన నీవ్యాధికలుగునపుడు అసాధ్యము విశేషముగా సారాయితాగువారలయందు పైత్యము వికారమై పైత్యనాళమున ప్రవహించ నేరక యీ యామయమున్ను పుట్టించుచున్నది.

నిదానించుట— దేహముపచ్చగానుండుట, విరోచనమునందు పైత్యము లేకుండుట, కన్నులువగైరాలు పచ్చగా నుండుటచే సులభముగాపోల్చతగును సాధ్యాసాధ్యము- పురాణహితపటయిటస్‌తో గాని ఒడలువాపుతో గుండెకాయయందు రోగముతో గాని చేరియున్నయెడల నసాధ్యముగా నెంచవలెను చికిత్స- హేతువునుపట్టి చికిత్స చేయనగును.

పిత్తరాళచేకలుగునపుడు నొప్పినుపశమనజేయుటకు నల్లమందు సంబంధమైనమందులు, నీటికాపడము, వేడినీళ్లస్నానము, బాగా విరోచనములకు సాధనముచేయవలసి యుండుచున్నది. కొందరికి వాంతి చేయించుటచే సౌఖ్యముకలుగును మందిభోజనము, తగినట్టు పనిచేయుట, ఖులాసానుకలుగచేసెడు వారియొక్కగోష్టి అప్పుడప్పుడు ఝూడించి విరోచనములగునటుల సాధనమున్ను బలమును కలుగజేసి జీర్ణముచేసెడి నౌషధములివ్వవలెను పైత్యముచెడుటచే కలుగు కామలయందు, ఉప్పును, సబ్బు, టెరాక్సికం, శంఖద్రావకము, శంఖమహాద్రావకము, రసమువగైరా లివ్వనగును. F నెం. ౧౧౭- రూ- ౨౨- ౫రూ యిచ్చేది.

| | | | |
|---|---|---|---|
| నవాసారము- — | ౨౦ గ్రే. | — | — |
| ఎక్ట్రాక్టుటెరాక్సిసై. | ౩౦ గ్రే॥ | — | — |
| కర్పూరపునీరు. | ౧ ఔన్సు.— | — | — |

కలిపి రోజుకు 3 పర్యాయములు లివ్వనగును. ఇది కాలేజమును దక్షత తుచును. — — — — —

వాంతి చేయించిన పిదప ౧౦ గ్రేనుల రసభస్మమిచ్చి అటుపిమ్మట ౨ ఘంటలకు ౧ ఔన్సు తెల్లాముదము యిచ్చేది. రోగము బలిష్టముగా నుండునపుడు వాంతికిచ్చి అటుపైని. F నెం ౫౮ యిచ్చేది.

విరోచనబద్ధము గాకుండ నెం ౨౨ నిచ్చుచుండవలెను.—

Hepatalgia. పైత్యశూల కుడి ప్రక్కను కలిగెడి నరసంబంధమైన నొప్పి సాధారణముగా పచ్చకామిర్లతో చేరి యుండుచున్నది. పైత్యకోశము మిక్కిలి నిండుగా పైత్యము చేరియుండుట చేతగాని కాలఖండము పనిజేయకుండుట వలనగాని రోగము కలుగుచున్నది. ఇది యింప్లమేషను తో కలుగనటిగాదు. దీనివలన తత్కాలము బాధపొంద నేరదు- తరుచుగా, క్రమముగా బహిష్టు గాని స్త్రీల యందున్ను, సోమారుల యందు సంభవించకలుగును.— — — — —

సాధ్యాసాధ్యము ఎంతమాత్రము హానికలుగజేయదు. చికిత్సాక్రమముగా పనిచేయుట, కాకచేయునట్టి లేపులుపైని వేయవలెను. నొప్పినిపోగొట్టుటకు నిద్రను కలుగజేయుటకున్ను- మైకమును కలుగజేయు నౌషధము లివ్వవలెను- నల్లమందు కాయల కషాయముతో కాపేది, స్థలమును మార్చవలెను. F నెం॥ ౪, ౨౨, ౨౫, ౪౫, ౧౫- ఇచ్చేది. వేడినీటితో కాపేది.

---

టార్పిడ్ లివ్వర్ అనగా Torpid Liver.

పిత్తరోగము కాలఖండస్తంభని. పైత్యరోగము — — —

గుణములు—విరోచన బద్ధము, తెల్లనైగాని, బురద రంగు గాని విరోచనము, విశేషనిరసము, అన్నహితవు లేకుండుట, విశేష దాహము, తలనొప్పి, తలతిప్పు, వికారము, శరీరమందక్కడక్కడ శెగగడ్డలు పుట్టుటకలిగియుండును. శరీరమందు మరదుండును. — — —

చికిత్స—లక్షణము చేయని రసమందులు, స్వల్పముగాను, నెమ్మదిగాను విరోచనములు, జేయుమందులున్ను, మంచి సత్వమైనతిండి- పనిపాటు చేయించుట అనగుట మంచిపని యుక్త తగి లేటట్లు చేయుట సాధనము

గానున్నవి- పాడాఖిల మీవ్యాధియందు బాగా నుపయోగించును, రా ప్రపరుండునపుడు రసలేహము చేదిపుచ్చ కాయ లేహము కలిపిచెసినమాత్రలు F నెం॥ ౧౨౦ వేసుకుని యందయందు స్వల్పముగా చెను, వుప్పునాముఖ కషాయముతో నివ్వవలెను కంపౌండనూ బర్వాయ్ను, క్రమమైశైసాధనము- — — — — —

## ప్లీహారోగములు. Spleen Diseases.

ఈ యవయవము రోగముచెత పీడింపబడునపుడు శరీరమందుండు మార్గముల వెంబడి రక్తము కారును. ముగము పాలియుండును- పెదవులు కమలియుండును. ఈ రోగములు తరుచుగా మన్యపుజ్వరము పైత్యజ్వరములో జేరియుండును.— — — — — —

ప్లీహానుతిరుగు యింప్లమేషన్.— — — — — —

### ప్లీహమేహము అక్యూటు స్ప్లినైటిస్. Acute Spleenitis.

ఇది తరుచుగా కలుగురోగము కాదు. ప్లీహానుకప్పెవవ యందింప్లమేషను కలుగుచున్నది. పెరిటొనైటిస్ అనురోగమునుంచి భేదించుటకే క్లమ దీనియందు గుణములు, చికిత్స— పెరిటోనైటిస్ అన్న వ్యాధియందువలెనుండును. నెం ౧౬ ఇచ్చెది.— — — — —

### కంజిషన్ ఆఫ్ స్ప్లీన్. Congestion of Spleen.

ఆహికజ్వరము వలనగాని, సీతపైత్యజ్వరము వలనగాని, తరుచుగా రక్తపుర్తూరితము చె నుబ్బబడి యందు పురాణయింప్లమేషను యీరోగము ననుసరించి యుండును. ఈ దేశమందిదితరుచు. — — —

గుణములు— ఎడమడొక్కలో నొప్పి,ఎడమప్రక్కపరుండుటకనవకాశము చాలామందిలో నొక్కితే నొప్పితప్ప దానంతటది నొప్పిపెట్టదు నాడియందుమందత, షిరోవసబద్ధము, ఒకానొకరియందు పైత్యశూలతో కలసియుండును. ఈ స్థితిలో ప్లీహముండునపుడు చికిత్సను నిరాకరించినా పలుమారీలాగు నుబ్బి సర్వదా ప్లీహ పెరిగి యుండును. దీనికే జ్వర బిల్లని పాడుకొనియెదరు. — — — —

చికిత్స— సుగంధద్రవ్యసేవనమును విరోచనసాధనము చాలారోజులి వ్వవలెను. బలమును వృద్ధిపొందింప చేయునట్టి మందులు, ఇందు ఇనుముతో జేయబడుమందులు ముఖ్యము నొక్కితే డొక్కలోనొప్పి యున్నపుడు జలగలనుపట్టించుటచే నుపశమింప చేయవచ్చును రససంబంధ మెంతమాత్రముకూడదు. రసమిచ్చుటచే మనిషిని నీరసింప చేసి తొందర కలుగ చేయును నోరు పట్టుటకిచ్చునెడల దంతములయొక్క చిగుళ్లు పెదవులున్నోరున్నకుళ్లును. మెష్టరు ట్సెనింగ్సుదొరవారి యౌషధమిందువిశేషకార్యకారిగానున్నది. ఈమందు చేయుక్రమము. — — — — —

| | |
|---|---|
| జాలపు. | ౧ డ్రా |
| రేవలచిన్ని. | ౧ డ్రా |
| కలంబా. | ౧ డ్రా |
| శొంఠి. | ౧ డ్రా |
| బైటార్ట్రేటుపొటాష్. | ౧ డ్రా |
| అన్నభేది. | ౧౦ గ్రే |
| పెప్పరుమెంటునీరు. | ౬ ఔన్సు |
| సునాముఖిఆకు. | ౪ డ్రా |

కలిపి మోతాదుకు ౧ ఔన్సుచొ॥ ఉదయసాయంకాలముల నివ్వవలెను అగత్యమునుపట్టి హెచ్చుతగ్గులు ఆలోచించేది. — —

(Hypertrophy of spleen.) హైపార్ట్రఫీఆఫ్స్ప్లీన్ అనగా జ్వరబల్ల, ప్లీహోదరం పైనిచెప్పిన కంజెషన్ను, అలక్ష్యపెట్టుటచే కలుగును తరుచుగా పెద్దదిగా, పెరుగుచున్నది. నాభిస్థానము దిగువవరకేబల్ల యొక్క నొకనియందు వ్యాపించును బలహీనతతో సంబంధించి యుండుచున్నది. కావున దుష్టుకురుపులు కాళ్లమీదపుట్టును పలుమారు విరోచనమగుచుండును. శరీరము శుష్కించకపోయినను సిరసము విస్తారముగానుండును. పెదవులు రక్తలేమిచే పాలియుండును రక్తశ్రావము నోటవెంబడి, ముక్కువెంబడి, జీర్ణకోశమునుండి కలుగుచుండును. — — —

ఎడమప్రక్క కొంచమునొప్పి, యూపిరిబాగాతీయుట కిబ్బంది పొడిదగ్గు కుడివైపు పరుండుటకనవకాశము పాండువకూడా కలిగియుండును.

ద్వంద సంబంధము— పైత్యగుండెరోగము, రక్తశోషము రక్తవిరోచనములు, స్కర్వీఅనురోగము, పాండువ, ఈ వ్యాధితో సంబంధించియుండును. — — — — —

హేతువులు— చలిజ్వరముచే చాలాకాలము బాధనొందుట, కాలఖండామయముచే రక్తప్రవాహము నష్టుకొనుట, సన్నిపాతజ్వరము.

నిరూపణ— ఎడమప్రక్క బల్లయుండుటచేతను కొలగానుండి కనుపుట కవకాశమయ్యెండు, అదివరలో రోగినున్యపుజ్వరమునే బాధనొందియుండుట, సులభముగా నీరోగమును కనుకొననగును.

చికిత్స— పొటాసీఐడక్ గాని, పొటాసీబ్రోమైడుగాని, 3 గ్రేనులు మోతాదుచొప్పున బలముకలుగజేయు మందులతో రోజుకు మూడుపర్యాయములివ్వవలెను. పైని ఐడను వాడుక జేయవచ్చును. బిన్నయిడైడు పలాస్త్రీపైని లేపుజేయించవచ్చును. రక్తగుణమును మార్చెడి, సులభముగా, స్వల్పముగా విరోచనములను జేయుమందులును, వాడుక జేయనగును. పూర్వము జ్వరముకలిగియుండెనేని, బార్క్ గాని, క్వైన్ గాని, యివ్వవలెను. F నెం ౪౦ - ౯౫ యిచ్చేది.

---

(పేన్క్రియాటిక్ రోగములు.) (క్లోమాజీర్ణము.)

గుణములు— ఈ అవయవము రోగముచే బాధనొందునపుడు భుజించునట్టి వస్తువులయందుండు చమురుపదార్థములు కొవ్వుపదార్థములు జీర్ణములుకానేరక విరోచనముతో పోవుచుండును. బొరకువిగువను నాభికిమీదుగాను నొప్పి కలిగియుండును. ఒకరింపు, వాంతి, శరీరమెండిపోవుట, వీటికి తోడుగా విరోచనబద్ధము, లేక విరోచనములు, విస్తారవుష్ణి, పచ్చకామెరల కలిగియుండును.

నిధానించుట— ఈ యవయవమంత బాధపడుచున్నపుడు, విరోచనమందు కొవ్వుకలిగి యుండును. — — — — — — —

చికిత్స— రోగమందు పుట్టునట్టి గుణములకు సాధనము జేయుచుండవలెను. కొవ్వువస్తువులు, చమురున్న ఆహారమునుండి విసర్జించవలెను. పేన్క్రియాటీన్ గాని మాల్టుపేన్క్రియాటీన్ గాని యిచ్చేది. — —

## —*) హీమటెమిసిస్ అనగా రక్తము కక్కుట. (*—

గుణములు— గర్భమున్కులో నాభికి మీదుగా బరువుగా భరాకలిగియుండును. ముఖవర్చస్సు వాడియుండును. కళ్లుపచ్చగానుండును. కడుపునొప్పి, విరోచనబద్ధము, నల్లనిరక్తము వాంతిజేయుట, దానితో సొమ్మసిలిపోవుటగాని, నీరసముగా నుండుటగాని కలుగును. ఒకానొకనియందు తలనొప్పి, సూక్ష్మనాడి, దగ్గు, ఊపిరి తిరుగకపోవుట కలిగియుండును. వాంతిజేసిన రక్తము జీర్ణకోశమునందు పదార్థముతో మేళనైయుండును. ఈ రోగము సన్నిపాతములు కలిగెడి రోగమువల్లనుగాని, జీర్ణకోశము లేక పేగులయొక్క లోపలిపొర యింఫ్లమేషను కలిగియుండుటచెగాని స్త్రీలయందు ముట్లుకాకుండునపుడుగాని కాలఖండ ప్లీహవ్యాధుల వల్లనుగాని కలుగుచున్నది. — — — — — —

నిధానించుట—పద్దరక్తము విస్తారముగుటచె నదినల్లగానుండుటచె హారముతోను, జీర్ణమునుజేసెడు, గేస్ట్రిక్ జ్యూసు అనునుటతో గలసియుండుటచే రక్తముశ్వాసకోశమునుండి వచ్చుటలేదని తెలియును. సాధ్యాసాధ్యము సన్నిపాతగుణములను పుట్టించు రోగములతో కలుగునపుడ సాధ్యము బల్లలువగైరా యితరావయవరోగము వలన గలుగునపుడు, తొందరను, నిరసనమును, కలుగజేసినను హానిని కలుగజేయదు. — — —

హేతువులు—అక్రమప్రవర్తన, జీర్ణకోశమున రక్తనాడి బద్దలగుట కురుపు గలుగుట, స్త్రీలయందు తరుచు, దెబ్బలువగైరా పయినితగులుట భోజనమునందు క్రమము లేకపోవుట. — — — — — —

చికిత్స—జలగలను గర్భముమీద పట్టించుట, స్వల్పవిరోచన సాధనములు, రక్తగుణములు మార్చేరసములు, సులభముగా జీర్ణమగు నద్భుజ్య పదార్థములు పథ్యము చల్లనయిన పుల్లనయిన దాహము, సత్తువను కలుగజేయు మందులు, క్వయినను, ఖనిజద్రవ్యములు నిచ్చేది. ముట్లుతప్పుటచె కలుగునపుడు ముట్లగునట్లు ముందు చికిత్సజేయువలెను. పటికయిందు ముఖ్యముగా నుపయోగించును. మంచుగెడ్డ మింగించుటవల్లను గాని కడుపుమీద కట్టుటచెగాని గుణమిచ్చును. F నెం ౧౧ ౧౧ యిచ్చేది. రక్తంకట్టన పిమ్మట రసలేహ్యము 3 గేనులు రాత్రియిచ్చి యుదయము

నాదు వుష్పముచే విరోచనములు రెండుమూడు చేయించవలెను. మూలవ్యాధియందు రక్తము స్రవించుట, మొల్లు పెరుగుట, గలుగునపుడు జలగలు అపానద్వారములకు పట్టించవలెను- — — — — —

---

## Piles. మూలవ్యాధి.

రక్తముకలిగియుండు చిన్నపిలకలు పేగుయొక్క అధోభాగమందు కలుగునపుడు మూలవ్యాధి యనబడును. ఇందుకొన్ని రక్తము స్రవించును గొన్ని రక్తము స్రవించకుండును. ఇది రెండు విధములు, లోపలపిలకలు, పైపిలకలని. — — — — — — — — — —

గుణములు— అపానముదగ్గిర వేడిమిన్ని, నొప్పి కలిగియుండును. నడుమున నొప్పి కలిగియుండును తలనొప్పి, తలతిరుగుట, కడుపుపొంగు, కాక, విశేషరంగు గలిగి స్వల్పముగా మూత్రము తరుచుగా మూత్రము పురీషోత్సర్జనముచేయుట కిచ్ఛగలిగియుండుట ఒక్కొక్కవేళ నీ పిలకలు కురుపులై విశేషనొప్పిని కలుగచేయును, నడుపకుండ నుండి రక్తము స్రవించుచున్నెడల రోగికిచాలా విచారమునన్ను కలిగి యుండును. ఈలాగు రక్తముపోవుటచే దేహదార్ఢ్యమంతకంత కృశించును. — —

నిధానించుట— తనిఖీ జేయుటచే నితరవ్యాధులనుండి గ్రహించవచ్చును. ఇది హానికలుగజేయునదికాదు.— — — —

హేతువులు— సోమరితనముగా సర్వదాయేదైనా కూర్చుండుటచే విరోచనబద్ధము, రక్తముచే, విశేషముగా పూర్ణించి దేహముండుటచేత, పాటిగా దేహమునుంచి పయికి విడువబడు సమస్తశ్రావములలో నేదైనా కట్టబడుటచేత మసాంబరము కలిపినట్టి విరోచన సాధనములు తరుచుగా నమ్ముటచేతగాని అపాయువు నంటియుండు పేగునందుశుభ్రి రక్తనాడులమీదను కాయలు వగైరాలుగాని, గర్భాశయము పిండముతో నున్నపుడు నొక్కుటచేతగాని, ఈరోగము కలుగుచున్నది.— — —

చికిత్స— గంధకపు లేహము, సునాముఖి లేహము, ద్రాక్షయుక్తము, గంధక భస్మము, మొదలగునవి యివ్వవలెను. పిలకలు శుభ్రముగా రెండుపూటలను కడిగి మహాఫలపు కాయ పలాస తీగెలో నల్లకుంకుమ కలిపి లేపు

చెయ్యవలెను, చాలాదినములనుంచి బాధపెడుతున్న యిడులను వాటినికోసివేయుట గొప్పసాధనములో పిలక కరిగి సాధనముచేయుట సులభము గాదు పిలకలకు తాడు బిగించుట మోట సాధనము గనుక కత్తివాడుక మాదవలెను హేలిబోరు పలా(స్త్రీ) పయిని వాడుక చేయుటచె కొందరికి నివారణ కగుచున్నది. F నెం॥ ౨౨- ౩౦ ఇచ్చేది. — —

---

## —*)డిస్పెప్సియా అనగా అజీర్ణశూల.(*—

Dyspepsia.

**గుణములు**—ఆకలిలేకుండుట, తేములుట, కడుపుపొంగు, కడుపులో నాభికి మీదభాగమందు నొప్పి, నింపుగానుండుట, భోజనముజేయుటచె తతగ్గుటయు, హెచ్చుటయును కూడా కలదై కడుపులోమంట, విరోచన బద్ధం, విరోచనములు, చాతీలోను, తలయందునొప్పి, అశుభ్రముగానుండు నాలుక, నోటియందరుచి నిస్సత్తువ బలహీనత, శరీరము శుష్కించుట,కలిగి వుండును. తేమల్చినపుడు వాయువుగాని నీళ్ళుగాని అన్నముగాని, గొంతుకలోనికి వచ్చును. తేనుపొచ్చిన వాయువు వాసనలేకుండాగాని కుళ్ళుచేపలకంపుగాని, కుళ్ళినగ్రుడ్డు వాసనగాని కలిగియుండును. నోటిలోకి తేమల్చిననీరు చప్పగాగాని, పుల్లగాగాని, చేదుగాగాని, వుండును పులుపు అన్నము పులియుటచేతను- చేదు పయిత్త్యముచేత కలుగును.

**హేతువులు**—బలహీనత, పనిజేయకుండ భోజనము జేసి యొకచోట కూర్చుండుట, విచారము, భయము, పలుమారు భుజించుట విస్తారముగా తినుట భుజించువస్తువు జీర్ణముకవకాశముగాకపోవుట, బాగా నమలకుండ మింగుట, వేడిగానుండు ద్రవపదార్థములు- విస్తారముగా త్రాగుట, నిషాను,కలుగజేసే సారాయిలు, తప్పుగావుచ్చుకొనుట, నల్లమందు తినుట, పొగాకుత్రాగుట, విరోచనములకు తరుచుగా సాధనములు జేసుకొనుట ఈ రోగమును పుట్టించును.

**నిధానించుట**—జీర్ణకోశము నొక్కితే నొప్పి లేకుండుటచేతనున్ను భోజనముజేయుటచె నొప్పి సాధారణముగా హెచ్చుగాకపోవుటచేతను గేస్ట్రయిటిస్ యను రోగమునుంచి దీనిని గనుగొనవచ్చును.

## జీర్ణాశయశూల (Gastrodynia)

గుణములు— జీర్ణకోశమునందు ప్రబలమైననొప్పి, యొండియొండి వచ్చుచుండును. తరుచుగా గర్భమందాహారములేనపుడు గలుగును ఒకా నొకపుడు వాంతులగుచుండును విరోచనములు, అజీర్ణము చేసిన భో జనము చేయుటచేగాని, ఘట్టిగా నొక్కుటచేగాని, నొప్పిశమించును. నా డితరుచుగా భేదించును నాలుక పలువిధములుగానుండును — — —

నిర్ధారించుట— అణచుటచే నొప్పిశాంతించుటచే జీర్ణకోశములోని యొరుపు నుండి ప్రత్యేకింపనగును. — — — — —

హేతువు— అజీర్ణశూలను పుట్టించు కారణములే కలిగి ఈరోగము తరుచుగా అజీర్ణశూలలో సంబంధముగానుండును. — — —

చికిత్స— శరీరబలము నభివృద్ధిచేయు మందులచే సాధనముజరిగించవ లెను హైడ్రోసైనికేసిడ్ బిస్మిత్ట్రైయాసోటు, వెండికాస్టికుసల్ఫేటుఆఫ్ జింకు, మోర్ఫియా, వీనివలన నివారణమగుచున్నది. పథ్యము లఘువుగా జీర్ణమయ్యేడి బలమిచ్చేడునదిగా నుండవలెను. F నెం॥ ౧౭

విశేషబలముగా రోగములేనపుడు కంపౌండు రూబర్బుమాత్ర స్వల్ప మోతాదుగా॥ భోజనానంతరమున మధ్యాహ్నమిచ్చుచుండవలెను. జెన్ష ను, కలంబా, సింకోనా, కేస్కారిలా, ఇవిదేహస్థితి తెలుసుకొని దానిక నుగుణ్యమైన విధమున నౌషధ మేళనము చేయవలెను. — — —

F నెం॥ ౩౦ చే వాంతికట్టును తరుణములో వాంతికిచ్చి ముసాంబరమి శ్రమముగు విరోచనసాధనములు చేయుటచే రోగము నివారణమగును.

---

## (Diarrhea) విరోచనములు.

తరుచుగా పచ్చగాగాని నీళ్లవలెగాని విరోచనములగునపుడు విరోచ నజాడ్యమని పేరు. — — — — —

గుణములు— తరుచుగా విరోచనములగుట, విరోచనమగుటకుముందు గ ర్భమందుబరువు పీకును. ఒకానొకపుడు చీముపడుట కలిగియుండును అ ప్పటిలో విశేషనీరసముగానుండును. కడుపుపొంగును, కడుపునొప్పి,

టచే విస్తరించును. నాలుక తెల్లగాగాని, గోధుమ రంగుగాగాని, ండును. నాడి దుర్బలముగానుండును. చాలా కాలమువరకు విరోచనలు విడువనియడల దేహముకృశించును. ... —

నిర్ధారించుట— ఉష్ణము, విరోచనమునందు రక్తము లేకుండుటచే ర విరోచనములనుండి పోల్చనగును. — —

సాధ్యాసాధ్యము— వృద్ధులకున్ను పురాణించిన పిమ్మటయున్ను హాని తరుచుగా కలుగజేయును. — —

హేతువులు— అజీర్ణ పదార్థములను గాని, పండని పండ్లను గాని, పండ్లను విస్తారముగా గాని, కుళ్లుచున్న లేక కుళ్లిన మాంసమును గాని భుజించుట, చలిగాలి, చమట, యణిగిపోవుట, పేగులయందు పురుగులుండుట, విస్తారముగా విరోచనమును సాధనము చేయుట, కారణములుగానున్నవి.

చికిత్స— తిరుణమందు గ్రిగరిసు పౌడరు గాని, తెల్లాముదము గాని యిచ్చి భోజనమునందు విరోచనములను కలుగజేయు వస్తువులను విసర్జించవలెను. విరోచనములు చాలా కాలము నిలిచినపుడు డోవర్సుపౌడరు, గ్రెపౌడరు, స్వల్పమోతాదులుగా నివ్వవలెను. నల్లమందు సహితముగా గాని లేకుండా గాని కంపౌండు చాకుపవుడరు విశేష కార్యకారియగును. చీము మిశ్రముగా విరోచనములగునపుడు పైని చెప్పిన మందులతో యిపికాకు కలిపి యిచ్చునది. పురాణించిన సల్ఫేటు ఆఫ్ జింకు గాని, మైలతుత్తము గాని వెండికాష్టికు గాని నల్లమందుతో కలిపి యిచ్చుటచే గుణమిచ్చును. విరోచనమందు పులుపు వాసనయుంటే F నెం ౪౭ రు యిచ్చేది- ఈమందు చిన్నపిల్లలకును యివ్వవచ్చును- చీము కలసియుంటె F నెం ౩౨ రు యిచ్చేది గర్భిణీస్త్రీలకు నెం ౪౭ రు యిచ్చేది- ప్రసూతి ఐనవార్లకు F నెం ౧౨౯ యిచ్చేది- విరోచనము తెల్లగానుంటె F నెం॥ ౧౯ రు యిచ్చేది- నొక్కితే నొప్పికలిగియుండునపుడు జలగలుపట్టించి కాపడమివ్వవలెను. క్షయ మొదలగు రోగములందు కలుగు విరోచనములందు సీసమున్నముతో చేసినట్టి పైనోతో చేసినట్టి యౌషధములున్ను ఖనిజధృతులున్ను, బారకున్ను, మొదలగునవి వాడుక చేయనగును. ఈ రోగమునందీదిగువ మదహరించి

యు వెక్కిళ్ళు కడుపు ఆధ్మానించుట. నీరుడి బంధించుట అసాధ్యగుణ ములు- కాలము మళ్ళినవారు బాగుబడుటకష్టదిత్తు ... ... ...

చికిత్స— ఇందుముఖ్యముగా బలమును భద్రపరచవలెను కాక ను పుట్టించుట, జవసుకలుగజేయుట, ఈవిషమునకు సాధనములు, బ్రాంది క్లోరిఫారం పనిచుకిలు మో తాదుచొ॥ క్లోరేటుపొటాస్, మొదలగునవి యివ్వనగును. ఔషధమువలన గుణముకలుగనపుడు శుభ్రమైనచన్నీళ్లవలన చాలామందికికుదిరెను వాతగతిపోయినతరువాత నుండు గుణములనుపట్టి చికిత్సచేయవలెను. కడపటవచ్చుజ్వరము నివారణకు విశేషము గా చలవసాధనములుచేయకూడదు జలగలుపట్టించుటచేత గాజుసోలకాక వేయుటచేత పొక్కుపలాస్త్రిలు వేయుటచేత లోకాక నివారణచేయవచ్చును. ఈరెండవజ్వరమునందున్న రోగమునివారణమైన కొంతకాలమువరకున్ను సులభముగా జీర్ణమగునట్టి, బలమునిచ్చునట్టి, కాకజేయునట్టి, పథ్యమిచ్చుచుండవలెను. — — ... — —

ఈ రోగమందు కలుగు విరోచనము, వాంతి, వెంటనే దూరమున పాతిపెట్టించవలెను. అట్లాగనవకాశమగునెడల సున్నము విరోచనములు వాంతియుండు పాత్రలో వేయించవలెను. — — —

బట్టలు మలినములైనపుడు వాటిని సాధ్యమైనంతమట్టుకు తగలపెట్టుటమంచిది. ఈవిశూచియందీడిగువ నుదహరించిన సాధనములుజేయుదురు- డాక్టర్ స్టీవర్ దొరవారివలన ప్రచారము జేయబడినమందు.— —

ఉప్పు. — — — ౨౦ గ్రే

క్లోరేటుఆఫ్ పొటాషి. ౭ గ్రే

కార్బొనేటుసోడా. ౩౦ గ్రే — — —

నీళ్లు. — . — ౧ సరబౌ — — — —

కలిపి అరఘంట కరఘంటకిచ్చునది నోటివెంబడినిచ్చుటకసాధ్యమగునపుడు అధోమార్గముగుండా పిచ్చుకారీజేయవలెను. క్లోరిడీను మోతాదుచొప్పుననిచ్చునెడల మంచి గుణమిచ్చును డైల్యూటు ఆసిటుకేసిడు ౩౦, చుక్కలు మోతాదున నీరుకలిపి ప్రతిఘంటకిచ్చుటచె నివారణగును

పాల్వేషము. — — — ॥ అర గ్రేను. —

ఆరతీకర్పూరము. — — ౧ గ్రే — — —

నల్లమందు. — — — ॥ అర గ్రే — —

ప్లంబైఎసిటస్. — — ౨ గ్రే — — —

కలిపి మాత్రజేసి ఘంటఘంటకిచ్చుటచే మంచి గుణమిచ్చును. ఈ మాత్రకు ౧నర గ్రే మిరపకాయలగుండ జేర్చుట కార్యకారిగా నేయుంటున్నది. — — — —

(డాక్టర్, చూపరుఫీల్డు దొరవారివలన నివ్వబడుమందు.)

సముద్రపు ఉప్పు. — ౩౦ గ్రే

కార్బొనేటుసోడా.- ౨౦ గ్రే

పొటాసీబైకార్బొనేస్. ౧౦ — — —

పొటాసీక్లోరేటస్. ౧౦ — — — — —

సోడాఫాస్ఫేటస్.— ౧౫ — — — — —

హైడరుసోడిక్లోరేటస్. ౨౦ మి ... ... ... ...

మంచినీళ్లు. ... .. ౨ ఔ. ... ... ...

కలిపి ప్రతిఅరఘంటకు యెనిమిది మోతాదు లిచ్చేది.

ఈ కూడిక రక్తమునందుండు ప్పుల కూడికకు సమముగానున్నది. ఆరతీకర్పూరము బహు శ్రేష్టమైనమందుగా నెంచబడును. డాక్టరు, షార్టరుదొరవారివలన గనుకొనబడిన గంధకపుపొగ బహు శ్రేష్టముగా నున్నది. కాజిపుటాయిలు, డాల్బినీఅరఖు, పెప్పరుమెంటు, బేలిగేటుకంపనీ వారి పేరక్లోరిడీనుపయోగించును నల్లమందు ప్రథమమందు విరేచనములను కట్టించుటకుమంచిగాని యటుపైని యిచ్చిన స్పృహ తప్పించి పిలచితే తెలివిరాని గాఢనిద్రలోకి తీసుకొనిపోవును. ... ...

F నెం॥ ౫౯-౮౩ యిచ్చేది. ... ...

---

## విరేచనబద్ధము (Constipation.)

గుణములు— తలనొప్పి గర్భమందు నింపుగను నొప్పిగానుండును. వమలుచుటు, వాంతి, కలిగియుండును. కోల్డ్ అనే పేరు నింపుగ నం

డుటచే పైపేగును మాంసకండ క్రిందకు దిగుటకవకాశముగాక వ్యాపిరి స్వాభావముగా రాకుండును. చాలాకాలము విరోచనబద్ధము కలుగునపుడు వాంతి, మలముయొక్క వాసనయున్న రూపముకలిగియుండును. రోగము పేగుయొక్క క్రిందిభాగములో పైభాగమునకు దిగునపుడు నివారణ జేయనియెడల మృతినికలుగజేయును. ఇందు లిన్నసకలిగియుండుటచె మూలవ్యాధి కలుగుచున్నది. ... ... ... ...

చికిత్స— హేతువునుపట్టి సాధనములుజేయవలెను పైతగుండె పనిజేయక కలుగునేని రసౌషధములు గాఢముగా విరోచనసాధనములు పేగులునులుచుకొనుటచె కలుగునేని నల్లమందు మోతాదొకటియిచ్చి ఆటుపిమ్మట నాముదమిచ్చేది భోజనమందు బహుశులభముగా జీర్ణమగు పదార్థములు పుచ్చుకొనుచుండునేని వడ్లువగైరావస్తువు లివ్వవలెను. ముసాంబరలేహము, రసలేహము గుమస్తికీనారము పదిరోజులు రాత్రిపూట పుచ్చుకొనునెడల విరోచనబద్ధము కుదురును, గుదస్థానమునంటియుండు పెద్దపేగువలన విరోచనబద్ధంకలిగి కడుపు పొంగియున్నపుడు స్టమకీ, పంపుయొక్క పెద్దగొట్టము అపానద్వారముగుండాపంపి పిచ్చికారీజేయవలెను. విరోచనబద్ధము సర్వదావున్నవారలు E నెం ౧౧౩ వాడుకజేసేది- గర్భిణీస్త్రీలకు F నెం ౨౨ యిచ్చేది- పిల్లలకు నెం ౧౧౨ యిచ్చేది- మూలవ్యాధివున్నవారలకు నెం ౨౨న్నాజ్వరాదిని నెం ౨౨న్న అజీర్ణముతో విరోచనబద్ధమున్నపుడు నెం౪౭ న్నా యిచ్చేది. ... ... ... ...

---

### ఆమశూల కడుపునొప్పి. Colic.

గుణములు— గర్భమునందు విస్తారపునొప్పికలిగి నులుచుకొనుపోవుచున్నట్లుండి యుండివచ్చుచుండును- నవీనముగాని నొప్పికలిగినేని కడుపునొక్కి పట్టుటచె శాంతించును- ... ...

విరోచనబద్ధము, ఓకరింపు, వాంతి, కడుపుపొంగు, కలిగియుండును. ఇట్లువున్నపుడు త్వరగా నౌషధముచె నివారణగును

సాధనము జేయకపోయినందున నొప్పి, విస్తారమై యొక్కచోట నేవుండి యింప్లమేషన్ కలిగి నొక్కితే నొప్పికలిగి నాడి, బలముగానుండి విశేషజ్వరము కలిగియుండును- ఇప్పటిలో యింప్లమేషన్ పోగొట్ట నెడల యంటరైటిసీయను రోగము కలిగి క్రమముగా మృతి కలుగజేయును.

---

## పైత్యశూల.

పైని చెప్పినగుణములుగాక- పైత్యమిశ్రమమును వాంతి, తలనొప్పియన్న మందసూయత, నోటియందుచేదు- జ్వరము కలిగి యుండును.

---

## సీసపుకిలుముపల్ల కలుగు కడుపునొప్పి. Lead Colic.

ఈ నొప్పి సీసపు పాత్రలు భోజనములందు వాడుకచెయువార లందు సీససంబంధమైన రంగులు వాడుకజేయువారి యందును కలుగు చున్నది. ఇందు రెండు చేతులు లేక యొక్కజేయి నీరసించుట లేకపడిపోవుటగాని కలిగి నాభియందోర్వలేని నొప్పికలిగియుండును. ఇగుళ్ళయందు నీలిరంగుగల గరుతుకలిగి యుండును. ఈరంగే యిందు ముఖ్యమైన గుణముగానున్నది. ... ... ... ...

హేతువులు—ఆమవాతశూల, చలిఫూలి, శరీరమునకు పట్టుట వల్లనున్ను, భోజనమందు క్రమము తప్పుటవల్లనున్ను, విరోచనము క్రమముగానుండకపోయినపుడు అందుకు సాధనముజేయక నూరకుండుటవల్లనున్ను పులిచినట్టివైను- మొదలగునవి త్రాగుట వల్లనున్ను కలుగుచున్నది... —*(..)*—

## పైత్యనొప్పి.

ఇది పైత్యాధికముచె కలుగును, సీస విషమువలన కలుగు శూల సీసమందుండు విషముచె గలుగును... ... ...

నిధానించుట—ఎంటరైటిస్ నుంచి నులుచుకొనే నొప్పి వల్లనున్ను ఆ నొప్పి నొక్కుటచె శాంతించుటవల్లనున్ను, జ్వరము లేకుండుటవల్లనున్ను, ప్రత్యేకించనగును. ... ... ... ...

సాధ్యాసాధ్యము—అమవాతశూల శులభసాధనముగా నున్నది. పైత్యశూల నలుకవజేసి మఱికొన్నివ్యాధులను గలుగజేయును.... ...

---

## సీస విషశూల.

విశేష శ్రమపరుచునదైనను వ్యాధికలుగజేయదు.... ... ...

చికిత్స—అనఃశూల స్వల్పముగా కాక చేయునట్టి కడుపునందుండు ఘాలిని పైకికొట్టి వేసెడు మందులుచే సాధనముంజేయవలెను. వకస్లాసు బాయింద నీళ్ళలోకలిపి జాజికాయ, శొంఠి, పొడిచేసినందున మిశ్రమము జేసి పుచ్చుకొనుటచే చాలామందికి నివారణ కలుగును. బాగా విరోచన ములు జేయించుటావశ్యకమైయున్నది. క్లోరోడీను, పేరాకిల్లును, స్పిరిట్సీ క్లోరిఫారమ్, ఇందుగుణమిచ్చును... ... ... ...

F నెం॥ ౨౨ ఇస్సి కడుపుపైని కాపడము పెట్టేది. ... ...

పైత్యశూల రసనంబంధమైన మందులవల్లను, విరోచనసాధనములవల్లను కుదురును వాంతి మొదలగునవి కలిగియుండునపుడు F నెం॥ ౩౨ ప్రయోగించవలెను. నివారణగుచున్నపుడు దేహమునకు బలము కలుగజేయుసాధనము, నప్పుడప్పుడు రసమందులు, సూక్ష్మమైన విరోచనసాధనములు, జేయుచుండవలెను .. ... ... ...

సీసవిషనొప్పి—నల్లమందు పొటాసిమ్ని నేపాళపరఖు, ఆముదము, జాలపు, సునాముఖి వీటివలన బాగా విరోచనములగునట్లుగం జేసి-యప్సంసాల్టు, పటికతో మిశ్రమము జేసి యిచ్చుటచే విరోచన మగుటయేగాక—విషమును విరుచుచున్నది. Melena అనగా. అరిశరోగము. ...

స్వరూపనిరూపణము నల్లనైయున మఱియొక రూపభేదమును బొందినట్టి రక్తము పేగులగుండా క్రిందబడునపుడు మెలీనా అనబడును.

హేతువులు—కాలఖండము, గుండె, ఊపిరితిత్తులుయందు రోగము గలుగుటచె నీవ్యాధి గలుగుచున్నది. సన్నిపాతజ్వరము, నులిగడుపు, రక్తనాడి పేగులయందు బద్దలగుట యిందుకు కారణములు. ... ...

నిదానించుట—విశేషముగానల్లని రక్తమువడుట చేతనున్ను నొప్పిమంట, లేకుండుట చేతనున్ను మూలవ్యాధి గాదని తెలియనగును. ...

**చికిత్స**—ఏయేవల్లను బుట్టునో యారోగమునకు సాధనముజేయుటచే కుదురును ఇతరమార్గము వెంబడి రక్తశ్రావము కలుగునపుడు జేయు చికిత్సయే జేయవలెను F నెం॥ ౯౦- ౯౨- ౯౨ యిచ్చేది. ...

(క్రిమి రోగము) పేగులయందుండు పురుగులు.

ఇవి మూడు నాలుగు విధములుగానున్నవి. ... ...

౧ ఏనిమిడికలు—Round Worm.

౨ నులిపురుగులు—Thread Worm.

3 టేపుపురుగు—TaPe Worm.

ఇది రెండు విధములు. వెటల్పు టేపు పురుగు, టేపుపురుగని-యీ మూడు విధములే తరుచుగా గలుగుచున్నవి- గుణములు—వీటి యన్నిటి యందు కొంచమెక్కువతక్కువగా నొక్క తరహా గుణములే గలిగియుండును. విరోచనబద్ధముగాని, కలిగియుండును. విశేషమాకలి కలిగియుండును. కడుపు పీసముక్కున పానముదురదగానుండుటచె గోకుకొనుచుండుట, వూపిరి దుర్వాసనగానుండుట, నిద్రలో పళ్ళుకొరుకుట, విస్తారముగా పురుగులు పెరిగినపుడు జ్వరము. తలనొప్పి శరీరము నులుచుకొనిపోవుట, చాలాకాలమయ్యేనేని శుష్కించుట, ఆకలిపోవుట లేక విస్తారమగుట, ఇవి గలిగి వుండును రాళ్ళు, ఇసుక, వెంట్రుకలు, సుద్ద, బూడిదె, మొదలగునవి, తినుటకు బుద్ధికలిగియుండును. ... ... ...

సాధ్యాసాధ్యము—త్వరగా చికిత్సచేసిన నెంతమాత్రమిబ్బందిని కలుగజేయవు. చిన్నపిల్లలయందు పురుగులవలన యొడలు నులుచుకపోవుట, అవయవములు లాక్కొనిపోవుట కలిగి మృతిసయితము కలుగజేయును.

హేతువులు—ఆధారహేతువులు- చిన్నతనము, దుర్బలము, జీర్ణకోశము మొదలగువాటి దుర్బలము. — — —

ఉద్రేక హేతువులు—పురుగుల యొక్క గుడ్లుభుజించు పదార్థములవల్లనుగాని, నీటివల్లనుగాని శరీరములో ప్రవేశించుటవల్లనివిగలుగును.

చికిత్స—పురుగులను పైకికొట్టివేసి జీర్ణావయముల బలమునువృద్ధిజేయవలయును. పురుగులు పోవుటకు, సెంటూనయినును, రాత్రియిచ్చియుదయము విరోచనసాధనము జేయుటచె, నులిపురుగులు, ఏనిమిడికలు, పడి

ఱకుట, కళ్లాయి దగ్గు. కొందరీ రోగము నొకవిధమైన యంతర్గత-
రముగా నెంచి మెసెండరీగ్లాండులవల్ల పెద్దవైనవనిన్ని, మఱికొందరు
సంటరీ గ్లాండులే పెద్దవై అటుపైని జ్వరము కలుగునని యూహించు
చుందురు.— — — — —

చికిత్స—సులభముగా జీర్ణమగునట్టి సత్తువను కలుగజేయుభో
జనము, అజీర్ణము, కాక చేసెడు వస్తువులు భుజించకూడదు —
తీక్షణము, చేయని రసమందులు, సత్తువును కలుగుజేయు మందుల
తో నినుము, తుత్తునాగము, క్వైనను మొదలగు వాటివలన చేయబడు
నను లివ్వవలెను కాడ్లివ్వరాయిలను చేపనమురున్ను, ఐడొయిడును,
ఔషధమివ్వవలెను. విరోచనబద్ధమునకు సూక్ష్మముగా భేదికి సాధనము
జరిగించవలెను, కడుపుమీదను కాక చేసే లేపులు నిమ్మళముగా మర్ధనా
చేయించి, ఫ్లానలుగుడ్డ చలిఘాలి తగలకుండనటుల కడుపును చుట్టవలెను.
అయుడైడు అయిరను, చేపనూనెతో నిన్ని, కడుపుమీద చేపచయుడు మర్ధ
నా చేయించవలెను. ఈ రోగము చిన్నపిల్లయందు గలుగునపుడు గాడ
దె పాలున్ను, ఉద్భిజ్య పదార్థములతో చేయబడినట్టి కొన్నివస్తువులను-
నివ్వవలెను. హైడ్రార్జిరంకంక్రిటా, డోవర్సు పొడరుతోగాని, కంపౌం
డు చాకు పవుడరుతోగాని కలిపి ప్రయోగించుటచే విశేష ప్రయోజనకారి
గానున్నది. — — — — —

పొటాసీ అయిడీను, - 3 గ్రే॥— — —

ఫెర్రైఅమోనియాసిట్రేటిసీ- ౨౦ గ్రే॥— —

నల్లమందు కాయల పానకము. ౨ డ్రా॥— —

క్వాసియా కషాయము. - 3 ఔ॥— —

కలిపి ॥ అర అవున్సు రోజుకు మూడు పర్యాయములివ్వవలెను. ఈ
మందు పిల్లలకు ప్రయోగించవలెను. F నెం॥ ౯౨ యిచ్చేది

## గురదాల రోగమనగా.

(శిలామేహశూల) నీఫ్రాల్జియా Neopralgia.

ఈ రోగము గురదాలయందు రాయిపుట్టుటచే కలుగుచున్నది-

గనుక యీ రోగమును కనుక్కొన్నపుడు రాయియున్నదని గ్రహించ వలెను.

గుణములు—అధాత్తుగా భరించలేని నొప్పి నడుములో కనబడి, పొత్తికడుపు దిగువుకు పోడుచుమండును.

ఇప్పుడు కడుపులో తిప్పు, వాంతికలిగుండును. తొడలయందు తిమ్మెర వృషణములు రెండుగాని వకటిగాని పైకి లాక్కొనిపోయి విస్తారము నొప్పికలిగియుండును. మూత్రము కొంచముగాను విస్తారము రంగు కలదిగానుండును, రక్తముకూడా మిశ్రమముగానుండును. ఈగుణములు నిముషములు మొదలుకొని ఘంటలవరకు కలిగియుండి వొకపర్యాయము అధాత్తుగా నివృత్తించును. దేహమునకు చమటకలిగియుండును. నాడిసూక్ష్మముగాను వేగముగానుండును, కొంతకాలమువరకు నీ నొప్పి శాంతించ నెడల గురదాలందు, యింప్లమేషన్ కలుగుచున్నది.

నిధానించుట—ఆ నొప్పిలనుంచి నడుమునొప్పినుంచి తొడలయందు తిమ్మెరలవల్లను వృషణములు ముడుచుకుపోవుటవల్లను గ్రహించనగును.

సాధ్యాసాధ్యము—తరుచు అసాధ్యము చికిత్స- ప్రస్తుతోపశాంతి చేయవచ్చును. గాఢముగా విరోచన సాధనములు నొప్పితీయుటకు నల్లమందుతో చేయబడు మందులు నొప్పి అధికముగానున్న జ్వరమున్నపుడున దేహముమీద జలగలను పట్టించుటగాని, కపింగను గాజు సొలకాక వేయుటచే నివారణగుచున్నది. నెం ౨౧౨ యిచ్చేది.

మూత్రగుండెయందు మేహము.

నీఫ్రయిటస్ అనగా గురదాలయందు యింప్లమేషను కలుగుట, Nephritis.

ఇది తరుణము—పురాణమని రెండువిధములు.

గుణములు—నడుములోనొక వైపుగాని, రెండువైపులుగాని, నొప్పికలిగి గజ్జలవరకు వ్యాపించియుండును. అణచుటవల్లను, దగ్గుటవల్లను, తుమ్ముటవల్లను, ఉద్రేకించును. శరీరము కదుల్చుటవల్లను నొప్పియెక్కువగును. రోగివెల్లకెతల కాళ్ళపైకి పెట్టుకొని పరుండును, వృషణములు-

ముడుచుకొని తొడలయొక్క ముందుభాగము విస్తార కలిగి యుండును. జ్వరము పూర్ణమైనట్టి త్వరగతి గలిగినట్టినాడి, నాలుకయందు విశేష మలినము, వాంతి, విరోచనబద్ధము గలిగియుండును — —

మూత్రము బహుస్వల్పముగాగాని, బొత్తిగా లేకపోవుట గాని, కలిగియుండు. విశేషనొప్పితోనున్ను, తినుకుతోనున్ను, మూత్రముచే పడబడును. మొదటరక్తమిశ్రమై వెచ్చగానుండి అటుతరువాతను మురికిగలిగి అప్పుడప్పుడు పాలిన రంగు కలిగియుండును. ఇందు ఆల్బ్యూమేన్, అనుపనత్తుమైన వస్తువకలిగి యుండును . ఇది కాచుటచే చిక్కబడును. —

భూత అర్ధమువలన నీరుడి తనిఖీచేసిన పక్షమునను రక్తముచేత గాని, చీముచేతగాని, చుట్టబడియుండు గొట్టములుకలిగి యుండును.

నిధానించుట— నడుము నొప్పినుండి భూతయర్ధము మొదలగు వాటివల్లను కనబడు రూపమునుండిన్ని తొడలందు తిమ్మిరవల్ల గజ్జలు వణుకునుండు నొప్పివల్లనున్ను, నొక్కుట మొదలైన వాటివల్లను, నొప్పి యెక్కు వగుటవల్లనున్ను, రోగమున ప్రత్యేకించనగును. — —

కురుపైనపుడు గురదాలయందు బద్ధలై మూత్రమువచ్చు మార్గము వెంబడి చీమువచ్చును. నడుములోకి గజ్జలలోకి మొనతేరినపుడా భాగములు బహునొప్పిగాను పితపితలాడుచుండును. చీముపట్టినపుడు హెక్టిక్ జ్వరము కలుగుచున్నది.— — — —

సాధ్యాసాధ్యము— నవీనరోగమందు సాధ్యము జ్వరము తగ్గుట, మూత్రము స్వాభావికము గావలసినంత పుట్టుట, శరీరసుందంతట, ఛర్మ గలిగి చమటపట్టి యుండుట, బాగుపడుటను సూచనజేసే గుణములు.—

హేతువులు—పైదెబ్బలు, విశేషముగా దేహము చాలాకాలము కష్టపడుట, విస్తారముగా గుర్రపుసవారు జేయుట, మేహవాతరోగము, మూత్రముబద్ధ మూత్రను వదిలే నాళముయొక్క యింఫ్లమేషను పైకి వ్యాపించుటవల్లనున్ను ఈ రోగము కలుగుచున్నది. ఈ రోగము నివారణలో గాని, కురుపు పుట్టించుటలోగాని కుళ్లు పోవుటలోగాని, యంత్యముగును.

చికిత్స—ఇది రెండు విధములు మొదట యింఫ్లమేషనును తగ్గించుట, తరువాత నొప్పిని శాంతింపజేయుట, జలగలను , కపింగు గ్లాసును నడు

ము మీదను పట్టించి యింప్లమేషను విస్తారముగా నుండి, రోగి విశేషబల
ముగానున్నపుడు రక్తము చేతినుంచి తీయవలెను ఆముదము విరోచనము
చేయుటకివ్వవలెను జిగురుకలిగినట్టి ద్రవపదార్థములనన్ను అవిశవిత్తులక
షాయము, బార్లీనీళ్ళు గంజి మొదలగునవి దాహమునకిచ్చేది. శరీరమున
చమట పుట్టుటకున్ను జ్వరమును తగ్గించుటకు నట్టిగుణమిచ్చెడి నౌషదము
ఆనివ్వవలెను, నొప్పి శాంతించుటకు నల్లమందుగాని నల్లమందుతో చేయ
బడు మందులుగాని యివ్వవలెను. వేడినీళ్ళస్నానము, నడుముకు వేడినీళ్ళ
కాపడము, నెమ్మదిగా పరుండబెట్టుట, ముఖ్యమైన సాధనములు తొందర
చేయు గుణములు, తగ్గినపిదప నీరుడియందు పులుపు గుణము కలిగియుం
డెనేని శరీరమునకు బలము కలుగజేయు పులుసును, విరిచెడు ఆల్కాలీసును
ను ఔషధము నివ్వనగును. ఆల్కాలీ గుణము నీరుడియందు డెనేనిఖనిజ
దృతులచె సాధనము చేయనగును పురాణమునందు నడుముకు కాపు
గుచ్చుట, కపింగను గాజు పోలగాక నల్లమందు, మందులు మొల వటకు
వేడినీళ్ళలో కూర్చుండబెట్టుట, పెరారాకషాయము, బుక్కుకషాయము
కోపేబా, టర్పెంటాయిలు స్వల్పమోతాదులివ్వవలెను. పొట్కాపరాస్ప్రి
గాని, పొట్కాటీగ సంబంధమైన మరి యేవిధమైన మందుగా నిందుకుప
యోగించునేని విపత్తుకు కారణమగును. F నెం॥ ఇచ్చేది.

---

**Ischuria.** ఇషూర్కారియా అనగా అల్పాచమానము లేకుండుట.

గుణములు—ఈ రోగము నిస్సతువతోను స్వల్పోష్ణముతోను నడు
ములోపల నొప్పికోవచ్చుచున్నది. ఒడలువాపు విశేషముగను కలిగియుం
డుట, సొమ్మసిలిపోవుచుండుట, విశ్రాంతిలేమి, ఓకరింపు, వాంతి. ఎక్కి
ళ్ళు, మూత్రము పోయుటకు అస్తమానము బుద్ధికలిగుండుట, ఈగుణము
లకు పైని, ప్రలాపము, కోమా అను తెలివిరాని గాఢనిద్రగలిగి యటుపై
ని మృతికలుగును. బాగా నిరూపించబడినట్టి యీరోగమందు మూపిరిన్ని శరీరమున్ను
రొత్తు వాసన కలిగి యుండును. నీరుడి రుచి నాలుక యందు కలిగి
యుండును... ... ... ... ...

నిధానము— పొత్తికడుపు పరీక్షించుట వల్లనున్ను, మూత్రము

తీయు గొట్టము వేయుటచేతనున్ను నడుములో విస్తారము నొప్పికలిగి-
యుండుటచేతనున్ను, జ్వరముగలిగి యుండుటచేతనున్ను మూత్రబద్ధము
నుంచి పోల్చవచ్చును. సాధ్యాసాధ్యము, బొత్తిగా నీరుడు పుట్టని యెడల అ
సాధ్యము, నీరుడు యుండుడు యూరియా అను విషము, శరీరము నెక్కు-
టవలన మూడు నాల్గు దినములలో మాంద్యము కలిగి రోగిమృతినొందును.
యేమాత్రమైన రెండుమూడు రోజులలో నీరుడున్నైన యెడల నిమ్మళించు
నని తెలంచవచ్చును. — — —

హేతువులు—ఆహారహేతువు, వృద్ధాప్యము, మేహవాతతత్వము వి
స్తారముగా సారాయి పానముజేయుట. ఉద్రేకములు- గుఱ్ఱాలయందు,
రాయిపుట్టుట విశేషచలిన, మిక్కిలిచప్పితాగుట. — —

చికిత్స— యూరియాను పైకిపోగొట్టుటకు ఒక గ్రేను, ఎలి
టేరియమ్- గాని రెండు చుక్కలు నేపాళపు చమురుగాని వెంటనేయిచ్చి
విరోచనములు విస్తారముగా చేయించవలయును. మూత్రపిండె పని చే
యునట్లు - 1/30 గ్రేను స్ట్రిక్నియాను చనుకాము వెంబడి [illegible] జే
యావలెను, తీక్ష్ణమైన తరుణాసైప్రైటిస్ వున్నయెడల [illegible] ఎంపెస్సుల
రక్తము చేతినుంచితీసి వేడినీళ్ళకాపడము [illegible] పౌల్టీసుగా
క వేయవలెను. లేనియెడల జలగలనుపట్టించవలెను. ఇతరసాధనములు
గూడా నుపయోగించనపుడు కెంతారిడిస్, టర్పెంటాయిల్ నిచ్చేది.
తలయందు దుర్గుణములు కలుగునపుడు మెడమీదను, పొక్కు-
మందులు వేయవలెను. తల వేడిమిగా నుండు నేని మంచునంచి తలను,
కట్టవలెను. — — — — —

టించరు కంతారిటిస్. ... ౧౫ మి.
స్పెర్టుపప్పు నైట్రికము. ... ౩౦ లేక ౬౦ మి.
శొంఠి పాకము. ... ... ౬౦ మి.
కర్పూరపునీరు. ... ౧౦ డ్రా.

ఇవి కలిపి బహుజాగ్రత్తగా వాడుకజేయవలెను. — —

Diabetes Mellitus, (డైబీటస్) అన్గా వ్యాధిమధుమేహము.

ఇది రెండు విధములు డైబీటస్, మెలిటస్ యని, యిన్సిపిటస్ యని, ఇందు మొదటదే మధుమేహము రెండవది యతిమూత్రము.

గుణములు—నీరుడు విస్తారముగానగును. శరీరముపొడార్బుకొని బిరబిర లాడుచుండును. పారమునకు ఆశగానుండు. జీర్ణాకోశము పీకు న్న విదాహముండును. నాశిసుల్బలముగుండి. నాలుకబిగిత్గ్గి పాలి,దో షము కలిగియుండును. విరోచనబద్ధము, విశేషనీరసము, నుషిరించుట,బి డలిక, నిస్పృహా, విశేష విచారము, మనస్సు చీదర కలిగి యుండును.— నీరుడి తనికీ చేయుటచే నీ రోగమును గ్రహించనగును. నీరుడి విస్తారమై పాలినరంగు గలిగి తూకవ ౧౦౧౫ మొదలు— ౧౦౨౦— వ్రటకు కలిగియుండి పంచదార లేకుండినపుడొట్టి బహుమూత్ర ముగా నెంచేది- ఈ తూకవ ౧౦౩౫ మొదలుకొని ౧౦౪౫ కలిగుండి తీయని వాసన కలిగియుండినను పంచదార నీరుడియందుండును. ఇందుకు నీ దిగువను చెప్పినప్రకారము పరీక్ష చేయవలెను. మూత్రము పోసినచోట ను చీమలు చేరును.* కొంచము మూత్రమునకు మైలతుత్తపునీళ్ళు కొంచ మురంగు వచ్చేవరకు కలిపి యాతరువాత లయికరుపొటాసీ కలిపి పంచ దారుండునేని పసుపు మిశ్రిమము యర్రని మడ్డి యడుగుకు జేరును. ఈ లాగుకనుకొనను విధమున టార్మిమరుసు టెస్టుయని పేరు. — —

మూత్రము తెల్లగా పాలవలెనగునపుడు కొంచముసేపొకచోటనుంచినేని కొంతఘట్టిముద్దగట్టి కొంత నీరుగానుండును. ఈలాగు మూత్రమున్న పుడు ఖైల్యూరియా Chyluria యని పేరు. —(తక్రమేహము)—

సాధ్యాసాధ్యము— చాలాకాలము నిలిచినట్టి యతిమూత్రము సాధారణముగా కుదరదు. ఇది శరీరబలమును ముఖ్యముగా పోగొట్టి మూత్రగుండెను వేసురూపము నొందింపుచున్నది. క్షయ, ఒడలు వాపు,

---

* చాలాకాలమైన తరువాత మూత్రము తగ్గును జ్వరము తగులును- క్షయగాని తామరకములం వ్రణములు మొదలగునవి కలుగును. ఈ రోగ ములో రోజుకు. ౮ మొదలు ౩౦ పయింట్ల నీరుడి అవును. ౧౫ మొదలు ౨౫ అవున్సుల పంచదార మూత్రముగుండా రోజుకు పోవును.

ఇందుపైని కలుగుచున్నవి. విస్తారముగా మెండిపోవుట, విశేషబలము చెడుట, తరుచుగా విస్తారము నీరుడిపోవుట ఆనీరుడిగింపరిశ మెుదలు ౧౦౪౫ తూగుట. — — — — —

అసాధ్యగుణములు — ఆహారముచాలక చావుకలుగుచున్నది. రోగి బలములోనున్నపుడు తినేహారముకంటే మెక్కువకపేక్ష కలిగియుండును. అతిమూత్రమున్ను థైలస్ యూరిన్ను హానికలుగజేయనవి కావు. ఈ దేశమందు రెండవది తరుచు. — — — —

హేతువులు — అజీర్ణరోగమను పుట్టించు సాధారణ హేతువులు కొందరియందు అతిమూత్రమును పుట్టించును. తలిదండ్రులనుంచి మూత్రమందు తీపెకలిగె గుణమువచ్చుచున్నదని చెప్పబడుచున్నది. గుదదాలు భేదమునొందినపుడు విస్తారముగా తాగునేని మూత్రమధికము పుట్టించుచున్నది. పాలనీరుడి విస్తారముగా మంచిబలమైన తిండితిని పాటుపడక, సోమారిగానుండుటచే కలుగును. ఇదిశరీరమున బలము లేమిచేకలుగు రోగముగాను. ఈమధుమేహమున రోజుకు ముప్పదిలేక ౪౦ దపైండ్లు నీరుడి వలుపు పోవును. — — — —

చికిత్స — సాధ్యమైనంత మట్టుపిండిజ్యపదార్థము మానిపించవలెను. జంతుపదార్థములిందుకు పథ్యము, తవిటిరొట్టె యిచ్చుట మంచిది. పాలు, మాంసము, బాదితులు, మెుదలగునవి యివ్వవచ్చును కాపీకంటే తేయాకు నీరుస్వల్పజబ్బు చేయుచున్నది. నల్లమందిందు ముఖ్యమైనమందు డోవర్సుపౌతరు నివ్వవచ్చును. నల్లమందుమంచి మోతాదిచ్చేది. గోరువెచ్చని యుప్పునీటను స్నానము చేయించవలెను. జాంబోలీను.— (Jamboline) లోపుకు మంచిమందు F నెం॥ ౪౫-౬౦ యిచ్చేది. —

పొటాస్ బైకార్బోనస్. ౨ డ్రా॥ — —

సిరిట్పిఅమోనియా. ॥ అర డ్రామ్.— — —

ఫెరైఅమోనియా సైట్రస్. ౧ డ్రా॥— —

కలంబాషాకయము. ... ౬ ఔన్సులు కలిపి—

ఒక ఔన్సున్నర నిమ్మపండి రసముతో కలిపి రోజుకు మూడుపర్యాయములివ్వవలెను. ఇది ౨-౩ వారములిచ్చి మానివేయుచుండేది చేపచమురందు మంచిగుణమిచ్చును. — — — —

క్రియాసోటు. ... ... ౧౦ మి ... ...
యుస్టిమధూకముగుండ. ... ౧ డ్రా ... —
తుమ్మజిగురుకొంచము వేసి ౨౦ మాత్రలు చేసి ౨మాత్రలు
రోజుకు మూడుపర్యాయములు వేసుకొనేది. ఈమందును డాక్టర్ వాట
సన్ దొరవారు శ్లాఘించుచున్నది. ఈరోగముచే బాధనొందువారికి త
రుచుగా రాచపుళ్ళు- కళ్ళయందు పుప్పులు కలుగును —

---

## మదమేహము ఆల్బ్యూమినేరియా. (Albuminuria)

గుణములు—తరుణములో స్వల్పముగాగాని యధికముగాగాని జ్వర
ముండును శరీరముపొడిగానుండును మూత్రము స్వల్పముగానున్న ఖారము
తక్కువగానున్న. ఆల్బ్యూమనన్ అను సత్తువయిన పదార్థము కలిగియుం
డును మలువులతోనొప్పి, కడుపులోతిప్పు, వాంతి, దుర్బలనాడి, దేహమం
దు వాపుకలిగియుండును పురాణంబైనపుడు జ్వరముండదు రోగలక్షణములు
క్రమముగావచ్చును. ఉబ్బున్న, శరీరములో నితరావయవములకు రోగము
న్న కొంతకాలమైనపిమ్మట వచ్చును. రక్తములేమిచే దేహము పాలిపోయియుం
డును.— — — — —

లక్షణము— ఆల్బ్యూమెన్ ఉన్నదీ లేనిదీ మూత్రము మరగబెట్టి
శంఖద్రావకము కలుపుటచే తెలియవచ్చును అది యుండినేని గడ్డకట్టుచుం
న్నది. భూతద్దమువల్ల కొవ్వున్న చమురుగల గొట్టములను నీరుడు యందు
గానగును.— — — —

సాధ్యాసాధ్యము — తరుణములో నుబ్బసంకటముతో గలసియుం
డని యెడలనున్న మూత్రము బిరువధికమగుట వల్లనున్న సాధ్యములోకి వ
చ్చునని యాలోచించవలెను రోగము చాలాకాలముండి ఒడలువాపు మూ
త్రము విస్తారముగానుండి బరువు తక్కువగు నేని హానికలుగును.— —

హేతువులు— ఆధారహేతువు— మేహకారకతత్వము- ఉద్రే
కములు- సీతము, విశేషోష్ణము, దెబ్బలు, అడ్డపుట్టియుండిపిధముగు ఒడలు
పొంగుగలుగుచున్నది.— — — —

చికిత్స— విస్తారపునొప్పికలిగి యుండి నేని మలుగులపు జలగలను

పట్టించవలెను గాజుసోల కాక వేయవలెను విరోచనములను చపటునా పుట్టిం చెడి నౌషధములు వేడినీళ్ళస్నానము శరీరమునకు బలమునిచ్చే మందులలో ముఖ్యమైనది. ఇనుముచే చేయబడుమందులు మంచి సత్తువును కలుగచేయు ఆహారమివ్వవలెను. కొవ్వుసంబంధమైనట్టి చమురుసంబంధమైన వస్తువులు భుజించకూడదు. రోగముండుండు ఒడలువాపు ఇదివరలో చెప్పిన చికిత్సల వల్లనే బాగుచేయనగును. మూత్రము నధికముచేయుమందు ఈ రోగముంది వ్వకూడదు. F నెం॥ ౯౭ యిచ్చేది— — —

పొటాసీ ఐయోడైడ్, పటికె, ఆర్సెనిక్, గాలికేసిల్లుగాని యిచ్చేది— — —

## నరములజాడ్యములు.

నెదడు వెన్ను మూలుగు యొక్క రోగములందు వాటిస్వాభావికమైన పనిచేయుట లేకుండునట్టిగుణములుండును. ఈగుణములు నరములజాడ్యములలో సన్నిపాతియందుండు ఈ రెండవయవములవల్లకలుగు గుణములు— స్పర్శజ్ఞానము శరీరమును తన యిచ్ఛవచ్చునటుల కదల్పుట, మనస్సుతలపు స్పర్శజ్ఞానము లేకుండుట శరీరమును కదిల్చేశక్తిపోవుట, ప్రలాపము గాని మనోవికారముగాని కలిగియుండును. ఈగుణములీజాతి రోగమందు ముఖ్యముగా కలుగును — — — —

## అపోప్లక్సీ (Apoplexy.)

### శిరస్సుకు రక్తమెక్కుట.

ఇవి మూడువిధములు- ౧ కండుట, ౨ నీరు, ౩ రక్తముచేరుట. ఇందు మొదటిదానియందు శుభ్రరక్తముండు నాడులుపగలుకుండా విస్తారముగా నింపబడియుండును.— — — — — —

రెండవదానియందు రక్తములోనుండు పులినీరు వైకిచమ్మబడును మూడవదానియందు రక్తనాడులు బద్దలై రక్తము శిరస్సులోనికి చేరును

గుణములు— ఈరోగము ధాత్తుగా కలుగును లేనియెడల విస్తారముగా తలనొప్పి, కడుపులోగాభరా, మూర్ఛ, చెవులయందు ఝూంకారము, చూపు కనిపించకపోవడము, పక్షవాతము, ఈగుణములు ముందుకలుగును. అటుపైని మాంద్యము పుట్టును ఊపిరికీయుట, కష్టముగాను

ండును. అంతు గుటుకుండును ముఖము మాడియుండు కబళీకరణమసాధ్య ముగానుండు కండ్లువిప్పియుండి గుడ్లుపైకుండి చలనము లేకుండును కను పాపలు ముడుచుకొనిపోవును విరోచనబద్ధముగాని తెలియకుండా విరోచనములుగాని యవును మూత్రము బంధించి యందువల్లచుక్కలుస్తమానము పడుచుండును. నాభిప్రదేశమునకు దిగువగు మాంసఖండలుగాని శరీరములో తిన్నగా సగము మాంసఖండిలుగానికఠినముగానుండును స్వాభావికముకన్న నాడిమందముగానుండును ఒకానొకనియందు శరీరము చలవలు, సూక్ష్మమైననాడి, ఉచ్ఛ్వాసనిశ్వాసములు కలిగియుండును ఈ రోగము మూడువిధములుగా నంతమగుచున్నది—— ——

౧—— బాగానిమ్మళించడము—— —— —— ——

౨——చలనమునకస్వాధీనముగానున్న లేక వినికిగాని వాసన తెలియుట గాని మనస్సు స్థిమితము లేకుండగాగాని చేసినిమ్మళించును.

౩——మృతి. —— —— —— ——

నెదటిలోనుండు గదులయందు రక్తముగాని పులినీరుగాని ఈ రెండుగాని నెదటియడుగున పులినీరుగా నీరోగముండును. —— ——

నిధానించుట——తాగినవాడు స్మృతిలేకుండునపుడు వాసననుపట్టి కనుగొనవచ్చును ఒకానొకప్పుడు తాగుబోతు నందీరోగము కలిగనేని గుణములయొక్క పరిమితికాలము తెలియచేయును తాగునపుడు క్రమముగా త్వరగానిమ్మళించును ఈ రోగము విస్తారపుకాలముండును అంతకంత కెక్కువగును—— —— —— ——

సాధ్యాసాధ్యము——నోటివెంబడి, ముక్కువెంబడి, ముడ్డివెంబడి, రక్తముపడునపుడున్నూ విరోచనములుగాని విస్తారముగా చయుటగాని కలుగునపుడు మంచిగుణములుగా నెంచేది. చపలనాడి, కొంచముసిరిచమట, కాళ్ళుచేతులు వలవలు, దుర్గుణములు—— —— ——

హేతువులు — ఆధారహేతువులు—— కురుచైనట్టి వలమైన మెడగల శరీరమునరక్తము విస్తారముండుట, తల్లిదండ్రులిట్టిరోగమునకు వశులైయుండుట, గుండెయందుండు, దళములందు రోగముకలిగుండుట, మహావాతము రక్తనాడులయందు రాలుకలుగుట, ౪౫ మొదలు ౬౫ సం

వత్సరములవయస్సు— — — —

ఉద్రేకకారణములు— విస్తారముగాపనిచేయుట, విరేచనము చేయునపుడు తినుకు, దగ్గు, ఊపట, వంగుండి అధాత్తుగా లేచుట, విస్తారపుకోపము, సంతోషము చలవకు, కాకకు, శరీరము బయిలైయుండుట, చాలాకాలమునుంది స్రవించుశాంతివములు కట్టిపోవుట. — —

చికిత్స— ఈరోగముకు వశులుఇన వారలరోగము రాకుండగా పాడుకొను విధము తలకువిస్తారము రక్తమెక్కకుండా చేయవలెను. ఇందుకు విశేషముగా పనిచేయకూడదు. అల్పహారము భుజింపవలెను. కాకస్థలకుందునికి, సారాలుత్రాగుట మానవలెను. అప్పుడప్పుడు విరేచనములకు చేదుమ్మ పుచ్చుకొనుచుండవలెను. రోగమువచ్చునపుడు తలయెత్తియుంచవలెను. చల్లటిషూలి, తగలనివ్వవలె ముఖముగాదరించియుండి నాడినింపుగానుండి, యూపిరితిరుగనపుడు చేతియందుండు శుభ్రరక్తనాడికి గంటుపెట్టి తగినంతరక్తము తీయవలెను. మొగము కమిలియుండి, నాడినీరసముగానుండెనేని యీసాధనము జేయకూడదు. గుండెకొట్టుకొను తక్కువజేయుమందులివ్వవలెను. అనగా అప్పుడపుడు జలగలు పట్టించుట కపింగు వేయుట, విశేషముగా విరేచనములకిచ్చుట, విరేచనము జేసి పిచ్చకారీ యిచ్చుట, తల క్షవరము జేయించి చలవవస్తువు లెక్కించుట, మెడకు, కాళ్ళకు, పాక్కపట్టి(స్త్రీ) వేయుట. — — —

సాధనములు— వాంతకిచ్చుటచె కొందరికి గుణమిచ్చుచున్నది. మూలవ్యాధినుండిరక్తముకట్టునపుడున్ను, ముట్లుడుగునపుడీరోగముకలుగునేని జలగలను పాదమునకున్ను, యోనికిన్ని పట్టించవలెను. చిన్నకీళ్ళనొప్పులు పోవుటచె కలుగునేని యీసాధమిచ్చి యీనొప్పులు పుట్టించెది. రోగమునిష్కళించుచున్న అల్పహారము తగుమాత్రవు పనిజేయుట, చెప్పవలసియుండును. విశేషము రక్తముతీసినయెడల నిష్కళించుటాలస్యమగును ముసలివాళ్ళందు హాని కలుగజేయును. చిన్నవారలయందు తగునట్టురక్తము తీయునెడల మంచి గుణమిచ్చును. ఈ రుగ్మత పాశ్చాత్యముల్లోకి తీసుకొనివచ్చును. — — — —

## సన్‌స్ట్రోకు అనగా యెండదెబ్బ- (Sun Stroke)

క్రొత్తగా యీ దేశమునకు వచ్చెడు నాంగ్లేయులయందు విశేషముగా సారాయిని వాడుకజేయువారికి యెండదెబ్బ బాధించును.

గుణములు — సిరస్సుకు రక్తమెక్కినపుడుండు గుణములుండును. విస్తారముగాగాని, క్వచిత్తుగాగాని, స్పర్శజ్ఞానము లేకుండుట, మాట లేకపోవుట, శరీరమునందు కాక, వేగ గతిగాక నుండు నాడి, వొకానొకప్పుడు కాళ్ళుచేతులు చుట్టుకొనిపోవుట కలిగియుండును. —

చికిత్స—తలగొరిగి చన్నీళ్ళు తలమీద పోయవలెను. —

క్యాల్ మేలును, నేపాళపు నూనెయున్ను, విరేచనము జేయుటకిచ్చేది. తలకుగాని, మెడకుగాని, పొక్కుమందు వేయవలెను. కొంచము నెమ్మది కలిగినతరువాతను విరేచనముల కుప్పుసంబంధమైన మందులు, స్వేదమును పుట్టించెడి మందులు, సత్తువను కలుగజేసే మందులు, కని జద్రుతులు మొదలగునవి యిచ్చేది. — — —

సాధ్యాసాధ్యము— యీ రోగము సాధారణముగా హానిజేయునది కాదు. ఈ దుస్థితి కూడా పక్షవాతములోకి తీసుకొనివచ్చును. —

---

## పెరాలిసిస్ అనగా వాతము- (Paralysis)

ఇది మూడు విధములు ౧ పక్షవాతము అనగా శరీరములో సగము శిరస్సునుంచి పాదములవఱకు పడిపోవుట. ఇది సాధారణము. — (Hemiplegea). — — —

౨ కాళ్ళు పడిపోవుట, (Paraplegea). — —

3 ఏదైనా నొక అవయవము పడిపోవుట. యేకాంగవాతము.

౪ సర్వాంగవాతము. — — — —

గుణములు—అపోప్లక్సీతోను అధాత్తుగా నీవాతము కలుగును. అపోప్లక్సీ ముందుగాని, తరువాతనుగాని, కలుగును. — —

ఈ రోగమును పొందియున్న యవయవములు సంకోచిత్తితే వాటంతటవి పడిపోవుటయేగాక, వాటియందు స్పర్శజ్ఞానము లేకుండును, ముఖము, రోగము, లేసిననెప్పుకు లొంక్కనిపోవును. మాట లేకుం

దుటగాని, స్పష్టము లేకుండుటగాని, తప్పతప్పమాటలు కలిగియుండుట
గాని, యుండును. నాలుకపైకి చాచునేని రోగమున్న వైపుకు వంగును.
ఏప్రక్క రోగము పట్టునో యాప్రక్క కన్ను మూయుటకు వల్లనై యుండదు.
నాడీ వేగము, శ్వాస నింపాదిగాను, విరోచనబద్ధము, కలిగియుండును.
త్వరగా నివారణ గాకపోయినయెడల నవయవములు శుష్కించి యెండి
పోయి యుపయోగమునకు పనికిరావు. మనస్సుకూడా చెడిపోవును.

హేతువులు—ఆధారహేతువులు- అపోప్లక్సీవలెనే ఉద్రేకములు
అపోప్లక్సీ వెన్నుపూసకు దెబ్బతగులుట నీరస్సున రక్తము చేరుట, పుణికియొ
క్క దుమ్ము దెబ్బలవల్ల నణగిపోవుట, నెదడు మెత్తబడుట, గుండెయందుం
డు దశములలో రోగము కలుగుట. — — —

సాధ్యాసాధ్యము—బాల్యులయందు కలిగిన రోగము కొన్నిరోజు
లే భుక్తమై కొంతభాగమే పీడింపబడునేని సాధ్యము. చాలా కాలమైనత
రువాతనైన్నా, వృద్ధులయందు కలుగునపుడున్నా, దేహమంత రోగముచే
పీడింపబడునపుడు నసాధ్యము. — — —

చికిత్స—రోగము యొక్క యుద్రేకహేతువును సాధ్యమైతే తీసి
వేసి దుర్గుణములను నివారణచేసి నరములకు సత్తువ కలుగజేయవలెను.
పునుక అణగుటవల్లను కలుగునపుడు పునుక దుమ్ము దొలిచి తీసివేయవలె
ను. మూత్రము బంధించునెడల గొట్టముచే తీసివేవలెను విరోచనబద్ధము
నకు అపానముగుండా ప్రయోగించుమందువల్లను విరోచనము చేయిం
చవలెను. పొక్కపలాస్తులు వేయుట, [illegible] తైలములు మర్దనజేయు
ట, ఎలెక్ట్రిసిటీ, చల్లనైన [illegible]ములు చేయుట, కొన్నిటియం
దు చురక వేయుట, లోపలకు టర్పెంటాయిలు. పొక్కటీగవల్లను చేయబ
డుమందులు, ముషిణిగింజల వలన జేయబడు మందులు, స్ట్రిక్నియా యి
చ్చేది. ముషిణి సంబంధమైన యౌషధలిచ్చునపుడు బహుజాగ్రత్తగానుం
డి యది పుట్టించు గుణములను చూచుచుండవలెను. 1/16 గ్రేను మోతా
దుచేసి స్ట్రిక్నియా యిచ్చి క్రమముగా ⅛ లేక 1/6 గ్రేనుల వరకు మో
తాదుచేసి రోజుకు మూడుపర్యాయములిచ్చి మధ్యమధ్యమాని వేయుచుం

డవలెను. ఇట్లాగు జేయుటచే నౌషధముచే దుర్గుణములు కలుగనేరవు. ఈ
మందు మోతాదెక్కువయిచ్చునేని ప్రాణహాని చేయును- మాంసఖండలు
లాక్కొనిపోవుచున్నవని రోగిచెప్పునపుడు ఈమందు గుణమిచ్చుచున్నద
ని యోచించి ప్రయోగమునిలిపేది. దీనిని తలయందుండు రక్తనాడులు
పొంగియున్నపుడివ్వకూడదు. తరుచుగా విస్తారముగా విరోచనములకిచ్చు
టచే లాభము కలుగును. జాలుపున్న సేహ-మొనీ యీరెండు కలిమేలు
కలిపిగాని, నేపాళపుచమురు వల్లనుగాని, కాకమీద విరోచనముచే సేపిచ్చు
కారీగాని చేసి విరోచనములు చేయించవలెను. కొందరు మెదడు పాస్ఫావ
లాస్ట్రీని వాడుకచేయుదురు. రోగాదిని రసము స్వల్ప మోతాదులుగా-
పొటాసి ఐడినుతో కలిపి యివ్వవలెను. వెన్నముకలుకువల్ల గలుగు సగము
వాతమందు, సర్పిరముగాని, స్తంభముక్కపిల్లుగాని కొన్నివారములవరకిచ్చేది.

టించెరు కెంతారిడిక్ అను అలఖు అబిదాస్త్రీము మోతాదు చేసి
వాడుకచేసేటట్లు డాక్టరు సిమూరువారు చెప్పుచుండిరి. కేలు మేలు ప్ర
త్యేకము నోరువస్తువలన నల్లమందు మేళనచేసి యిచ్చి యటుపైని బల
ముకలుగు సాధనములు జేయుటచే చాలామందికి నివృత్తించుచున్నది. రస
మువల్ల కాళ్ళు చేతులు పడునపుడు పొటాసీఐడీను, సముద్రస్నానము, మంచి
భోజనము, వేడినీళ్ళస్నానము, రోగమును పోగొట్టుచున్నది. (సర్పిరము)
పాషాణ సంబంధమని తలంచునపుడుగాని, అదిరససంబంధమని గ్రహించ
వలెను. నెం॥ ౩౯ ఇచ్చుటచే సాధారణముగా కుదురును.— —

---

## (Paralysis Agitans) అనగా వణకు రోగము కంపవాతము.

గుణములు—ప్రథమమందొక యవయవమందు సత్తువతగలకపోవుట
వణుకుపుట్టి క్రమముగా దేహమంతట వ్యాపించును. రోగినడుచునెడలతో.
చుకొనిపోవును, నిలువబడలేడు, వణుకు విస్తరించిన కొలది నిదురభంగమ
గును. ఊపిరి బహుతరుచుగా నొచ్చును. మాంద్యము పరానుమాటలు త
రువాత పుట్టును. — — — —

సాధ్యాసాధ్యము—తరుచుగా అసాధ్యము. ఈడు ముదరనివా

రియందు కలిగి చాలాకాలము కానియడల బహుజాగ్రత్తగా సాధనము-
చేయు నెడల నిర్మూళించునని యూహించునది. — —

హేతువులు—ఆధారహేతువు—వృద్ధాప్యము-

ఉద్రేకములు—విస్తారముగా పానము జేయుట, శరీరబలము తగ్గే
పనులు జేయుట, వెన్ను మూలుగునందు రోగము కలుగుట, —

చికిత్స — బలము కలుగ జేయునట్టియు, కాక జేయున
ట్టియు, మైకము కలుగ జేయునట్టియు, మందులు మేళనజేసి యివ్వవ
లెను పిన్నవైస్సు గలవారలందు పాన్ఫ్రాస్టులు మొదలగునవి వే
యనగును. ఇనుమునుంచి చేయబడు మందులిందు మిక్కిలి యుపయోగిం
చబడును. నెం॥ ౫౮ ౦ ౧౧౮ ఇచ్చేది. — — —

నపుంసకత్వము. (Inepotency.)

ఇది 3 విధములు. — —

౧ పుట్టుచేటుకలది.— — —

౨ మధ్యకలిగినది. — — —

3 కొంతమట్టుకు, లేపనముకలిగి సంభోగమునకుపనికిరానిది.

ఇందు మొదటిది. అనివార్యము. ౨- 3 తరహాలు సాధనము చే
యతగినవి. — — — —

గుణములు—పురుషునకు స్త్రీతో నుండవలెననుకోరిక విస్తారము
గానుండు అందుకుపయోగించకపోవుటచే చాలా విచారము కలిగియుం
డు యెంతత్వరగా తనకు బలముకలుగునని యోచించుచుండును. మూడ
వ తరహాయందు కొందరిలో లేపనము స్వల్పముగాకలిగి వెంటనేతగ్గును
మఱికొందరిలో స్త్రీని ముట్టిన వెంటనే వీర్యపతనమవును. — —

హేతువులు—మధ్యవచ్చునది- విస్తారము సంగమమువల్లనున్ను
సుఖజాడ్యములవల్లనున్ను మత్తువస్తువలు చాలారోజులు అభ్యసించుటచేత
నున్ను చేతితో వీర్యస్ఖలనము జేసుకొనుట అభ్యసించినవారలలోను, చిర
కాలము యితరరుగ్మతలచే బాధనొందుట- కర్పూరము, గంధకము తిను

టచె కొంతకాలమీదురవస్త సంభవించుట కలదు. — —

చికిత్స — శరీరమునకు బలము కలుగజేయు మందులును, భోజనము- సంతోషమును కలుగజేయువారి గోష్టియు- చన్నీళ్ళస్నానము, తగినట్లు కసరత్తు జేయుటగాని, దేహము వె పాటుపడుట జేయుదు. F నెం॥ ౭౮- ౮౦ పుచ్చుకొనవలయును.— — — —

డెమియానా- [illegible]స్పశిరపు, ఇనప అలుఖు, ముషిణి అలుఖు, ఫాస్ఫరసు మాత్రలు యిచ్చేది. టించెరు కేస్టోరియై (Tincture castorii) ఇచ్చుటచె స్థంభన కొందరిలో కలుగును. వీర్యము త్వరగాపడిపోవునపు న్ను రాత్రిళ్ళు నిద్రలో స్ఖలనమవునపుడు, నెం॥ ౧౨౮ ఇచ్చేది. —

మస్తిష్క మేహము ఎన్‌కెఫ్‌లైటిస్. (Encephalitis)

మెదడు, మెదడును కప్పుపొర లేక రెంటియందు పచ్చి కలుగునపుడు ఎన్‌కెఫ్‌లైటిస్ అని పెరుగును. — — —

గుణములు—శిరస్సులో విస్తారనొప్పి, ఓకరింపు, వాంతి, విరోచనబద్ధము, మెడయెండు, కణతలయెండు, ధాతువులు కొట్టుకొనుట, పరాకుమాటలు, ముఖము గాదరించియుండుట, వెలుగు చూడలేకపోవుట, కనుపాపలు ముడుచుకొనిపోవుట, శరీర[illegible]నాను, పొడిగా [illegible]ండుట, వేగగలిగలిగి ఘుట్టిగా నుండునాడి య[illegible], పొడిగానుండు నాలుక,విదాహము కలిగియుండును. విస్తారముగా జబ్బుజేసినపుడు చెముడు,ముఖమునందు కళలేక పోవుట, కం[illegible] తిరగబడిపోవుట, కాళ్ళుజేతులయొక్క మాంసఖండలు చుట్టుకుపో[illegible]గాని, పక్షవాతముగాని, కలిగియుండి కాలు చేతులు చలవలుగమ్ముట, [illegible]కముకలుగుట, శరీరము చుట్టుకొనిపోవుట, కలిగుండును.— — — —

హేతువులు— తలనీ[illegible]సు యేమీలేకుండగా విశేషయెండ తగుటచేతనున్ను విశేషకోపము చేతను ఆశ్చర్యము చేతను పైనితగులుదెబ్బల చేతను కలుగుచున్నది. ఉబ్బుసర్పిగొట్ ఈ రోగము లోకచోటనుంచి మఱియొకచోటకు నడుచునపుడుకూడా కలుగుచున్నది. — —

వాతనొప్పులలో యీ జబ్బువస్తే కీళ్ళకు ఆవపిండి వేసేది. విరేచనముకు కేలుమేలు, ఆముదమిచ్చేది నల్లమందీరోగములో నివ్వకూడదు. పలుపులు కట్టుటకు నెం॥ ౧౦౬-౧౧౧ యిచ్చేది. —

కఫవాతములు జేయునపుడు బ్రాంది గాని, అమోనియా గాని, యీతరుగాని, యిచ్చేది. మింగ లేకుంటే అధో మార్గము గుండా యిచ్చేది.

---

## శిరోవాతము.

(Hydrocephalus.) హైడ్రోకెఫలస్ అనగా తలలో నీరుకలుగుట

ఇవి రెండు విధములు- తరుణము పురాణము-

ఈ రోగము చంటివారలందు చిన్నవారలందును కలుగుచున్నది.

గుణములు — ఎంకెఫెలైటిస్ యందుండు గుణములతో గాని, సాధారణమైన జ్వరముయొక్క గుణములతో గాని, ఈ రోగముపుట్టుచున్నది. జ్వరములందున్ను దద్దురూష్ణములందు నీరోగము పురాణరూపముగాక క్రిమిశ్రమముగా నన్నిగుణములు కలుగును. రోగముకలిగిన తరువాత శిరస్సు వేడిమిగానుండును శిరస్సునందు పొడుచుచుండేనొప్పికలిగియుండును శిరస్సు పెద్దదిగాను, విశేషముగా బాంధ్యము వెలుగు చూడలేకపోవుట, ధ్వని వినచాలకపోవుట, యువగా నెంత మాత్రము చప్పుడైన నోర్వలేకపోవుట, కండ్లయందున, ముఖమునందెరుపు కలిగియుండును. కనుపాపలు విడియుండును. శరీరము వేడిగాను పొడిగానుండును. నిద్రబాగా పట్టకుండుట, బాధనుపొందుచున్న పిల్లలు పెద్దకేకలచె నిద్రనుండి తెలివినొందుచుండును నాడి వేగముగాను. ఊపిరితరుచుగాను, నీరుడి విశేషము రంగుగాను, విశేషము జబ్బుజేసినపుడు శరీరము చలిమకొనిపోవుట, పక్షవాతము, మైకము, కలిగియుండును. ఒకానొకపుడీగుణములు కొంతకాలము తగ్గును. ఇపుడు తలయందు నొప్పితగ్గును జ్వరమువిడుచును. నాడి వేగము తగ్గును. ఈ శాంతి కొద్దికాలముండినపిమ్మట నీరసస్థితిలోకి తీసుకొని వచ్చుచున్నది. నాడిని, నూపిరిని లెక్కబెట్టుట కవకాశము లేకుండునటులుండును. శరీరము చలవలు కమ్మును- విరోచనములున్ను అపానము వెంబడి యూనమున్ను కలుగుచున్నది. పక్షవాతము

గాని, మాంద్యముగాని, శరీరపు నలతనుగాని, కలిగి రోగమునంత వృ
ద్ధుచున్నది. — — — — —

నిదానించుట—తలయందు నొప్పి, తలంతకంతకు పెద్దదగుట, ముఖ
ము కందుట, మందత, జ్వరము నిద్రాభంగము, నీరోగమును పోల్చుటకు
ముఖ్యములు. — — — — —

సాధ్యాసాధ్యము—తరుచుగా నసాధ్యము, నాడికొంతసేపు కొ
ట్టుకొట్టి కొంతసేపూరకుండి తిరుగా కొట్టుచున్న యెడల హానిని తెలు
పుడు జేయును. — — — — —

హేతువులు—ఆధారములు పిల్లయీడు, బలహీనత, నాజూకు దే
హము- ఉద్రేకములు, పండ్లువచ్చుట పేగులయందు పురుగులు కలుగు
ట, దద్దురూష్ణములు మొదలగునవి — — — —

చికిత్స—ఇంప్లమేషన్ తగ్గించుట- ఉద్రేక కారణములు తీసివేయు
ట కార్యములుగానున్నవి. చెవుల వెనకను గాని కణతలను గాని జలగలుత
ట్టించుట, గాజుసోలకాక వేయుట, పాత్సేషము, జాలపు, మొదలగు విరో
చనసాధనములు అంటుగుని చలవైన్నిట్టి, ఆవిరియాపగును యెగిరిపోవున
ట్టి యౌషధ నీరులు తలకు వేయవలెను పాదములు వేడినీళ్ళలో నుంచుట
మొదలగు సాధనములు, ఉద్రేక కారణమును పోగొట్టుటనగా, పేగుల
యందు బురుగులుండు నేని పురుగులుపోయే మందులీయవలెను. పళ్ళువచ్చు
సమయమున సులభమైన విరోచనసాధనములు పుల్లులను విరిచెనుందు
లు, ఇంగుళ్ళు కత్తితోకోయుట, మొదలగు సాధనములుజేయవలెను. రో
గము సాధారణముగా బుగాణములోకి జేరుటచె గాని, మృతిని కలుగుజే
యుట నివారిణ మగుటచె గాని, యంత్యమగుచున్నది. పురాణ రోగము-
ఇతర రోగము లేకుండగనే కలుగుచున్నది. అనగా పిల్లలు, యీరోగ
ముతోనే జన్మించుచున్నారు తరుణరోగమువల్లనున్న మెదడునుకప్పే
పొరలయందు యింప్లమేషను పుట్టుటజేతనున్న యీపురాణరోగము గ
లుగుచున్నది. శిరస్సు విస్తారముగా పెద్దగుచున్నది.— — —

చికిత్స—మంచిభోజనము, ఇనుము, సైను, సముద్రపుగాలి మొ

దలగు సాధనములున్న శరీరమున బలము జేసినకొలది పుట్టినట్టి నీరు హ
రించును. నీరు హరించుటకు పొక్కు మందులు, రసము- మూత్రమధికము
జేయు మందులనగా స్క్విల్, డిజిటేలిస్, మొదలగునవి యివ్వవలెను. ఈ
సాధనములన్నిటి వలన కార్యము లేనపుడు రోగి వృధముగా నుండినేని
నీరుపోవుటకు శిరస్సుకు రంధ్రము జేయవలెను. ఇందువలన నప్పటికి శమన
మేగాని, తిరుగా నీరుపుట్టును. ఈరంధ్రము లాఘవను జేయవలెను. అటు
పైని కట్టుకట్టవలెను. గుడ్డలతో బిగించి కట్టుటవలన రంధ్రము జేయకుండ
నివారణయగుచున్నది. ౬ మాసములు మొదలుకొని ౧౨ మాసములకై
న్న వారికి చిన్నమిలిగ్రాంలెకు పోటుఝైన మిలిగ్రాంలెకు నీళ్ళలో వేసి యి
య్యది. పోటుఝైన గోమాంస కషాయము సమభాగములతో ప్రతిఘం
టకున్న ప్రతి రెండు ఘంటలకు నిప్పించవచ్చును. — — —

స్పిరిట్సమోనియా, ... ౧ డ్రాము.

స్పిరిటు ఈతరుకంపౌండు, ౨౦ మి.

నీళ్ళు .. ... . ౨ ఔన్సులు.

ఇది కలిపి ౧ లేక ౨ డ్రాములు విశేష నీరసముగా పిల్లలున్నచో
దు ప్రతి రెండు లేక, నాల్గు ఘంటలకివ్వవలెను విరేచన సాధనము జేయుటకు
క్రీడీ మందులతో నివ్వవలెను. F సెం॥ ౧౧౨ యిచ్చెది. — —

---

పిసురు వాతము కొరియా. (Chorea)

శరీరమును కదల్చునట్టి నరములను జబ్బుకలిగి స్వాధీనముగా
కదల్చుటకు కొంచముగాగాని, విస్తారముగాగాని, అశక్యత కలిగి శరీర
మునవొకవిధమైన చలనము కలిగియుండును. — — —

గుణములు— క్రమక్రమముగా వచ్చుచున్నది. కాలు వెనుక్కు వె
నక్కు లాగుటయిది ప్రథమగుణము ముఖమునందు యీలాగు లాక్కుపో
వు చిహ్నములు ప్రథమత కూడా కలుగవచ్చును. అటుపైని యనేకమాం
సఖండలు కదులుచుండును. వేళ్ళయందు దృఢములేక క్రమముగా యేన
స్తులను పట్టుకొనుటకు నశక్యముగా నుండును. = =

శరీరమందొక ప్రక్క మాంసపు ఖండలు చుట్టుకొని పోవుట. ఇంక ముఖమందమందునవి విస్తారముగా బాధనొందును. ఈలాగున మాంసపుఖండలు లాగుచున్నప్పుడు వెక్కిరించుచున్న రూపము ముఖముగియుండును. ఆలోచన తప్పును. అజీర్ణము కలుగును, విరోచనబద్ధం, ముపలుచగా పాలిపోయి యుండును. అటుపైని శరీరము శుష్కించిడును. భోజనము జేయుటకు నన్నము చేతితో నోటికి తెచ్చుకొనుట యత్నించునప్పుడు తలమీదుగ గాని — నుదుటి యొక్క ప్రక్కనుగాని చేసుకొనిపోవును, కొందరియందు శిరస్సు సర్వదా యాడించబడును. ఇట్టి యస్వాభావిక చలనము నిద్రపోవునప్పుడుండకపోవుట తరుచు (నించుట) రోగమునకు శరీరము దానంతటది సర్వదా కదలుచుండతమన్న గొంతుకలోనుండ లేకుండుట చేతనున్న, హిస్టీరియా యనుగమునుంచి ప్రత్యేకించనగును. — — —

సాధ్యాసాధ్యము — ఈ రోగము దెబ్బలవల్లనున్న, ఇంస్లమే వల్లనున్న, వెన్నుపూసలయొక్క - దానిపై పొరలయొక్క రోగ వల్లను కలుగునప్పుడు తప్ప హానికలుగజేయునది కాదు. —

హేతువులు — ౧ శరీరము బలహీనమగుట, నరములు బహు క్షీణములగుట, ౭ మొదలు ౧౫ సంవత్సరముల ప్రాయపు స్త్రీలు కణములు. — — — — — —

ఉద్రేక కారణము — దెబ్బలు, పేనులుగాని, గర్భాశయముగ వెన్నులోగాని, వాయువుగాని, కంటకముగాని, కలిగియుండుట విస్తారపు కోపము, మోహము మొదలగునవి. — —

చికిత్స — ఒనుపు కలుగజేసే కారణములను కనుగొన్న వెంటనే తీసివేయవలెను. అటుపైని శరీరబలము నభివృద్ధిపొందింపవలెను. పురుగులున్నచో నేరుగ యవి చచ్చు మందులున్న, విరోచనసాధనములున్న యవలెను. గర్భాశయము మొదలగు వాటియందు కందియుండుట కలిగిననేని గాజుముంత కాక, పాస్కుమందులు వేయవలెను. జాగ్రత్తగా విరోచన సాధనములు జేయుచుండవలెను. క్వైనను, వెండి, తుత్తునాగము ఇనుము

ము, వీటివలన జేయుమ్మందులిచ్చిన్ని, చల్లని నీళ్ళస్నానము,మంచి
గునట్టివన్ని, సులభముగా జీర్ణమగు పదార్థమును గలుగచేసే భోజ
ను, శరీరబలమును వృద్ధిపొందింపనగును. సక్కర్‌స్కోనిన్నైను 1½ మొ
తాదు గ్రాముల వరకిచ్చుటచే మిక్కిలి యుపయోగించుచున్నది.
గా తెల్లామదము విరోచనమునకిచ్చుచుండేది. నెం ౫౯ ఇచ్చేది.

---

## (Hysteria) హిస్టీరియా అనుమూర్ఛ. (పిశాచము)

స్వరూపనిరూపణము— జీర్ణము చేయునట్టి, శ్వాసముకలుగున
నలయందు చెరుపుతో, శరీరమునందుండు మాంసపుకండలు బిగిం
(ఈ బిగించడము అప్పుడప్పుడు కలుగును) తెలిసి మిక్కిలి తప్పకము
ను స్వాధీనముగానుంచు శక్తిపోయి యుండును. — —

గుణములు— ఇది వచ్చునప్పుడు పలుమారులు నిస్పృహత్వ, కడుపులోతి
గుడు డెడిడు, కడుపులోనుండి గొంతులోకి ఒక పదార్థమునయుండ,నడు
న్నట్లుండుట, ఇది ఈ రోగమందు ప్రధానగుణము. ఇందుచే నూపిరి
నట్లుండును. దూపిరి త్వరిగా నుండును కన్నులు తెల్లకెంపులను
మెల్లగానగును. కాళ్ళు చేతులు గట్టిగా మట్టుకొనిపోవును. రోగి కేక
యుచు నవ్వును, లేక యిడిల కన్నుల వెంబడి నీరు కారునటుల నేడుచు
చును. ప్రలాపము గాని, మైకము గాని, కల్పిగించుండి యితరులు లే
ప్రశ్నజేయునెడల జవాబు క్రమముగానిచ్చును. ఇట్టిస్థితి త్వరగానే పో
పొందునప్పుడు పస్తారముగా మూత్రమగును. ఒక్కరోజులో యనేకమా
లుగాని. యనేకరోజుల కొకసారిగాని, కలుగుచుండును. పక్షవాత
చెముడు, మాటచ్చెప్పోవుట కలుగవచ్చును. — — —

నిదానించుట— రోగమందు గొంతుక యందుండవలెనుండుటచేత
న్ను బాధలోనున్నపుడేమి జరిగినది యారోగికి జ్ఞాపకముండుటచేత
న్ను సాధారణపు మూర్చనుంది ప్రత్యేకించనగును. ఈరోగము స్త్రీల
యందున్ను, మూర్ఛ పురుషులయందును తరుచు.— — —

సాధ్యాసాధ్యములు— ఈ రోగము మృతిని గలుగుచేయుట క్వాచి
పురుషులందు కలుగునపుడు వైద్యభ్రమలోకి తీసుకొనిపోవును. —

హేతువులు—అధార హేతువు—స్త్రీలు వొంటిగానుండుట, ప్ర
సన్ననందు కోరికగలిగియుండుట, బహునాజూకుగానుండు శరీరము.—
ఉద్రేకములు—ముట్లయందు, పిల్లను కన్నపుడుండు స్వాభావిక
ముగానుండు శ్రావములు, కట్టిపోవుటచేతనున్న విశేషముగా దేహమల
ములు విడుచుటచే బలహీనత కలుగుటయు, కడుపుపొంగు, అజీర్ణము
మొదలగునవి. — — — — —

చికిత్స — గుణములు కనబడునపుడు చేయువట్టి సాధనము శాం
తికే ఇందుకు కస్తూరి, స్పిరిట్సు అమోనియా, ముఖము మీదను చల్ల
ని నీళ్ళు కొట్టుట, ఊపిరినస్తే దేదైనావస్తువులు, మెడయున్న యెడల తీసివే
యునది. (నిరామయ కాలము) ఇది ఈరోగముయొక్క చిహ్నాలు కనపడి
నిమ్మళించి పునః రోగము కనబడువఱకునుండు కాలమునకు పేరు. ఈ కాల
ములో నీరసించకుండా విరోచన సాధనములు చేయవలెను. శాకనుపుట్టిం
చునవి, బలమునిచ్చునవి, ఇనపసంబంధమైనట్టి క్వైనను, జింకు, మొదలగు
నట్టి మందులు నరములకు సత్తువ నిచ్చునట్టివ్వవలెను. పెళ్ళిగాని స్త్రీల
యందిరోగము విస్తారకాలముంటే పెళ్ళిచేయవలెను, నాటలు నీరసము
గానుంటె బెలడోనాపలాస్త్రీ గొంతుకపైని అంటించేది కీళ్ళునొప్పులకు
బెలడోనా తైలము మర్దించేది. కాళ్ళు చేతులు స్వాధీనము తప్పితే గాల్వా
నిక్కుబేటరీ వాడుక జేసేది. విశేషము వడిగా నుండునేని నెం॥ ౧౭-
౨౦-౨౧-౭౭-౯౫. ఇచ్చేది. — — — —

---

ఎపిలేప్సి అనగా మూర్ఛ. (Epelepsy,)

స్వరూప నిరూపణము—ఇది నరములయొక్క జాడ్యమై అధా
త్తుగా తెలివిని తప్పించి శరీరావయవముల మాంసపు కండలను లాక్కొని
పోవును. అటుపైని మైకము కలుగజేయుచున్నది. ఇందు నిరామయ కాల
మింతని నిర్ణయము లేకుండును. — — — —

గుణములు—ఒకానొకరియందు ముందుగా తలనొప్పి, కన్నుల
కు మిణుగురులవలె గానబడుట. చెవులయందు విస్తారపుధ్వని, శరీరము

ల్లగా నుండుట, లేనియెడల శరీరమందెక్కడనయిననూ నొప్పికలిగి తల బ్రాకినటులుండుట, రోగి అధాత్తుగా స్మృతితప్పిపడును. నోటివెంబ మురగవచ్చును. కన్నులు చలనములేకుండి పైకివచ్చునట్లు ముకముండు శరీరము చుట్టుకొనిపోయి మాంసపుకండలు లాక్కొనిపోవుచుండు ను. యగవూపిరి కలిగియుండూపిరి విశేషకష్టముతో తీయబడును. ఈగు ణములు రెండుమూడు నిముషములలో పోయి రోగి స్వస్థతగా పరుండి క్రమముగా వూపిరి తీయచుండును. తొందర చేయని యడల కొంతసేపు గాని, చాలాసేపుగాని, నిద్రను పొందును. లేచినపుడు తానుబాధనొం దుచున్నపుడు జరిగినచర్యను తెలియకుండును.— — —

నిధానించుట—బొత్తిగా తెలివి లేకుండుటచేత హిస్టిరియాను చిన్న వాడలు నలుచుకొనుటచేతను, బాధత్వరగాపోవుటచేతను, పక్షవా తము లేకుండుటచేతను, అపోప్లక్సీనుండిన్ని ఈరోగమునుప్రత్యేకింపనగును.

సాధ్యాసాధ్యములు—పురుగులచేతను పండ్లవచ్చుటచేత నీలాటిసులభ సాధ్యముగా నివారణచేయబడు హేతువులచే కలుగునపుడుసాధ్యము, పా తంపర్యాయముగావచ్చినపుడున్ను మెదడుపైగాని, నరములపైగాని గ్రం థులు మొదలగునవి నణుచుటచే కలుగునపుడసాధ్యముగా నెంచబడును.—

హేతువులు—ఆధారహేతువు తల్లిదండ్రులయందీరోగముకలి గియుండుట విశేషముగా సంగమముచేగాని, సంగమము లేకుండతనంత ట తాను వీర్యపతనము జరిగించుకొనుటచేతనుగాని, విశేష నీరసమును పొందుట.— — — — —

ఉద్రేకములు—అధాత్తుగా కోపము, భయము కలుగుట, పు రుగులు, పండ్లువచ్చుట, విరేచనబద్ధము, రక్తము పూర్ణించి యుండుట, విశేషకాలము యెడతెగకుండా శ్రవించుచుండుటగాని, యొకపర్యాయ ము శ్రావములు కట్టిపోవుటగాని నీరోగమును పుట్టించును.— —

చికిత్స — రోగి మెడకు తగులుకొని యేవైనాయున్న యెడల వాటినితీసి వేసి దన్నుగాని, ఇతరులగాని, హానిచేయకుండా కాపాడవలెను.

[illegible]యుకాలమందు తిరిగి యుద్రేకించకుండా సాధనము చేయు

వలెను. రోగోత్పత్తికి హేతువు తెలసినేని ఆహేతువును తొలగించుటకు నాలోచించవలెను. సింకోనా, క్వైనను, తుత్తినాగము, ఇనుము, మైలతుత్తము, వెండి, పాషాణము మొదలగు వాటివలన జేయునట్టి నౌషధములచే బలము నభివృద్ధిచేయవలెను. భోజనము క్రమముగా జేయుట, తగినట్లు దేహమును కష్టపెట్టుట, నిద్రనుండి యుదయమున త్వరగా లేచుట, క్రమమైన ప్రవర్తన చల్లనినీళ్ళస్నానము రోగోద్రేకమునకు ముందు తలయందు నింపుగానున్నటుల కనుగొనిన వెంటనే గళమునందుండు కరోటిడ్ రక్తనాడి నణచవలెను. జిలజిలకలిగినేని, సిరస్సుకు నదిపుట్టినస్థలముకు మళ్యన త్రాడుబిగించుటచే నుద్రేకించుట కట్టును. ఈ సాధనములు రోగము రాకుండా ముఖ్యముగా నాపలేవు. చల్లనినీళ్ళు ముఖమీద జిల్లుటచేతవాంతులకిచ్చుటచేత స్వల్పములయందు రాకుండా కాపాడును. నెం॥ ౪౦౩-౪౪ యిచ్చేది. —— —— —— ——

ఈ రోగము వెండికాస్టికు లోపలకిచ్చుటచే కుమరును. దేహము నల్లబడిపోవుటచే దీనివాడుక మానివేయవలసివచ్చెను- బ్రోమైడు ఆఫ్ పొటాసియమ్- ౫ గ్రేనులు మోతాదు చొప్పున నిచ్చుటచె శిరోగము కుదురునుగాని, యొకసంవత్సరము మధ్యమధ్య మాని వేయుచూ పుచ్చుకొనుచుండవలెను. ఇది ౨౦ గ్రేనులు మోతాదు వఱకు క్రమముగా నివ్వవచ్చును, పాషాణద్రావకము, వెలీరియనేటుజింకు, సుఖసంబంధముగు జబ్బు దేహమందుండు నెడల రసముగాని, పోటాసీ అయొడైడ్ గాని, యివ్వవలెను. స్త్రీలయందు గలుగునపుడు వారికి తెల్లకుసుము, ఎఱ్ఱకుసుము, గంటుపొప్పి, ముట్లుకాకపోవుట, వీటిలో నేదైన కలిగియుండు నెడల నందుకు తగునట్టిసాధము జేయవలెను. విశేషరక్తపూరిత దేహులయందు కలుగు నెడల, ఉప్పు విరోచనసాధనములివ్వలెను- భోజనము తగ్గించవలెను. ఉద్రేకముండు నల్లమందకుబన్నావచ్చును. సింహాయకాలుష్ణ సంకు, కోనియమ్, స్ట్రామోనియమ్, హైయాసియామి, బెలడోనా, డిజిటేలిస్, వెలీరియన్, ఇంగువ, కస్తూరి, కేవరు, టర్పెంటయిలు, నక్సావమిక, స్ట్రిక్నియా, మొదలగు సాధనములు జేయనగును. —— —— —— ——

స్పిరిటు అమోనియా, ఆరోమెటికొ. ౧ డ్రాము.

టించెరు కేస్టారియై... ... ౩ డ్రా.

లావెండరుస్పిరిటు. ... ... ౨ డ్రా.

మింటువాటరు.... ... ... ౧ ఔన్సు

ఇవి కలిపి రెండు డ్రాములు రోజుకు మూడు పర్యాయములివ్వవలెను.

క్వైనియా సల్ఫసీ ... ... ౨ గ్రే॥

గంధకపు ధృతిపీట. ... ... ౫ మి॥

టించెరు ఆరాన్షియై- ... ౧ డ్రా॥

సిరపు. ... ... ... ...

సీమతిప్పతీగె కషాయము. ... ... ౧ ఔ॥ కలిపి రోజుకు

మూడు పర్యాయములు యివ్వవలెను.— — — —

క్వైనను.... ... ... ౧౨ గ్రే॥

అన్నభేది.... ... ... ౧౨ గ్రే॥

గంధకపు ధృతినీటకలిపినది. ... ౧ డ్రా॥

ఖురాసానివాామం అరఖు. ... ... ౧॥ వకటిన్నర డ్రామ్.

క్వాషియా చేకట్ల-కషాయము. ... ౬ ఔ॥ కలిపి ౧ ఔ॥

చొప్పున రోజుకు మూడు పర్యాయములు యివ్వవలెను. — —

అమోనియా సెస్క్వకార్బోనెట్. ... ౧ డ్రా॥

ఫెర్రైఅమోనియా సైట్రస్- ... ౨ డ్రా॥

ఖురాసాని వామపు అరఖు, ... ౨ డ్రా॥

క్వాసియా కషాయము.... ... ౧౨ ఔ॥ కలిపి రెా

జుకు మూడు పర్యాయములు యివ్వవలెను. — — —

వెలిరియనేటుజింకు. ... ... ౧ గ్రే॥

గుల్ ఖండ్.... ... మాత్ర కట్టుటకు సరిపడ్డంత

వేసి రోజుకు మూడు పర్యాయములు నివ్వవలెను. ఈ మందు హిస్టిరి యాలోను న్యూరాలిజియాలోను కూడి నివ్వనగును. వెలిరియనేటుక్వై నను, స్టీలుతోగూడా నివ్వవచ్చును. — — —

జింసైనస్ఫేటిస్.... ... ౧ గ్రే
జెవ్లసుమెక్సాగ్రిక్టు.... ... ౪ గ్రేనులు కలిపి-

మాత్రలుజేసి రోజుకు మూడు పర్యాయములివ్వవలెను. ఈ పైనిచెప్పి న మందులు సమయమునుబట్టి రోగియొక్క స్థితినిబట్టి యవి జేయునట్టి గుణములనుబట్టి ప్రయోగింపవలెను. — — —

(Tetanus) టెటినస్సు అనగాజన్ని, ధనుర్వాతము.

ఇది ట్రామేటిక్కని, ఇడియోపేతిక్కని, రెండు విధములు.

౧ ట్రామేటిక్కు జన్నిగాయ, ఘాతలవల్లను కలుగుచున్నది.

౨ ఇడియోపేతిక్కు జన్ని హేతువ తెలియకుండా నింపాదిగా-వచ్చును. ఈ రోగమొక్కొక్క భాగమునందు అవహించునపుడొక్కొక్క పేరు పెట్టబడును. దవడకుపట్టుకొని దవడలు దగ్గిరపడినపుడు, లాకుజాఅని స్నీ, ట్రిస్మనస్ అనన్ని పేరు. శరీరము వెనకకు వంచబడినపుడు ధనుర్వాత మనిన్ని, శరీరము ముందుకు వంచబడినపుడు ప్రక్కకు వంచబడినపుడున్ను వేరు వేరు పేరులుగలవు. జన్ని శరీరమునకొంత భాగమును పట్టినపుడుట్రి స్మనస్ బహుసాధారణముగా గలుగుచున్నది. ప్రక్కకువంచుట తరుచుగా కలుగదు. — — — — —

గుణములు— మెడయందున్ను, గెడ్డములవద్దనున్ను, బెట్టుగానుండుట, గుటక వేయుట కనవకాశము నాభికి దిన్నగా వక్షమునకు దిగువను-నొప్పిగలిగి వెన్నులోకి పాదుచుచుండును. ఇందుచేత డయాఫ్రంఅనుమాంసము రోగముచే పీడింపబడుచున్నటుల దెలియుచున్నది. మెడయందుండు మాంసపుఖండలు లాక్కొనిపోవుచు దవడలు కలుచుకొని పోవును. అన్ని మాంసపుకండలు బెట్టుగానున్నూ, లాక్కొనిపోవుచుండును. గర్భము కఱ్ఱ చెక్కవలె గట్టిగానుండును. సర్వదా యీలాగు లాక్కొనిపోవుటచే విస్తారపు నొప్పి కలిగియుండును. కొంచము కదులుటచె విస్తరించుచుండును. ౧౦-౧౫ నిముషములకు శమించుచుండునుగాని, బెట్టువీడదలకుండును. నాడి వేగముగానున్ను కొంతసేపు చెలనములేకుండాపుం

దేహము శాకగాను, ముచ్చెమటలచె నింపబడినదిగానుండును. శ్వా
స్వరగానుండి డయాఫ్రము యొక్క యెక్కుచె మధ్యమధ్య నాడు
నుచుండును. తెలివికలిగియుండును. ఇతరుల రోగివద్దకు వెళ్ళుటచె బి
గింపు యెక్కువగుచుండును. రోగము ప్రబలముగానున్నపుడు రోగికి
లవలేకుండును. కండలు లాక్కొనిపోవు టెక్కువగును. ఊపిరి బహుత్వర
గానుండును. కొంతస్వల్పకాలము లేకుండును. ఊపిరి తిరగక పోవుట క
లుగును. అప్పటిలో నాడి కానరాకుండి మిక్కిలి శ్రమపడుటచేత మూ
ర్ఛనుపొందిగాని, యూపిరిరాకగాని, రోగిమృతినొందును — —

నిధానించుట— వెఱ్ఱికుక్క కాటువల్ల కలుగు హైడ్రోఫోబియా
నుంచి మతితప్పకపోవుటచేతనున్ను, నీళ్ళుచప్పుడైతే భయము లేకుండుట
చేతనున్ను, శరీరమందెక్కు సర్వదా కలిగియుండుటచేతనున్ను పోల్చన
గును. వెన్నుమూలువు యొక్క యింఫ్లమేషనునుంచి గాఢమైన జ్వరము
లేకుండుటచేతనున్ను, కాళ్ళుపడిపోకుండుటచేతనున్ను, గ్రహించనగును.

సాధ్యాసాధ్యము— ట్రామాటిక్, జన్ని అసాధ్యము, ఇడియో
పాతిక్కు జన్ని సాధ్యము — నిద్రపట్టుట, ఎక్కుతగ్గుట, ఇందు మంచి
గుణములు.— — — — — —

హేతువులు—ఆధార హేతువు- బాల్యము, మొగవాండ్రు, శీ
తోష్ణదేశములు, ఉద్రేకములు, చలవ, ఇవక, అలసట, గాయములు, నరము
లకు (టెండనులు) అనగా మాంసపుఖండలకు చివరనుండు తేపువంటి జి
గివమైన పదార్థముకు దెబ్బకలుగుట స్ట్రిక్నియా ఎక్కువిచ్చుటచె నీరో
గము యెక్కువను కలుగజేయుచున్నది.— చలిఘాలి మొడకు తగులుటచె
కలుగును.— — — — —

చికిత్స—ట్రామేటిక్ జన్నియందు శరీరమును మెత్తబెట్టునట్టిస్ని
గ్ధకము జేయు పదార్థములు, దెబ్బతగిలిన భాగముపై యెక్కించవలె
ను. నరముగాని, టెండనుగాని, ఎక్కుమీరుండునేని, వాటినికోసి బిగిత
గించెది. కండలు లాక్కుపోవడము కనబడిన తరువాత సేవన జేయకూడ
దు. రెండు విధములైన జన్నికిన్ని యొక్కటే ఔషధచికిత్సగానున్నది.

విశేషముగా విరోచనములు చేయించుట, కేలమెలు, సీసనేపాళపుచము రు, విరోచనములుచేసే పిచ్చికారీ, నల్లమందు, గంజాయితో చేసిన మం దులు తరుచుగా యిచ్చుట, యివి గొప్ప మోతాదులిచ్చునది. క్లోరిఫారమ్ వాసనచూపించుటచే శరీరము లాక్కొనిపోవుటయున్న నొప్పిన్ని శాంతిం చును. సత్తువను చేయుమాంసపు కషాయముల పాయువు వెంబడి ప్ర యోగించవలెను. మంచుగెడ్డ వెన్నుపైకట్టుటచే కొందరికి గుణమిచ్చును. ఈ రోగమందు మైకమును కలుగచేసే మందులు మిక్కిలి యుపయోగిం చును. అనుభవముచే యిందుల మోతాదుకంటే అధికముగా నివ్వనగును కంచెరు బెలడోనా బహూపయోగముగానున్నది. 1/16 గ్రేను మొదలు కుని ॥ అర గ్రేను వఱకు, ఎక్ట్స్రాక్టు ఆఫ్ కెలబారుబీన్ యిచ్చుటచేలాక్కొ నిపోవుట తగ్గును. రోగి యౌషధము మింగుటకు శక్తికలిగియుండెనేని ర- మొదలు ౭ డ్రాములవఱకు నాలుగేసి ఘంటలకు ఒకపర్యాయము,సక్క స్సుకోనియం యిచ్చేది, మింగుట కవకాశము లేనపుడపాయువు వెంబడి మందెక్కించవలెను. సారాయికూడా నిషా కలుగచేసేవరకివ్వవచ్చును, పొక్కుపలాస్త్రి వెన్నుకువేయుట, ఎలక్ట్రిసీటి, నోరు తెఱవక పోయినపు డు వంగునట్టి గొట్టము ముక్కురంధ్రము వెంబడి లోపలికి పోనిచ్చి అందు గుండా హారముగాని, మందుగాని లోపలకి పోవునటుల పిచ్చికారీచేసేది, ఇందుకు ప్రత్యేకము గొట్టములు నియమింపబడియున్నవి. రోగిని బహు నె మ్మదిగానుంచి అప్పుడపుడు వైనుమొదలగునవి యివ్వనగును. నెం॥ ౧౧౦ యిచ్చేది— — — — — — —

---

## ఇన్ఫేన్టైల్ టెటినస్ అనగా చిన్నవారలందు గలుగజన్ని.

## Infantile Tetanus.

గుణములు— పుట్టిన తరువాతను రెండుమూడు వారములకు దవడ మాంసమందు ముందు జన్ని యెక్కుకనబడి శరీరమంతయు వ్యాపించి త్వర గా ప్రాణమునంతపుచ్చును.— — — — — —

చికిత్స— వెంటనే సులభముగా విరోచనమునకిచ్చి వేడినీళ్ళ స్నా నము జేయించవలెను. పిల్లయొక్క హారము తల్లిపాలుగా నుండవలెను

బాగా గాలి నడుచుచుండెడి స్థలములో నుంచవలెను. ఆముదమే విరోచనము నకు యిచ్చేది. నెం॥ ౧౦౭ యిచ్చేది. — — — —

## హైడ్రోఫోబియా అనగా, వెఱ్ఱికుక్క కాటువలన కలుగు వెఱ్ఱి.

## Hydrophobia.

గుణములు—వెఱ్ఱికుక్క కఱచిన నాలుగైదు దినములు మొదలు ఆరే నిమిది వారముల తరువాత కఱచినట్టి కాటు పచ్చిచేసి శరీరము నందనేక భాగములకు వ్యాపించు నొప్పికలిగి యెటుమీదట మాటలు వినిపించకపోవుట, మైకము కలిగియుండుట విశేష విచారముగనుండుట, నిద్రనుండి కలలో భీతినొంది లేచుట, ద్రవపదార్థములకు భీతికలుగుట, గొంతుక యొక్క మాంసపుకండలు బిగింపబడును. ప్రలాపము కలిగియుండును. ముఖమునం దాశ గలిగుండును. విదాహము కలిగినను, ద్రవపదార్థము పుచ్చుకొనుటకు భయపడుచుండును. వెలుగునుగాని, ధ్వనినిగాని, సహించకుండును. శరీరము వేడిగాను, పొడిగాను, రోగియలసటచె మృతినొందువఱకు విశ్రాంతిలేకుండును. నిద్రలేమి, మాంసపుకండలు బిగించుకొనిపోయి లాక్కొనుట కలిగియుండును. కొందరియందు రోగి, మృతిబొందక మునుపు నుంచి కుక్కమొఱుగునటుల మొఱుగుచుండును. — — —

సాధ్యాసాధ్యము—హానిని కలుగజేయుట తరుచు. — —

హేతువులు—వెఱ్ఱికుక్క కఱచినతరువాత కుక్కపంటియందుండు విషము శరీరమునకు వ్యాపించుటచే నీరోగము కలుగుచున్నది. —

చికిత్స—ముఖ్యముగా రోగము రాకుండా కాపాడవలెను. ఇందుకు కత్తిలో కోయుటచేతనున్ను, కాష్టికులు, శంఖద్రావకము, వెండి కాష్టికు మొదలగువాటిని కఱచినచోటుకు రాయుటచేగాని, కప్పింగను-గాజుసోలవేయుట చేతనుగాని, సాధనములు లేనపుడు నోటితో పీల్చుటచేగాని, విషము దేహమునకు వ్యాపించకుండునటుల జేయునగును. రోగము కనుపించిన తరువాత పుట్టినగుణములను మాత్రము సాధనముచే శాంతపజేయువచ్చును. గొంతుకు యందుండు బాధ మంచుగడ్డమింగించుట యిచ్చేది. — —

౨. నిషా జేయుమందులు చేతనున్ను, క్లోరిఫారమ్ వాసనచూచుటచేత నున్ను, నరములందుండు తీవ్రమునణచనగును.— — — —

౩. అపానము వెంబడి హోరమిచ్చుటజేతనున్ను, ద్రవపదార్థములుగాని, వస్తువులను సాధ్యమగునెడల భుజించుటకిచ్చుజేతనున్ను, నీరసమునొందకుండునటుల జేయవలెను. — — — — —

డెలీరియంట్రీమెన్సు- అనగా, త్రాగుటచె మతితప్పుట.

Delerium Tremens.

**గుణములు**—విశ్రాంతి, నిద్ర లేకుండుటయు, చేతులున్ను, సాధారణముగా దేహమందుండు మాంసపుకండలు వణుకుచుండును. ఈవణుకు నునిలుపుటకు రోగియత్నించునెడ విస్తరించును. మతిలేని మాటలు, అనేక మాటలు విన్నట్లు అనేకవస్తువులు చూచినట్లు, పగవారలు తన్నుముట్టడించినట్లు, వారినుంచి తాను తప్పించుకొనుటకు ప్రయత్నముజేయునట్లు భ్రమకలిగియుండును. విశేషప్రలాపము, అస్తమానం నడచుట, గదిలో ఏదో యొక వస్తువను గాని, మనిష్యునిగాని, వెతుకుచున్నట్లుగానుండును. శరీరము చల్లగానున్ను, చమటచె కప్పబడియుండును. నాలుకయందు తడిగలిగి కొంచము పత్సుదనము వొణుకు కలిగియుండును. నాడి సూక్ష్మముగానున్ను, త్వరగాను, నొక్కి-తే నణచబడు నట్టిదిగానుండును. రోగమెక్కువైనకొలదీ దేహమునకు చెమపును కలుగజేయుచున్నది.— — —

నిధానించుట— శరీరమొణుకు, చల్లదనము, ప్రలాపము, రోగి-యొక్క-పూర్వస్థితి భోగట్టా రోగమును తెలియజేయుచున్నది.— —

సాధ్యాసాధ్యము—విశేషము నిస్త్రాణను పొందునెడల నిబ్బంజేయును. నిద్రగలుగుట, మత్తుమందులచె నిద్రకలుగుట మంచి గుణములు కంపమెక్కువగుట, నిద్రలేకుండుట, విశేషవిరోచనములు, వాంతులు గలుగుట, నాలుక పొడియామ్బ్కొని గోధుమరంగుగలిగియుండుట, దుర్గుణములు, రోగము మెదడునందుండు గమలయందుగాని, మెదడుపొరమీద గాని, పుట్టినీరు జేరుటచేతనున్ను మెదడుపొరయందు విస్తారముర క్తము నిలుచుటచేతనున్ను కలుగుచున్నది. మెదటియందు గమలలోపల పుట్టినీరు

జేరినపుడు పొరాయి దానియందు కనుగొనబడును.— — —

హేతువులు— ఆధారహేతువు- అలవాటుగా పొరాయి. నల్లమందు, గంజాయి, వగైరాలు వాడుక జేయుటచేతను నరములయందుబలము తగ్గడము విస్తారముగా చదువుట, మొదలగునవి. ఉద్రేకములు, అప్పుడపుడు విస్తారముగా త్రాగుట, అలవాటైన కాకవస్తువును మానుట, రక్తముపోవుట, విస్తారముగా విరోచనములగుటకు సాధనము జేయుట, గొప్పగాయ ఘాతలు పొందినపుడు కలుగుమూర్ఛ.— — —

చికిత్స—ఇందుమూడుపనులు జేయవలెను. అనగా దేహబలము పోకుండా కాపాడుట, నిద్రనువచ్చించుట, ఇంప్లమేషనుపోగొట్టుట, వైనో, బ్రాంది, గంజి, కొన్నిమాంసములయొక్క సారము పత్యముపెట్టించుటచె బలము చెడదు. నల్లమందు, గంజాయి, క్లోరిఫారం వాసనచూచుట, మార్ఫియా మొదలగువాటిని గుణములు నిలుచుటకు తరుచుగా నివ్వనగును. ఒక్కదినములో మూడవున్సుల నల్లమందరఖుయిచ్చినను దానిగుణమును, కనపరచనట్టి దృష్టాంతములుగలవు. రసభస్మమునైడు కాలిమెలు టార్ ఎమిటిక్, నల్లమందు, పొక్కుమందులు వీటిచె యింప్లమేషను పోగొట్టవలెను. విరోచన సాధనములుగాని రక్తము తీయుసాధనములు గాని జేయకూడదు. నెం॥ ౧౧౧ యిచ్చేది.— — —

---

బెరిబెర్రీ. ఉబ్బు. Beri Beri.

స్వరూపనిరూపణము— ఊపిరి తీయుటకు ప్రయాసము, నీరసము, తిమ్మెర, కాళ్ళుగట్టిగానుండి పడిపోవడము, శరీరమందంతట వాపు- గల రోగమునకు బెరిబెర్రీ యనబడును.— — —

గుణములు— ఒకానొకపుడధాత్తుగా కూడా ఈరోగము కలుగుచున్నది. రోగము కనబడుటకు ముందు రోగి రోజాకే సేవని జేయలేకుండును. నొప్పి, తిమ్మెర, మాంసపు కండలయందు బిగింపు, కాళ్ళు- జేతులుపొంగు, వీశేషము నిస్సత్తువ, ఎగయూపిరి, గుండెలయందు వణ్కును. భారముండును, ముఖముపొంగి పాలియుండును. ఊపిరి తిరగకపోవ

డ మెక్కువైనకొలది పెదవులునల్లబడును. కాళ్ళుపడిపోవును వాంతి తగు చుగాకలిగి ఇబ్బందిపరుచుచుండును. ఊపిరి ఇబ్బందిచే పగుండుటకు అనవకాశముగానుండును. నాడి దుర్బలముగానున్ను కొంతసేపు నిలిచిపోవుచు నుండును. శరీరము చల్లగాగాని స్వాభావికమైన కాకగానుండి పొడిగా నుండును. మూత్రము క్వచిత్తుగాను విశేషము రంగుగానుండును. గుండెయందు భారమున్ను ఊపిరి తిరగకపోవడ మెక్కువైనకొలది నాడిక్షీణించును. కాళ్ళు చేతులు చలవనుగమ్మును ఊపిరితిరగక గాని, కాళ్ళు చేతులులాకొఱనుటచే, కొట్టుకొనిగాని, రోగి ప్రాణమును విడుచును. —

నిధానించుట— ఊపిరితిరగకపోవుట, కాళ్ళుపడుట, అధిక నీరసము, ఒడలువాపు, శోభించినముఖము కలిగినపుడు బెరిబెర్రీయని పోల్చనగును. కొందరిది యొకతరహా యొడలువాపని మఱికొందరు నరముల సంబంధమగు జాడ్యమని యెంచుదురు. — — —

సాధ్యాసాధ్యము— తరుచుగా నసాధ్యము.

హేతువులు— ఆధార హేతువు— సత్తువలేయని భోజనముచేయుటచేతనున్ను అశుభ్ర వాయువచేతనున్ను యువకప్రదేశమందలి గాలి చాలాకాలము దేహమునకు పట్టించుటచేతనున్ను కొన్ని స్థలములం మనికిచేతనున్ను శరీరబలము చెడుటచేత నీరోగము కలుగును. సింహళద్వీపములోని కొన్నిప్రదేశములందున్ను గంజాము, శ్రీకాకుళము, రాజమహేంద్రవరపు జిల్లాలయందు సముద్రమునకు కొన్ని మైళ్ళ లోపువరకీ రోగము కలుగుచున్నది. — — — — —

ఉద్రేకములు— విషవాయువు.

చికిత్స— కాకమందులు, వైను, బ్రాంది, జిన్ను, అమోనియా, సత్తువనిచ్చే ద్రవపదార్థముల నివ్వవలెను. కాకమీదను అల్పాచమాన మధికము చేయుమందులు, స్ప్విల్లు, జిన్నువంచి, టర్పెంటైలు, మొదలగునవి యివ్వవలెను. శరీరమునందు చేరిన నీరును హరించుటకు ఝూడించి విరోచనములగుటకు గేంబోజి, ఎలిటేరియం, జాలపు, మొదలగునవి యివ్వవలెను. వెచ్చనినీళ్ళస్నానము కాకతైలములమర్ధనా విరోచనములు చేయుపిచ్చ

కారీ చాతీకిపోక్కు మందులు, కాకచేసి కఫమును తెగ్గొట్టేమందులు మొదలగునవి యప్పుడుండు గుణములకొలది నివ్వనగును. మాలకంకిణీఅరఖునెడి బ్లాకాయిలు తమలపాకుతో రోజుకు మూడుపర్యాయము లిచ్చుటచేతకుదురుచున్నదిగాని ఈ మందిచ్చునపుడు కఠినమగు పథ్యము చేయించవలెను.

నెం॥ ౬౦ యిచ్చేది — — — —

---

(Rheumatism) రుమేటిజం అనగా మేహవాతనొప్పులు.

తరుణమని, పురాణమని, రెండువిధములు నయమునందుండు రెండవలన వాటియందుగలుగునపుడు లంబేగోయని వాడుకొందురు అనగా. నడుమునొప్పి, — — — — —

—* తరుణవాతనొప్పులు. *—

గుణములు— చలిగాలితగిలి రొంపగలుగును అటుపైని జ్వరము కలుగును. అప్పుడువిశేషనొప్పి, ఎరుపు, వాపున్ను పెద్దకీళ్ళయందుకలుగును. ఆలాగు బాధనొందుతున్న కీలుమీద నొక్కుటచేతగాని ఆకీలు కదులుచుటచేతగాని నొప్పెక్కువగును. రాత్రిభాగమందు బాధధికమగును. విశ్రాంతిలేకుండుట, దాహము, తీక్ష్ణజ్వరము, విశేషచమట, ధాతువు మెత్తగాను నిండుగానుండుట, నాలుక కొంచెము పచ్చనగు మలినముతో దట్టముగా పూయబడియుండుట, విరోచనబద్ధము, ఆకలిలేకుండుట, కొన్ని దినములైనతరువాతను ఆకీళ్ళను వదిలి వేరేకీళ్ళనుపట్టుకొనును. కొందరియందు కీళ్ళయందు శాంతించి గుండెను, మెదడును, కప్పుకొను పొరయందు ప్రవేశించును. మొదటబాధనొందిన కీళ్ళయందీలాగు కలుగగానే బాధ శాంతించును. గుండెయందీరోగము ప్రవేశించినవెంటనే ఊపిరి తిరగకపోవుట, గుండెభారము, దడ, గుండెలలోనొప్పి, నాడియందు వేగముగలిగి గుండెరోగమందుండితరగుణములు గలిగుండును. ఈరోగము నిమ్మళించుట, పురాణించుట, కీళ్ళువంగకపోవుటచే నడచుటకసాధ్యముగా జేయుడము గుండెకాయను, మెదడును కప్పుపొరలందు ప్రవేశించి వ్యాధి కలుగజేయుడము గలదు. కాక ౧౧౪ వఱకు జ్వరములోనుండును. — —

హేతువులు— ఆధార హేతువు— వయఃకాలము, బలము చెయ్యుటకు తిండిచె కలుగు బలహీనత— — — —

ఉద్రేకములు— చలిగాలికి బయలగుట, అడ్డులేనిచోటను రాత్రి పరుండుట, ఒకపర్యాయము బాధకలిగినతరువాత స్వల్ప హేతువులచె తిరుగా కానబడును. ఈ వ్యాధిలో రక్తమున, లేక్టికేసిడ్ అను పులుసుండుటచె నీరోగము కలుగునని కొందరు వాడుకొందురు. మఱి కొందరు- ఫైబ్రీను విస్తారమగుటచె పుట్టునని వూహించుచున్నారు. — —

నిధానించుట— సైనోవియల్ రూమిటిజమ్ అనునొప్పులందు కీలులు విస్తారముగా వాచిగాని, చెమటలుగాని, తీక్ష్ణమైనజ్వరముగానుండదు. తరుణనొప్పులందు శరీరమందితరగుణములు కలిగియుండును పురాణమందు కీలుయందేవుండును. దెబ్బలు పచ్చిజేసినపుడు నొక్కితే పుండులాగుండును. గౌటున్ను, రూమేటిజమున్ను, ఈదిగువను చెప్పబడిన గుణములచె భేదించనగును. రూమేటిజమ్ పెద్దకీళ్ళను క్రమముగాను గౌటు చిన్నకీళ్ళను అధాత్తుగా కలుగును. రూమేటిజమ్ సత్తువ తిండిలేనివయస్సులయందు కలుగును. గౌటు పెద్దవారలందున్ను సౌఖ్యముగా తిను వారిలందు గలుగుచున్నది. గౌటులో జ్వరమున్ను చెమటలుండవు. రూమేటిజమ్ యందుండును మేటిజమ్, ఒకకీలునుండి మరొక కీలునకు దుముకును. గౌటుఒకకీలునందేవుండి గుండెకుగాని, మెదడుకుగాని, వ్యాపించుటకును.

సాధ్యాసాధ్యము—గుండెను, కంటికి, మెదడుకు బట్టుకొనుటకు గుణములు, ఈ రోగము తర్చుగా హానిజేయునదిగాదు. ఈ రోగమందుండు నొప్పులు, చీముపట్టుట కుళ్ళుట, సన్నిపాత జ్వరముగాని, కలిగి- యుండదు.— — — — —

చికిత్స—ఇందుజేయు సాధనములనేకములుగా నుండుటచె వాటి నన్నిటిని నిక్కడ తెలియజేయుట కనవకాశముగానున్నది. బైకార్బొనేటు ఆఫ్ పొటాషు ౩౦ గ్రేనుల మోతాదుచొప్పున జేము కషాయమును పానము జేసి రోజుకు మూడు నాల్గు పర్యాయములు యివ్వవలెను. చన్నీళ్ళతో కలిపి యిచ్చుటకూడా వాడుకగానున్నది. ఈ సాధనమే ముఖ్యముగా

ళున్నది. క్లోరేటు. బైటార్ట్రేటు, నైట్రేటు, యాసిటేట్, అఫ్ పొటాషు లు నొప్పుల కుపయోగింప బడుచున్నవి. నిమ్మపండు రసము ౧ ఔన్సు మోతాదు జేసి రోజుకు మూడు పర్యాయములిచ్చేది. —

క్వైనను యిచ్చిన తరువాత రక్తము శరీరమునుంచి తీయుటచే వి రోపియను లయందు కలుగునట్టి తరుణవాతనొప్పులు కుదురును. కార్బికము సులభవిరేచన మందులు. వేడినీళ్ళస్నానము, డోవర్సు పౌడరు మొదలగునవి యుపసాధనములుగా వాడుకొబడును. ఎట్టిచికిత్స జేసినను దాని వుద్రేకమును చూపనదీ రోగము మళ్ళను. — —

పైసాధనములు—జలగలు, కాపడము స్పంజియోపిలస్ అనునది చన్నీళ్ళలోగాని, వేడినీళ్ళలోగాని, నానబెట్టి కీలుకుచుట్టి అటుపైని గుడ్డ చుట్టవలెను. ఆవపిండి ముద్ద, పొక్కు పలాస్త్రులు, కాకజేయు తైలములు, టించెరు అయిడీనుయను ద్రావకము మొదలగునవి. జ్వరముతో నొప్పులుండినేని, F నెం॥ ౧- ౨౨- ౭౬ యిచ్చేది. — — —

## పురాణముగు వాతనొప్పులు. Chronic Rheumatism.

తరుణము ముదిరి పురాణముగుటయే గాక—యీ దేశవాసులగు కారలందు ప్రత్యేకము కలుగుచున్నది. ఈలాగు సంభవించునపుడు యేకీలునందు నొప్పికలిగితే దానియందే తప్ప మరియొక కీలుకు వ్యాపించదు జ్వరము స్వల్పముగానుండును నొప్పితక్కువగానుండును. కీలుమిక్కిలీ బాచుటయే గాక—కీలు వంగక పోవుట, కీలుయందు పటుత్వము తప్పుట కలిగియుండును.— — — — —

చికిత్స— లోపలకి జేయు సాధనము కంటె పైకి ముఖ్యము తిర్చుగా జలగలు పట్టించుట, పొక్కు మందులు వేయుట, ఆవపిండిముద్ద పట్టించుట మొదలగు పైసాధనములున్ను సుఖసంబంధమగు జబ్బుదేహమున కలిగియుండెనేని, సుగంధ్యాది కషాయముతో ప్లమ్మర్సు మాత్రలిచ్చుట చేతనున్ను డోవర్సుపౌడరు, పొటాసీయిడను, మొదలగునవిన్ని విస్తారకాలముండిన రోగమందు ఎలక్ట్రిసిటీ, సాధనము చేసేది. కీలునందు కాకి

లేనపుడు టంచెరు అయిడను, ప్రాయుటచె వాపుతేయును. చన్నీళ్ళరో జూను మూడునాళ్లుపర్యాయములు ధారకట్టి బాధనొందుతున్న కీలుమీద పోయుటచె మంచిగుణముచేయుచున్నది. మాంసకండలందు వాతనొప్పి కలుగునపుడు చాలాసేపు వొత్తుకొనుటచే నొప్పియెక్కువగుచున్నది. కాని గాని, పరుండునట్టి మంచవుకాకగాని, నొప్పి నభివృద్ధి జేయునపుడుతరుణ నొప్పులనవలెనున్ను కాక చేత నొప్పి యుపశమించునపుడు పురాణించిన ట్టి వాతనొప్పులను వలెను చికిత్స చేయువలెను, తరుణవాత నొప్పులన్నింట యందును కాలక్షింపమునందు పనిజేయునట్టి మందులనున్ను, విరోచనసా ధనములున్ను, చేయవలెను. ఇందుకు గ్రాన్ జౌండాఫిలంలో చేయు మాత్రలిచ్చిపుడదయము సెట్లడ్జిపౌడరుగాని, వుప్పుగాని, యివ్వవలెను విశేష విరోచనములు కూడవు. విస్తారపునొప్పి కలిగియుండినేని వుప్పులతో వైక రుఓపియై, సెడటైవను అనునల్లమందరఖు యివ్వనగును. లేనియెడల మోర్ఫియ, శరీరముయొక్క చర్మముగుండా పిచ్చికారిచేయవలెను. తరుణ నొప్పులు పోతున్నపుడు సురాకారము ౨౦ గ్రేనులమోతాదిచ్చుటచె గుణమిచ్చును. రోగిని చలిగాలిలో వెళ్ళకుండ నుంచవలెను. తరుణనొప్పులందు గింతుభోజనమివ్వకూడదు. — — — —

పురాణనొప్పులు—పొటాసీఐడరు ప్రత్యేకముగాగాని, వైకఅంటుమోనీతో కలిపిగానిచ్చుటచేతను నివారణనగును. కీళ్ళందు నొప్పి విస్తారముగానున్నపుడు- బెలడోనాతో క్లోరిఫారంతైలముగాని, నాభితైలముగాని, మర్ధనా చేయుటచె శాంతించును. రోగి ఫ్లానుగుడ్డ శరీరముపై కప్పుకొని యుండవలెను. భోజనపధార్థములందు రోగిబహుజాగ్రత్తగా నుండవలెను. స్వల్పపత్యములు రోగమును తిరుగబడుచేచున్నవి నెం॥ ౨౨- ౩౮- ౩౪- ౪౦- ౪౨- ౭౪ యిచ్చేవి. — — —

ఈ రోగమందు ముంతగుండె జబ్బునొందినేని చాతీపైని గుండె యొక్క స్థానమున పొక్కు మందు, కప్పెంగువేయవలెను. లోపు కపుడు గ్లేల్ మెలు నల్లమందు కలిపివ్వవలెను. — — —

ధితరుచు ఉద్రేకములు చలవ, అలచట, అతివ్యాసనము, మందిభోజనము జేయు వారలకు భోజనమున సౌఖ్యత లేకుండుట. మూలవ్యాధి మొదలగు వాటివలన స్రవించు శ్రావములు కట్టుట, తరుచుగా బాగా భోజనముజే యువారలందు కలిగియున్నది గాన అజీర్ణరోగముతో కూడుంటున్నది. ఈ వ్యాధియందు దేహమంచుంచు రక్తములో, యూరికేసిడ్, యనునది విస్తారముగానుండును. — — —

చికిత్స—ఇందుమూడు పనులు జేయవలెను. — —

౧ బాధను త్వరగా తగ్గించుట. — — —

౨ ఇబ్బందిగానుండు గుణములను శాంతింపజేయుట.

౩ తిరుగా బాధ కలుగకుండజేయుట. — —

ఉప్పు, సంబధమగు సూక్ష్మవిరోచనపు మందులు, నల్లగుంటతోజేయ బడిన మందులు, కాల్చికము, బై కార్బొనేటుపోటాషు, బాధ నొందుచున్న కీలుకు స్థానంబుచుట్టుట మొదలగు సాధనములచె చికిత్స చేయనగును. హా రమునందు పథ్యముగనుండవలెను స్వల్పముగా దేహముచెపని జేయుట చేతనున్న, సముద్రపునీటి స్నానముజేయుట చేతనున్న, పులుపును విరు చునీళ్లు వాడుకజేయుట చేతన్ను కేసార్బొరిలాకషాయమైనా అరక్షైనాపా టాషుతోగాని, సోడాతోగాని, లేక మోనియాతోగాని, నిచ్చుట చేతను న్న తిరుగా రోగము రాకుండనటుల జేయనగును. జీర్ణకోశమునకీ వ్యా ధి వ్యాపించునపుడు బ్రాందీ, యీతరు, అమోనియా, వైను మొదలగు శాకచేయు మందులివ్వనగును. నొప్పిశగ్గినకీలుకు ఆవముద్దపట్టించుటచె జీ ర్ణకోశమునకు పోయిన నెప్పితిరుగా కీలుకుజేరును. దేహములోనితరా వయవములకు యీరాగు కలుగునపుడిట్టి సాధనము జేయునగును.— నెం॥ ౨౨, ౩౫- ౩౬- ౩౮, ౫౩- ౫౮- యివ్వేది. — —

## ఎరిసిపిలస్. ఉబ్బుసపిస్. (Erysipelas)

చెర్మమందు కలిగెడొక తరహా దుష్టముంపల్లమేషనై పుట్టినచో టనుంచి చుట్టూవ్యాపించి- మెదడు, వెన్నుమూలుగు మొదలను దేహ

ములోనితరావయవములు పైని శాంతించు వేగమే బాధించునట్టిదైయున్న ది. ఇది దేహజమని, ఘాతజమని, రెండువిధములు, మొదటివిధమున సిర న్పుయొక్క చర్మమునందు సాధారణముగా కలుగుచున్నది. రెండవది దెబ్బగలిగిన స్థానమందెక్కడైన కలుగును. — — —

**గుణములు**—చలి, తనకాక, ఓకరింపు, వాంతి, మలినముగల నాలుక, వేగముగానుండి నింపైన నాడిగల జ్వరలక్షణములు, కొందరియందు ప్రలాపముకొన్ని ఘంటలు కలిగుండి మిక్కిలి యెఱ్ఱనగు మచ్చచర్మనందు కలిగిదానిచుట్టూ పోకచెక్క రంగుగల పరివేష్టము కలిగుండును. ఈ పరివేష్టము త్వరగా వ్యాపించును. దానంచు శరీరముకంటుయుకుగా నుండును. విశేషవాపు, వేడిమి, కలిగుండును, ఎఱ్ఱదనము చుట్టు వ్యాపించినకొద్దీ మొదటగానబడిన మధ్యభాగమందలి రక్తిమ తగ్గిపైని పార లాగు చర్మము రాలిపోవును. లేనియెడల ఆచోట చిన్నపచ్చని పొక్కులు కలిగి త్వరగా బద్దలైరసిగా రెండిపోను. ఎరుపు గనబడిన తరువాతగాని అది వ్యాపించునపుడుగాని, జ్వరము తగ్గియుండదు. ఇంకా శరీరతత్వము నుబట్టి సన్నిపాతజ్వర లక్షణములు గలుగును. రోగము వ్యాపించుట మానినపుడు జ్వరమువదిలి శరీరము పొడిగానుండును. ఈ రోగమయిదు విధములచె నంత్యమగును.— — — —

౧ నిమ్మళించిన చర్మపు పార వూడిపోవును.— —

౨ నిమ్మళించునపుడు పొక్కులుపుట్టును. — —

౩ చీము పట్టుటగాని, కుళ్ళుటగాని, కలుగును. — —

౪ మెదడుకుగాని, మెదడును కప్పు పొరలకుగాని, యిన్ఫ్లమేషను పట్టుకొనును. — — —

౫ జీర్ణకోశమును, ఊపిరి తిత్తులను, లోపలను కప్పియుండు న్పుదువగు పొరను పచ్చి చేయును. — — —

నిధానించుట—ఎఱ్ఱదనము గుండ్రగానుండి శరీరముకంటె నుబుకుగానుండుటచేతను అడ్డువుట్టినుంచిన్నీ ప్రథమమందు రొంప మొదలగు శైత్యగుణములు లేమిచే వేపపువ్వునుంచిన్నీ కనుక్కొననగును.— —

**సాధ్యాసాధ్యము** — రోగులందు కలుగనపుడున్ను, ఉష్ణమేహము విశేషతీవ్రముగా గాని, సన్నిపాత లక్షణములతో గాని, కూడనపుడు సాధ్యము.— — — — —

దుర్గుణము — నీరసమునొందిన వారియందు కలుగునపుడున్ను, సన్నిపాతజ్వరము కలుగునపుడున్ను, మెదడుకున్ను, దానిపొరకున్ను, లేక శిరములోనుండితరవయవములను కప్పుపొరలకున్ను, యీ ఉష్ణమేహము చేరునపుడున్ను, సిరస్సున పుట్టినపుడు మెదడుకు చేరుట తర్చుగానుండుట చేతను సిరస్సున పుట్టుటయున్ను, నోటియొక్క గొంతుకయొక్క మృదువగు లోపలి పొర ఈ వ్యాధినొందనపుడు, పేగులకున్ను, శ్వాసకోశమునకున్ను, వ్యాపించుటచె హానిచేయును గనుక వాటిదగ్గర పుట్టునపుడున్ను యిబ్బందిచేయును.— — — — —

హేతువులు — ఆధార హేతువు, స్థూలదేహము, విశేష నాజూకగు శరీరము, తల్లిదండ్రులయందీ వ్యాధిగలుగుట, మశూచకము గాఢమగు జ్వరము, ఒడలుపొంగు — — — —

ఉద్రేకములు — అంటుసంబంధము, కాకచలవలకు బైలగుట. మితిమించి త్రాగుట, స్రావములుకట్టుట, పేగులు కందుట. — — —

చికిత్స — ఉప్పుసంబంధమైన విరోచనపుమందులు చేతను, స్వేదమును పుట్టించు మందులు చేతను, చలవను కలుగచేయునట్టి పానపదార్థములచేతనున్ను, సులభముగా జీర్ణమగునట్టి ఉద్భిజ్యపదార్థములు పథ్యముచేతనున్ను, ఉష్ణమేహము తీవ్రముగానున్నపుడు రక్తచలనమును-తగ్గించవలెను. సన్నిపాతలక్షణములు ప్రవేశించునపుడు కాకమందులు, వైను, బ్రాందీ, అమోనియా, బారకు, క్వైనను, ఇనుము, మంచిపథ్యం మొదలగు సాధనములచే బలమును కాపాడవలెను. — —

ఈ పాదములను వేడినీళ్ళలోనుంచుట చేతనున్ను, కాళ్ళకుగాని, పాదములకుగాని, ఎరువుపోయినచోటనుగాని, ఆవముద్ద పట్టించుట చేతనున్ను, లోపలనుండు అవయవములకు ఉష్ణమేహము కలుగకుండచే

యునుగను — — — — —

౩. ఇన్ఫ్లమేషను వ్యాపించకుండా చుట్టూ కాష్టికు రాయుటచే తను కార్ణయందుగాని కేశులందుగాని కలుగు దస్థానపు మీదను, కిందను, అవయవముచుట్టు కాష్టికు రాయవలెను నల్లమందు కాయల కషాయము తో కాపటము చల్లనైనట్టిన్ని పారాసంబంధమగు నీళ్ళు, గోధుమపిండి, బియ్యపుపిండి, అరరూటు మొదలగు గుండలు, కేలనైన, సీమసున్నము మెగ్నిషియా మొదలగునవి పైకి స్రవించునట్టి శాసిము కట్టుటకు సాధనములు విశేషముగా స్రవించుచున్నపుడు ౧౦ గ్రేనుల వెండి కోష్టికు నీళ్ళలో కలిపి పైని పూయవలెను.— — — —

పైనటించరు డిజిటేలిస్సు పూయుచు ఉక్కు అరకు ౨౦ చుక్కలు మోతాదు చొప్పున మూడుపూటల నిచ్చుటచే కొందరియందు నిరామయమును జేయును. ఇనపరఖు పైని లేపుజేయుటయు సాధనముగానున్నది. వెం॥ రా॥ యిచ్చేది.— — — —

టా్రిమాటిక్కు ఎరిసిపిలస్. (Tramatic Erysipelas.)

పోట్లు, కొట్టుకుపోవుటవల్ల కలుగును గాయములు సిరస్సుమీద కలుగునప్పుడు తరుచుగా కలుగును అప్పుడు మొదటివిధమువలెనే ఇదియును నడుచుచున్నది. చికిత్సయును దానికి వలెనే చేయవలెను. — —

స్క్రొఫ్యూలా అనగా రాజరోగము లేక, గండమాల, (Scrofula)

స్వరూపనిరూపణము — మొటిమలు శరీరమందు కలిగినిందుపొడిగా చీముపట్టి కురుపులగు వొకవిధమైన బలహీనతగానున్నది. ఈ కురుపులు గళము మొదలగు ప్రదేశములయందు స్వాభావికముగానుండు గ్రంథులయందు కలుగుచున్నది. — — — — —

గుణములు — మెడయందుండు గ్రంథులు ప్రథమత పెద్దవై కొంతకాలమైనపిదప కురుపులై పల్చని కుళ్ళు చీము స్రవించుచుండును. ఈ చీమునందు నక్షముక్కలు కలిగియుండును. ఈ కురుపులు పెద్దవిగానప్పుడు మచ్చసహితము కానరాకుండా బహుశుభ్రంపాడి మిడుగానుండును. ఇంతలో ఇతర గ్రంథు

లందు కూడా యీవ్యాధి కలిగి దేహములో కూడా బాధకలుగును. నిస్త్రా
ణ, స్వల్పజ్వరము, ఆకలిమందము, నిస్సత్తువ, శరీరము శుష్కించడము త్వ
రగాగాని, ఆలస్యముగాగాని, యేదైనా ఒకవిధమైన క్షయ కలిగి వ్యాపింపఁజేయును. దేహములో యితరజబ్బు కలుగజేయక నీవ్యాధి చాలాకా
లముండును. అనేకవత్సరములు బాధనొంది అంత్యకాలమునకు మఱియొ
క రోగము కలిగినవారు కలరు. — — — —

నిధానించుట—గ్రంథులు పెద్దవిగానుండుటచేతనున్ను, ఈ వ్యా
ధియందుండు ముఖ్యమగు చిహ్నములచే కనుకొనననగును. — —

హేతువులు—ఆధార హేతువు- వంశసంబంధము, అనగా తలిదం
డ్రులయందు ...క్షరోగము, గాని గౌటుగాని కలిగియుండుట, రాజరోగ
తత్వము కలిగి...ండుట, ఈ తత్వము తలిదండ్రులవల్లనున్ను తనంతట
నున్ను కలుగు... రాజరోగతత్వము నందుండు లక్షణములు—శరీరము
మృదువుగాను- ...గానుండును. వెంట్రుకలు స్వల్పము నేత్రములు
పెద్దలు, మీది పెదవి ...దిగానుండును. నాసలు పెద్దదిగానున్ను, వుం
డును. వక్షము ...ముగానుండి కీళ్ళు పెద్దలుండును. రక్తచలనము
మందముగానుండును. కి...లు బలహీనతగానుండును. హారమునందేమి,
హెచ్చుతక్కువ కలిగినను, అజీర్ణము, ఆకలి మందము కలుగును. కాలభండ
ము పనిచేయకుండును. విరోచన బద్ధముండును, నరములు చురుకుగానుం
డును. బుద్ధిసూక్ష్మత, ఆలోచన యెక్కువ కలిగుండును, వయఃకాలము
నకు ముందే మన్మథావస్థయందు చిత్తముండును. — — —

ఉద్రేకములు—ఆరోగ్యముగానట్టి అరుదైన భోజనము, వస్త్ర
ము. అశుభ్రవాయువు, అశుభ్రత, శుభ్రవాయువయందు సంచారములే
కుండుట, ఇవకైన స్థలమునగాని, రోగభూమినిగాని వాసము. ఉద్రేకము
లు—అనేకులయందు శైత్యము రోగము నుద్రేకించుచున్నది. —

చికిత్స—ఇందు చేయవలసినది. — —

౧ బలమునున్ను ఆరోగ్యమునన్నభివృద్ధిచేయవలెను. —

౨ ఉద్రేకకారణములను విడుచుట. — — —

౩ పైని కలుగు వాపులనణచుట. — — —

భోజనమును క్రమపఱుటచేత నన్నియు చక్కనగును, సులభమగు
జీర్ణమగు బలమిచ్చుతిండి, బీరు, పోర్టరువైను, మొదలగునవి-
యివ్వనగును. శుభ్రతి, సాగరస్నానము, ఆకలిపుట్టించే బట్టలు, సము
ద్రతీరవాసము తగునటుల గమనముకలిగి యుండవలెను. లఘువిరేచన
కారులు, పులుపు విరుచుమందులు, రక్తగుణమును మార్చునట్టిన్ని దేహ
మునకు బలమిచ్చునట్టిన్ని యౌషధములు నివ్వనగును. ఇందు చేపచమురు
విశేషవాడుక జేయబడుమందులలో నొకటిగానున్నది, ముఖ్యమగుమం
దులు. — — — — —

కారకు, క్వైనను, అయొడీను, అయొడైడాఫ్‌పొటాసియమ్. ఇ
నుములో జేయబడిన మందులు, ప్లమ్మరుమాత్రలు సుగంధికషాయముతో
షర్బ్బరము మొదలగునవియైయున్నవి, పూర్వకాలమందొక రాచవంశజుడీ
బాధనొందినవారిని ముట్టినంతట నివారించెననీ ఆంగ్లేయులలో నమ్మకం
కలిగి దీనికి రాజరోగమని అర్థమిచ్చు నామమొసగిరి. వెం॥ ౮౧ ఇచ్చెది.

---

**అమినోరియా.** (Amenorrhoea)

**ముట్టుకాకుండుట లేక ఋతుహీనము.** —

**విధములు**— రక్తతక్కువగుటచే కలుగునది, పాండువచే కలు
గునది. **గుణములు**—పాండువవలన కలుగునపుడు, ముఖముపాలినవర్ణ
ము, నిస్పృహ, ఏమాత్రము పనిజేసినను అలియుట, గుండెదడ, నడుము
లోనొప్పి, ఊపిరియందు త్వరితము, బలహీనత, కొందరియందు స్వల్ప
జ్వరము కలిగియుండును. నేత్రములచుట్టు నల్లనిరంగు గలిగి, పాదములు
పొంగి, నాడివేగము సూక్ష్మముపొంది, విరోచనబద్ధము కలిగుండును ర
క్తము ఎక్కువగుటచే కలుగు ఋతుహీనతయందు శ్వాసము పట్టుగానుండు
ముఖము గాదరించికొనియుండు, కణతలయందు ఘుంకారము, గుండె
దడ, నిండైననాడి, రక్తము విస్తారముండునపుడుండు గుణములు కలిగి
యుండును. — — — — —

**హేతువులు**—సోమారితనము, మంచిభోజనము చేయకుండుట.
మనస్సు- విషవాయువచేత కలుగు దేహబలహీనత- సీసము, రస

ము, పాషాణము, సంపాదిగా శరీరమునందు వ్యాపించుట, కొందరియం దు సుఖజాడ్యములున్ను, ఈ వ్యాధిని పుట్టించుచున్నవి. — —

సాధ్యాసాధ్యము — త్వరలో చికిత్స — జరుగు నెడలనున్ను విశేషముగా నీరసించ నపుడున్ను సాధ్యము. — — —

రక్తమెక్కు వగుటచే గలుగురోగము యెంతమాత్రము హాని కలుగజేయదు. చాలా కాలమైన తరువాతనున్ను, బలము మిక్కిలి చెడినపుడసాధ్యము. — — — — —

చికిత్స — ౧ చెడిన రక్తమును బాగుచేయుట. — —

౨ రుతుశోణితము నభివృద్ధిజేయుట. — —

ఇనుముతో జేయబడిన మందులున్ను, ఖనిజద్రవ్యములున్ను, సత్తువగు పత్యమున్ను, సముద్రస్నానము, స్వల్పముగా దేహపాటు మొదలగు సాధనములచె పైనచెప్పిన కార్యములు జేయనగును. ఈ సాధనముల జేయుటచే దేహబల మభివృద్ధిపొందినకొలది ముట్లు కానబడును. గర్భపాత్రము బాగుచేయుటకు ఖులాసాను కలుగచేయు వారిసహవాసమున్ను, సాధనముగానున్నది. కాక చేయు పైసాధనములుచె, గర్భపాత్రమును బాగుచేయుటకు తలంచుట, హానికరముగానున్నది. నాదవాహులకు చివర నుండు అండములు, లేకుండుటచే నీలావతియగు వారలందు సాధనముచేయుట నిష్ప్రయోజనము. ఈ వ్యాధియందు యితర రోగములు కలుగుట తరుచుగనుక అటుల గలిగియుండునపుడు వాటికి ననుగుణ్యమైన సాధనములు చేయనగును. ఈ రోగమందు జేయుసాధనములు, ముసాంబ్రనిశ్రమముగు విరేచనమందులు యిచ్చినపిదప. — వేడినీళ్ళు మొలునుులు మునుగునట్లు, తొట్టిలోబోసి ప్రతిరోజున కూర్చుండ నియోగించవలెను. దేహస్థితిని కనుకొనిన F నెం॥ ౧౨౦ ౧౩౦ ౧౦౮ యిచ్చేది — —

---

## డిస్మెనోరీయా అనగా గంటునొప్పి, రుతుశూల (Dysmenorrhoea)

గుణములు — నడుములోను, తొడలయందు నొప్పి కలిగియుండు నైసార్గికముపు వుండువిటె నొప్పిగానుండుట, ఈ నొప్పి హెచ్చుచుండు

. ఉండుండి వచ్చుచుండును. వాంతి, విరోచనములు, తినుట, మూ
త్రవిసర్జనయందు బాధయు, నాడి స్వాభావికముగా గాని, త్వరితముగా
పూర్ణముగానుండును. శరీరము వేడిగాను చమటకలిగి నాలుకమలిన
గాను తెల్లగానుండును. కొందరియందు శుభ్రముగానుండును. ఈకు
ష్ఠులు ఋతుశ్రావమునకు ముందున్ను ఋతుశ్రావముతోనున్ను కలిగివుం
డును. ఋతుశ్రావము తరుచుగా స్వల్పముగానుండును. కొందరియందు శరీ
రము నులుచుకొని పోవుచుండును. — — —

హేతువులు—విశేషముగా రక్తము కలిగియున్నట్టిన్ని, బహునా
జుకుగానున్నట్టి స్త్రీలయందు మనస్సుకు భీతిగాని, విచారముగాని, సం
తోషముగాని, అకస్మాత్తుగా కలుగుట, హిస్టిరియాయను రోగము, విరో
చనబద్ధము, — — — — —

సాధ్యాసాధ్యము—సాధ్యము. — — —

తగిన సాధనము చేయుటచే త్వరగా నిమ్మళించినట్టి స్త్రీలయందు
నానాకాలము చికిత్స చేయవలెను.

చికిత్స— విశేష రక్తము శరీరమందున్నపుడు యోనికి జలగలు
పట్టించి నడుముకు కప్పింగు వేయవలెను, గోరువెచ్చని నీళ్ళస్నానము చే
యించుటచే ఉపశమనము గలుగును. నల్లమందు ప్రత్యేకముగాగాని టార్టర్
ఎటిమనీ స్వల్పమోతాదులు మిశ్రమము చేసిగాని, తరుచుగానిచ్చేది.
జీర్ణకోశమునందు, పేగులయందున్ను యేవిధమైన జబ్బుచేయకుండ జా
గ్రత్తగానుండవలెను. దేహబలమును కాపాడుచుండవలెను. యోనిలో
మీదిభాగము నుడుచుకొనియుండెనేని జాగ్రత్తగా (బూజీయను) కడ్డీలో
పలికి రోజూ వుంచవలెను. ఇనపరఖు, గంజాయిరఖు, గంధకపుష్పము కలిపి
యిచ్చుటచే కొందరికి శాంతించుచున్నది. విరోచనబద్ధముండునపుడు విరో
చన సాధనము జేయనగును. F నెం॥ ౨౬- ౭౯ యిచ్చేది. — —

మెనొరేజియా రక్తకుసుమ. (Menorrhagia)

ముట్లుయందు విశేష శ్రావము కలుగుట. — —

ఇది విశేషరక్తము కలిగిన దేహమందున్ను, రక్తములో లోపమున్ను కలిగినవారి యందున్ను కలుగును. — — —

గుణములు—విశేష రక్తపూరితమైన స్త్రీలయందీరోగము పుట్టించినపుడు నడుములోనొప్పి, నిస్సత్తువ, తలనొప్పి, గాదరించి యుండు ముఖము, జ్వరము, బలమైననాడి కలిగియుండును. రక్తము లేమిగానుండు వారలందు కలుగునపుడు నీరసగుణములు ముందుగా కానబడును. అనగా నడుములోనొప్పి, నిస్సత్తువ, మూర్ఛనొందుచుండుట, అలవాటైనపని చేయుటకశక్తి- ముఖము పాలిపోయి నాడి సూక్ష్మముగా నుండును.——

హేతువులు—ఆధార హేతువు స్థూలదేహము, తరుచుగా బిడ్డలు కనుటచెగాని, కడుపుదించుకొనుటచెగాని, యోనిమీదుగానుండు కపుటము పడలొటవల్లనున్ను సత్తువగు పదార్థములు భోజనలేమిచె గలుగుబలహీనత, మనస్సునందు విచారము మొదలగునవి. — — —

ఉద్రేకములు— సురతమందు మితిలేక సంచరించుట, దుర్బలమగు శరీరము కలుగువారలందు చలవ, ఇవక మొదలగునవి రోగమునుద్రేకించును. కొన్ని రోగములందు విశేషముగు శ్రావము కలిగియుండును.

సాధ్యాసాధ్యము—రక్తపూరితము,రక్తబలము లేకుండుటచెకలుగునపుడు సాధ్యము.... ... ... ... ... ... ...

గర్భపాత్రము యొక్క యితరవ్యాధిచె కలుగునపుడున్ను మత విహారము లేని బలహీనులగు స్త్రీలయందు కలుగునపుడు కష్టసాధ్యము.

చికిత్స— గేలికేసిడ్- పటిక, ఎర్రటు మొదలగునవి యివ్వనగును. శ్రావము విస్తారముగానుండునపుడు యోని లోపలకున్ను, అపానముగుండానున్ను, చల్లని నీళ్ళుగాని, పటిక, మంచు, టానికాసిడ్డువగైరాలు కలిపిన నీరుగాని, పిచ్చికారీ జేయవలెను. స్పంజియనెడు సముద్రపుపాచిని అట్టినీళ్ళలోకలిపి యోనిబిలము నింపవలెను. రోగి వెల్లకితల పట్టిగానుండు తల్పమున పరుండవలెను. బట్టలు బహు తేలికగాను భోజనము చలవ జేయునదిగా వుండవలెను.... ... ... ...

రెండవ తరహాయందు సత్తువను గలుగజేయుమందులు కసమందులు

లు కలిపిన్నీ, కాకజేయు మందులున్ను, నిషాజేయునవి బీరు, వైను, మం
చి భోజనము, మొదలగునవి ప్రథమమునుంచి యివ్వానగును. పైసాధన
ములు పైని చెప్పినరీతిగా నే చేయనగును. F నెం॥ ౩. రాజారావు ఇచ్చెది.

---

లూకోరియా అనగా, తెల్లకుసుమ. (Leucorrhoea)

గుణములు—తెల్లగాగాని, పచ్చగాగాని, ఉండును. కఫమువలె
వుండు శ్రావము యోని మార్గమున కలిగియుండును. ఈ శ్రావము కొ
న్ని ఔనుసులు మొదలుకొని రెండు పైంట్ల పరియంతనుండున్ను, అనగా
గిద్దెడు మొదలు శేరు శేరున్నర వఱకుండును. ఇందువలన నీరసము, తొం
దర, ముఖము తిరుగుట, గుండెదడ, చెవులయందు ఝూంకారము, మూ
ర్ఛనొందుట, విశేషవిచారము- శరీరమునందనేక చోట్లనొప్పికలిగియుం
డుట, అనేకవయవములు బాధనొందును. జీర్ణశక్తి తగ్గును. ఆకలి మం
దగించును. విరోచనబద్ధము, రక్తము నింపాదిగా చెలించును. శరీరం
నాలుక- పాలియుండును. శ్రావము పలచగాగాని. జిరుగుగానుండును.

హేతువులు—ఆధార హేతువు- నీరసముగానుండు స్త్రీలయం
దు తరుచు.—

ఉద్రేకములు—విరోచనబద్ధము, బలహీనులగు వారలందు అతి
సంగమము తరుచుపిల్లలుకనుట.—

చికిత్స—౧. దేహబలము నభివృద్ధిపొందించుట. ... ...

౨. ఉద్రేక కారణమును- తీసివేయుట... ......

౩. శ్రావమును పోగొట్టుట. ... ... ...

శరీర బలమాభివృద్ధి కాగా కాగా శ్రావము తగ్గును. భోజనము క్ర
మముగా యిచ్చుటయందు విరోచనబద్ధము కాకుండా జాగ్రత్తగానుండవలె
ను సాధారణమైన గమనము చన్నీళ్ళస్నానము చెయించవలెను. ఇనుముతో
జేయు మందులివ్వానగును. ఒణుకు కలిగియున్నప్పుడు నిషామందులివ్వానగు
ను. ఆ నిషామందులుతో సత్తువను కలుగజేయు మందులు కలిపి యివ్వానగు
ను గాలికేసిడ్డు- పటిక మొదలగు కషవస్తువులున్ను- యోనిలోనివ్వను

పగు పోరను బాగుచేయుటకు కోపేబా, క్యూబబు, టర్పెంటైలు యివ్వనగును.— — — — — —

పైని వోకుచెక్క, కాచు, సింకోనా, మాఫలకాయలు, దానిమ్మనేడు చెక్కలకషాయమున్ను, పటిక, జింకు మొదలగునవి పిచ్చుకారీ చేయనగును. లోపుకు నెం॥ ౨౦- ౨౫- ౭౦ యిచ్చేది. — —

## డ్రేకంక్యులస్. (Dracunculus.)

—*నారిపుండు.*—

**గుణములు**—తరుచుగా కాళ్ళయందు ముందు దురదకలిగి అటుపైని చిన్నపొక్కుకలిగి ఆ పొక్కుచుట్టు కురుపువలె వాచియుండి ఆపొక్కు బద్దలైయందుండు రసము కారిన వెంటనే పురుగుపైకివచ్చును. ఈపురుగు సుమారు తొమ్మిదిపది అంగుళములు పొడవుండును. ఒకానొకప్పుడు విశేషపెద్దదిగా నుంటున్నది. పురుగు వొకవైపు మొనగానున్ను, రెండవకొన నంకుశమువలె నుండును కొనా మొదలు వొకదళసరిగాను సన్నముగానుండును.— — — — —

హేతువులు—కాకదేశములయందు నివాసము. — —

ఉద్రేకము—అశుభ్రనీటనుండ పురుగుయొక్క గుడ్లు శరీరమందు ప్రవేశించుట.— — — — — —

చికిత్స—నొప్పిని శాంతింపజేయు సాధనములున్ను, పోల్టీసులున్ను, వేయనగును, పురుగు కనబడు వెంటనే దానినిపట్టుకుని గుడ్డనుగాని, కలమునకుగాని, ప్టికింగు పలాస్త్రికిగాని, చుట్టివేసి చీము పోచ్చుకొనుటకు పైని పిండి పుడకబెట్టి కట్టుచుండవలెను. ఉదయసాయంత్రములందు కొంచముకొంచము పురుగునులాగి చుట్టివేయుచుండవలయును. ఘట్టిగా లాగినేని తెగిపోవును—గనుక బహుజాగ్రత్తగానుండవలెను. పురుగు తెగిపోయిన యెడల విశేషచీము పట్టుట కాళ్ళుట నొప్పి అధికమగుట కలుగును. కొందరు సాధకులు పురుగును జూచిన వెంటనే యావత్తుపురుగు నొక్కపర్యాయములాగివేయుటకు తగినంత నేర్పు కలవారుగానున్నారు. —

## చర్మరోగములు (Skin diseases)

ఈ రోగములనేక విధములుగా విభజింపబడియున్న వింటిలోముఖ్యము గా గలుగునవి. దద్దురులు, పొక్కులు, బొబ్బలు, పెచ్చులు, చీము పొక్కులు, కణుతులు, మొదలగునవి. — — — — —

౧. దద్దురు. —* ఇవి నాలుగు విధములు. *—

౧. ఉబ్బుసర్పి... ( Erysipelas ) ౨. అమ్మవారు ( Scarlet Feavre.)
౩. వేపపువ్వు... ( Measles ) ... ౪. చలిగంట ( Urticaria. ) ఇవి వలయు మొదటిమూడు తెలుపబడియున్నవి. .. ... ... ...

—(*) చలిగంట (Urticar.a,) (*) —

కందిరీగలు కుట్టుటచే కలుగు దద్దురువలె నుండునది బాధయున్న సమానమై విశేషదురద గలిగియుండును. ఈ దద్దురు అకస్మాత్తుగా కలుగును. నిముషములలోగాని, ఘంటలలోగాని, పోయి మరొకభాగమునందు కానబడుచుండును. కొందరిలో కొన్నివత్సరములవలె వారాలకపుడు కానబడును. ఈ దద్దురు గట్టిగానుండి యే ద్రవము లేకుండును. కొందరిలో రెండుమూడు గంటలలో [illegible] యుండు నెప్పులోనున్న నివారణగును. ఒకొకప్పుడు మధ్యమధ్య నెప్పుదిగలిగి తెలుపుగా కానబడుచుండును. [illegible] రాని భాగము కేకించుచుండును. స్వల్పజ్వరము కలిగియుండును [illegible] చర్మపు పొలుసు రాలిపోవును — — —

హేతువులు—కూరగొంగళిపురుగు ముట్టుటచేతగాని, గుల్లకలజంతువులు, పుచ్చకాయలు, తేనె, చిరకా, పుట్టగొడుగు, కూరగాయలు తిన్నయెడ చేతనున్ను, వెలీరియన్, టర్పెంటయిలు, కోపెబా మొదలగు నవుషధములను, కొన్నిఫలములు నీ రోగమును వృద్ధిపొందజేయును. — —

చికిత్స—భోజనమునందు క్రమములేక కలుగునేని వాంతికిచ్చి ఆటుపైని స్వల్పవిరోచన సాధనమును చేయవలెను. తరుణముగానపుడు, వేడినీళ్ళు, గంధకము మొదలగువానితో స్నానము చేయవలెను. స్వల్పవిరోచన సాధనములు రక్తమును క్రమపర్చుచుండును. విశేష యిబ్బందిగు వారలకు పాషాణద్రావకము, ౫ లేక- ౬ చుక్కలు రోజుకు యివ్వవలెన

గును. శీసపు నీటిచేతగాని, సైనైడ్ పొటాసియమ్ నీరుతోగాని, వేడి స్నానముచేతగాని, మంటనివారణగును. నిటికా ౨ వంతులు నీళ్ళు ౧౦ వంతు కలిపి పైని అద్దితే తక్షణము నివారణమగును. నెం॥ ౩౧ వాడేది.

## ౧౧. పొక్కులు.

౧ చిన్నమ్మవారు. (Chicken pox) ఇదివఱలో తెలియజేయబడెను.

౨ విసర్పిణి. (Eczema.)

౩ సర్పి. (Herpes.)

౪ గజ్జి. (Itch.)

### —*( విసర్పిణి )*—

౨ ఎక్జీమా — చిన్న తెల్లని పొక్కులు గుంపుగుంపులుగా కలిగి అట్లాగు కలిగినచో చెమర్చి మెరుపగును మంట కలిగియుండి మూడునాల్గు దినములలో పొక్కులు చితికి పలచనినీరు వచ్చి, పెచ్చులు కట్టి, ౮-౧౦ రోజులలో రాలిపోయి క్రొత్త పొక్కులు ఆ చుట్టువల్ల పుట్టుచుండును. ఈ రోగము రెండు మూడు మాసములు బాధించును. గజ్జియందువలెనే దీనియందు మంట కలిగి యుండును. — — — —

హేతువులు — ఆధారహేతువు బలహీనత. — —

ఉద్రేకములు — విశేష కాక, పొక్కుమందులు వేయుట, రసప్రయోగము, — — — — —

చికిత్స — స్వల్పముగా విరోచనసాధనములు ఖండద్రవ్యములు, చలవచేయు ద్రావకములు, మందిభోజనము, లోపలికివ్వవలెను వేడినీళ్ళస్నానము. నీళ్ళలో గుడ్డముంచి పొక్కులపైని వేయుట. తవుడు కట్టుగాని, ఉర్లగెడ్డ పోల్టిసుగాని, పైనికట్టుట సాధనములు దురద, మంట, విశేషముగా యున్నపుడు నల్లమందు కాయల కషాయముతో కాపుచేయనగును. ఔన్సు నీళ్ళకు ౨ గ్రేనుల సైనైడు పొటాష్ కలిపి ఎక్కించుట చేసినను నివారణగుచున్నది. జింకు, సీసమున్నము, పైపై వాడుక చేయవలెను. దీర్ఘకాలిక్యమందు పాషాణము లోపలనివ్వ, గంధకపు స్నానములు పైపైన్ని వాడుక చేయనగును. నెం॥ ౯౫-౯౭-౯౯ పైపూతలు. — —

## సర్పి. (Herpes.)

కి సర్పి—పొక్కులు గుంపుగుంపులుగా పుట్టును. విసర్పిలోకం టె చిన్నగుంపులుండును. గుంపేకమైన తరువాత పొక్కులు చితికిపచ్చని చీముకారి రోగితీవ్రమునుపట్టి స్వల్పకాలములోగాని దీర్ఘకాలములోగాని, కురుపైనచర్మమును పెచ్చులుగట్టి మానిపోవును. తరుచు ౧౪ రోజుల లోపోవును. — — — — —

నిధానించుట— పింపిగస్ అనువాటినుండి విశేషముగా గుంపులందు పొక్కులుండుట చిన్నపొక్కులగుటచే కనుకొనగును. —

చికిత్స— సూక్ష్మముగా విరోచనముగుమందులతో అంటు మెసీకా నివ్వవలెను. చమటనుపుట్టించుమందు లివ్వవలెను. — —

పొక్కులుపచ్చికేసినపుడు చిపి వేసి పైని మెత్తదనమును కలుగ జేసే పోల్టీసులుగాని మానుపలాస్త్రిగాని వేయుటచే మానును.

నెం॥ ౯౭ వాడేది. — — — —

---

## గజ్జి (Itch.)

ఇది తరుచుగా కలుగుచున్నది ప్రతివారికి దీనిగుణములు తెలిసేయున్నవి.— — — — — —

హేతువులు— ఆహారహేతువు— యవ్వనము, అశుభ్రము, ఉద్రేకము గజ్జిపురుగులు ముట్టుకొనుటచే సంభవించుచున్నది. గజ్జియెన్నడు ముఖమున కానబడదు. — — —

చికిత్స— గంధకము, లోపలకు వెలపలకుకూడా వాడుకొనవలెను. గజ్జిపట్టినస్థలము బహునిర్మలముగా నుంచవలెను. కార్బోలికు చ మురు గంధకపు పలాస్త్రి అయిడోఫారంపలాస్త్రి రోజూ కడిగి పూయవలెను. నెం॥ ౯౯ వాడేది. — — —

---

## 111 పెద్దపొక్కులుగలవి.

(Pemphigus) 1 పెంఫిగస్. (Rupia) 2 రుపియా.

## నీటిసర్పి. Pemphigus.

౧ పెంఫిగస్- చిన్నవాళ్ళయందు కలుగుచున్నది. పొక్కులు పుట్టుటకు పూర్వము స్వల్పముగా గాని అధికముగా గాని జ్వరముండును. పొక్కులు ప్రథమతా యెఱ్ఱగానుండి తరువాత పులినీటితో నింపబడి పిమ్మట బద్దలౌను. బద్దలౌనపుడు కారునీళ్ళు పచ్చవాకుగానుండును. అటుపిక ప క్రమముగా మానిపోవును. లేనియెడల పొక్కులు ముడుచుకొని పోయి యెండిపోవును,—— —— —— —— ——

హేతువులు—శరీరము మంచిది కానివారలయందు భోజనముక్రమము లేకుండుట, నివసించుగృహమున గాలిబాగా ప్రవహించకుండుట. (స్పర్శ)

చికిత్స—మంచి భోజనము, స్వల్ప విరోచన సాధనములు, తత్స్వ[illegible]ను మార్చే మందులు, ఉప్పులు, లోపలకివ్వనగును. శరీరమును మెత్తబట్ట నద్దే పోల్టీసులు, పలాస్త్రులు వేయనగును. నెం॥ [illegible] వేసేది. —— ——

## రుపియా. (Rupia.)

౨. రుపియా—పైని చెప్పిన రోగమువలెనె కానబడి పొక్కులు మానిపోవుటకు బదులుగా బాధనొందచు కురుపులౌను. ఇందు రుపియా [illegible]పోను చెప్పిన ముఖ్య సంబంధ జోక్య[illegible] కలుగుచున్నవి. ఇవి [illegible] క్రింద మాడు[illegible] [illegible] లేక ౧౦ పొరలుకలిగియుం[illegible] పెచ్చులు [illegible] పుమికను కలిగి సముద్రపు నత్తగుల్ల తీరునుండును. ఇది [illegible]సాధ్యము సిధానించుట- దీనియందుండు పెచ్చులచేత నిది గ్రహించవనగును.——

చికిత్స—మంచి హారము, సత్తువనిచ్చుమందులు, రక్తమును శుభ్రముచేసే మందులు. నీలాంజనము, పాషాణము, వెండుపలనజేయు మందులు, వేడినీళ్ళ స్నానము మొదలగునవి సాధనములు. నెం॥ [illegible]

## IV చీము పొక్కులు కలవి.

౧ గోస్ఫోటకము (Cow pox) ముందుటీకాలో తెలియజేయనగును.

౨ మసూచకము (Small pox) తెలియజేయబడెను.—— —— ——

౩ గజసర్పి, (Ecthyma) — — — —
౪ పిల్లల సర్పి. (Impetigo) — — — —
౫ వ్యాపక సర్పి. (Porigo) — — — —

౩. ఎక్థిమా — ప్రథమత చిన్నచిన్న మచ్చలుగాపుట్టి క్రమమున - చీముగలపొక్కులై చీము పట్టనవెంటనే మధ్య మొనదేరి బద్దలై వారము లో మానును. బలహీనులందు త్వరగా నివారణలోకి రాని కురుపులగును. సున్నపు పనివాళ్ళు తరుచుగా దీనిచే బాధనొందెదరు. సున్నము మొదలగు కాకవస్తువులు శరీరమున కంటుటచె కలుగుచున్నది. — — —

చికిత్స — మెత్తబెట్టినట్టిన్ని స్వల్పము కాకచేయు మందులు పైని వాడుక చేయువలెను. సూక్ష్మముగా విరోచనము చేయునట్టిన్ని, మందులు న్ను రక్తమును శుభ్రము చేయునట్టి మందులున్ను, మంచి భోజనముగోరువెచ్చని నీళ్ళస్నానము, దేహమును శుభ్రముగానుంచుట, దేహ బలమెచ్చించుట, ముఖ్యము. F నెం॥ ౧౧ యిచ్చేది. — — —

౪. (ఇంపెటీగో.) — విస్తారముగా గాని, కొంచముగా గాని, దేహమందంతట చిన్నచీము పొక్కుల గుంపులు కలిగియుండును. ఇందొక విధము తలను పుట్టును. పొక్కులు ౪-౬-౮. రోజులలో బద్దలై కఠినమైన - పెచ్చుకట్టి దానిక్రింద కురుపు చాలా వారములుగాని, మాసములుగానుండును. ఇందుకాక విశేషమరద గలిగుండును. — — —

చికిత్స — పైని చెప్పిన రోగమువలెనే ఖనిజధృతులు, శరీరమునకు బలము చేయు మందులున్ను, పాషాణమున్ను, వాడుక జేయబడును. F నెం॥ ౧౧౪౫ వాడేది. — — — —

౫. (పొరిగో.) — సిరస్సు మీద కలుగునపుడు టీనియా కేపిటస్ యని వాడుకొనియెదరు. పచ్చనైనట్టిన్ని, యెండిపోయినట్టిన్ని, చిన్నవైనట్టి పెచ్చులు కలిగియుండును. ఈ పెచ్చు మధ్యను వెంట్రుక కుచ్చుకగిచుండును ఇనొక విధము తామరగా వాడుకొందురు. — — —

చికిత్స — వెంట్రుకలు దగ్గిర కత్తిరించవలెను, విశేషతీవ్రమైన రోగమందు వెంట్రుకలూడదీసి వేయవలెను. అటుపిమ్మట రసగంధక మెర్క్యురీ కార్బొనేట్ వేసి పట్టుపట్టవలెను. — గంధకము, ఆయిల్‌ఆఫ్‌కేడ్ రెండు మిశ్రమమైన పలాస్త్రీలు, పోల్టీసులు వాడుక చేయవలెను. సత్తువనిచ్చునట్టిన్ని రక్తమును శుభ్రము చేయునట్టి మందులున్ను, మంచిహారమున్నిచ్చవలెను. ఈ బాధ చాలా కాలము శ్రమను కలుగజేయుచుండును. —

—* (V. బొబ్బలు వలెనుండునవి.) *—

1 లిచెన్ ... ... 2 ప్రూరైగో.

౧ లిచెన్. — ఇది ముఖ్యముగా పసిపిల్లలయందు కలుగుచున్నది. ఘట్టిగానుండునట్టిన్ని మొనకలిగినట్టి చిన్న బొబ్బలు కలిగి విస్తారము దురదగానుండును. చికిత్స — నెం॥ ౯౯ వాడేది.

---

(ప్రూరైగో) ఇదియును చిన్నబొబ్బలు కలిగుండి విశేషమగు దురద కలిగియుండును. శరీరము యొక్క మీదభాగమునకున్ను. ఉత్పత్తవయవముల పైనిన్ని కలుగుచున్నది. ఇది శుభ్రము లేనందున్ను మంచితిండి లేకుండుటచేతనున్ను కలుగుచున్నది. ... ... ... ... ... ... ... ... ... ......

చికిత్స — ఈ రెండు విధములకు సూక్ష్మముగా విరేచనములు చేయు మందులు, శిలాంజనముతో చేయు పూతమందులున్ను, వేడినీళ్ళ స్నానము, సత్తువనిచ్చు మందులు, మంచిభోజన పదార్థములివ్వవలెను. — ... ...

—*) VI. పెచ్చులు కలవి. (*—

పైత్యపు కుష్టులు.

౧. పెచ్చులు కట్టుకుష్టులు. (Sguama) ౨. సోరియాసిస్. (Psoriasis)

౩. చుండు. (Pityriasis) ౪. చాపపొలుసువలె నుండుకుష్టు. Ichthyosis

—* (౧ పెచ్చులు కట్టుకుష్టు.) *—

చెర్మరుక్ష్మకలందివి విశేషబిబ్బంది చేయునదిన్ని. చాలా కాలముండునదిన్ని. ఎఱ్ఱనైనట్టి గుండ్రని పెచ్చులు పరిమాణ భేదముగలిగుండును. శరీరమందెక్కడనైననూ, కలిగి క్రమముగా పెద్దవై కల్సుకొనిపోవును. కొంత

కాలమునను పిమ్మట పెచ్చురాలి అంతకంటె దళసరిగు పెచ్చులుపుట్టును ఇందునొప్పిగాని, దురదగాని, కలిగుండదు... ... ... ... ...

హేతువులు— గంధకపుపొగ, సముద్రపు నీటస్నానము, తారుపలాస్త్రీ, గంధకపుపలాస్త్రీ, మొదలగునవి. లోపలికి, అయిడీన్సు, పాషాణము, కంతారిడిస్, అనుపాకుటీగవలన చేయబడుమందు లివ్వనగును.

భోజనమును క్రమపర్చి అశుభ్రతను పోగొట్టి కొన్ని లేపులు పూయుటచే రోగమును శాంతిపొందించనగును. నివారణకు చాలాకాలము పట్టును. చాలామందియందు శాంతికలుగుటేగాని, నివారణకలుగదు. ...

## ౨. సోరియాసిస్. (Psoriasis)

ఇందు చర్మము పెచ్చులుగట్టి బీటలు దేరియుండును. శరీరమందంతట నుండదు విశేషదురద గలిగుండును. పైని చెప్పిన దానినుండి పెచ్చులుగుండ్రిగా నుండకపోవుటనుండిన్ని. మధ్యను పల్లముగా నుండకపోవుటనుండిన్ని, కనుకొనవలెను... ... ... ... ... ... ... ... ...

హేతువులు— వంశానుక్రమముగా వచ్చునదిన్ని, కౌమారమందున్ను, రాజరోగతత్వము కలవారియందున్ను. ... ... ... ...

ఉద్రేకములు— విశేషముగా తాగుట, మందవహారలేమి యిది అంటువ్యాధికాదు... ... ... ... ... ... — — —

చికిత్స— రక్తశుభ్రిమును చేయుమందులున్ను మందవిరేచి, తారుపలాస్త్రీ, పాషాణము, రసము, అయిడిను. (డనోవన్సుసోల్యూషను) మొదలగునవి యివ్వనగును. నెం॥ ౪౮ యివ్వవలెను. — — — —

## ౩. చొండు, పిటిరియాసిస్. (Pityriasis)

దురదకలిగి చిన్నచిన్న తెల్లని పెచ్చుల విస్తారము కలిగుండి తరుచుగా సిరస్సున కలుగును. ఈ పెచ్చులు రాలిపోయిన వెంటనే కొత్త పెచ్చులు పుట్టును- ఈ వ్యాధి మాసములకొలదుండినను సులభముగా సాధ్యము కాదు. — — — — — — — — — — —

హేతువులు — ఆధార హేతువు- నీరసము. వయస్సు, ఆడవాళ్ళు.

ఉద్రేకములు— చెమట యొక్క హెచ్చు కలుగుట,— — —

చికిత్స— శుభ్రత. రక్తమును శుభ్రము చేయు మందులు, బలమిచ్చు మందులు, పులుపు విరియునట్టి మందులతోగాని, సీసపుమందులతోగాని, కలిపిన నీళ్ళున్ను, జింకుపలా(స్త్రీ) మొదలగునవిన్ని మీద లేపు చేయనగును. —

పొలుసు కారే పైత్యకుష్ఠు. ఇక్థియాసిస్. (Ichthyosis.)

చిన్నవైనట్టి. ఘట్టిగానుండునట్టి, గోధుమాకారంపుకల పెచ్చులలోని దానినొకటి, కప్పకోని చాపపొలుసువలె పుట్టును. నొప్పిగాని. దురదగాని, కలిగుండదు. దేహములో యే కష్టములు కలిగుండవు. ఈ రోగులందు దుర్వాసన కలిగుండును, వంశానుక్రమముగ కలుగును. — —

చికిత్స— పాషాణము ఐడీను, బలము కలుగు చేయునట్టి, రక్తమును శుభ్రపరుచునట్టి మందులు లోపలకు నివ్వనగును. పైకి శుభ్రత, గంధకము, ఐడీనులయొక్క ఆవిరి వాడుక చేయనగును. — —

—*) VII కణుతులు కలవి (*—

ఇందు మూడు వ్యాధులు గలవు వీటియందు ప్రధానముగునదిన్ని, తరుచుగా కలుగునదిన్ని, కణుతులు, బూరకాలు.— — —

కణుతులగల బూరకాలు ( Elephant Leg. )

ముందు దద్దురులవలె కలిగి అటుమీద కణుతులు పుట్టును. ఈకణుతులు ప్రథమమున మెత్తగానుండి క్రమముగా ఘట్టిపడి కురుపులగును. వీటి పరిమాణము భేదించియుండును. ఈ కురుపులు నల్లని పెచ్చులు కలిగి వాటి క్రిందనుంచ సహ్యకరమగు చీము సర్వదా కారుచుండును. రక్తమందుండు వైబ్రీనయను ఘట్టిపదార్థము కురుపుచుట్టుండునట్టి భాగమందు కలిగి అందుచే వాపు కలిగుండును. ఇదే యేనుగుకాలువలె నుండును. కొంతకాలమునకు పిదప జ్వరము కలిగి విశేష ఆయాసమును కలుగజేయును. అనేకమందిలో నొప్పి కొంచముగానుండును. కొందరిలో విశేషనొప్పున్ను

దా మొదటినుండి కలుగును. — — — —

హేతువులు—ఆధార హేతువు. రాజరోగతత్వము వంశమందు కలిగి యుండుట.— — — —

ఉద్రేకము— కొచ్చిన్ దేశము మొదలగు కొన్ని దేశములందు ప్రాబల్యముగా నుంటున్నది. ఈ వ్యాధినివారణ చేయుటకు శస్త్రవైద్య సాధనము జరిగించునెడల విశేష యిబ్బంది కలగజేయునంద చేయన గును.— — — — — — —

చికిత్స— పైని నల్లమందు కాయుటకషాయముతో కాపేది. F ఐరన్, టించెరు, ఐరను. రాసేది.— లోపలకు నెం॥ గాం ఇచ్చేది. కాక చేయు లేపులు. సాపాణము, శాక్యటీగమందులు, బలము కల గజేయు నుందులును లోపలకివ్వనగును. దేశమును మార్చుటావశ్యకము.

## సూతికా రోగములు.

### గర్భసూతిక, ప్యూర్పిరల్ పెరిటొనైటిస్.

### Peurperal Peritonitis.

గర్భపాత్రముయొక్క పైపొరయందు పచ్చి కలిగి అక్కడనుండి పొరంతట వ్యాపించుచున్నది. — — — —

గుణములు—కడుపు నొప్పిగాని నాడియందు హెచ్చుతగ్గుగాని, ప్రథమము గలుగును. సాధారణముగా ప్రసవము కావేగమే నాడిమంద ముగా నుండుటకు బదులుగా విశేషత్వరగా కొందరిలో కొట్టుచున్న ది. పచ్చి కలిగిన తరువాత శరీరము వేడిమి యెక్కుట, విదాహము, ముఖము గాదరించియుండుట, నాడి, ఊపిరి వేగము క్రమమున కలుగును, లెను కాక త్వరగా తక్కువగును. ఈ గుణములు కలిగిన పిదప. ఓకరింపు వాంతి, తలనొప్పి, గర్భపాత్రము నొప్పిగానుండుట కలుగును. పొత్తిక డుపునగాని, ప్రక్కనుగాని, నొప్పి గలిగి గర్భమంతటా వ్యాపించును. ఈ నొప్పి స్వల్పముగాగా నధికముగాగా నుండి తెగకుండాగాని, అ ప్పుడప్పుడు గాని కలగియుండును. రోగమభివృద్ధిపొందిన కొలది అనాముడు కాలము తరువాత కలుగునొప్పి అధికముగా వచ్చుచుండును క్రమము గా గర్భముమీద వ్రేలు మోపుటగాని బట్టబరువుగాని, రోగి వోర్వలేకుం

డును. ఈ రోగములో శ్రావమెప్పటివలె నుండినను, కొందరియందు తక్కువగుటయు కొందరియందు బొత్తిగాలేకుండుటయు కలుగును. కొందరియందు పాలు తక్కువగుటగాని, లేకుండుటగాని, కలుగును. కొందరు తమ పిల్లలకు పాలివ్వకుందురు. నాడి, ౧౧౦ మొదలు ౧౪౦ దెబ్బలో కమినిటున కొట్టుచుండును. అంత్యకాలమందు, ౧౬౦ కలిగియుండును. నాలుక తెల్లగానుండును, కొందరియందు పొడార్చుకొనిపోవును. హాని చేయునపుడు విదాహమధికమగును. శరీరము చల్లబడును. విరోచనములు- కొందరియందు కలుగును. అంతమగునపుడు నల్లనిరంగు గలిగి దుర్వాసన కలిగియుండును. మూత్రము మురికిగాను, విశేష రంగుగాను, కొంచముగానుండును. తనుకాక, ౧౦౪ మొదలు ౧౧౬ వఱకుండును. —

చికిత్స—నాడి దృఢముగాను నుండెనేని, ౨౦ అవున్సుల రక్తము చేతినుండి తీయనగును. రక్తము తీయుటకసాధ్యమగునపుడు, ౬౦ జలగలు గర్భమున పట్టించవలెను. అటుపైని కడుపుకాచి తవుడుడికించి కట్టవలెను. కాపడము కట్లు ఘడియఘడియకు మార్చవలెను. రసము నల్లమందును కలిపి నోరుపట్టువఱకుగాని, రోగము తగ్గువఱకుగాని, విరోచనములు పట్టువఱకుగాని, ఇవ్వనగును ఓకరింపు, వాంతి లేకుండెనేని టార్టరెమిటిక్కు యివ్వనగును. విరోచనములు కలుగునపుడు రసమును విడిచివోక్కు నల్లమందే యివ్వనగును. రసతైలము పైకి రాయించుట మంచిది, విరోచన బద్ధము కలుగునపుడు తెల్లాముదము, టర్పెంటాయిలు, అపానము వెంబడి పిచ్చుకారీ చేయనగును విరోచనమునకు మందులు ప్రయోగించునపుడు, హైడ్రాయాసియామిగాని, డోవర్సుపౌడరుగాని, కలిపివ్వనగును, విరోచనములగుచుండి, ఓకరింపు, వాంతియు, సోడా యాసిడ్డుతో కొంచము నల్లమందరఖు కలిపిచ్చుటచెగాని, సబ్ కార్బోనేటు పొటాషు, పెప్పరుమెంటు నీళ్ళతో నిచ్చుటచెగాని, కుమరును. గర్భమందట పొక్కుపలాస్త్రి వేసి పొక్కినతరువాత రస పలాస్త్రి పూయుచుండుటచె మందిగుణమిచ్చుచున్నది,— — — — —

# (II) సూతికా కమలమేహము.

ప్యూర్పిరల్ హిస్టిరైటిస్, (Hysteritis.)

గర్భపాత్రము నందు కలిగెడి ఇంఫ్లమేషను గానున్నది.

గుణములు॥ మూడవనాడుగాని, నాల్గవనాడుగాని, కంపముకలిగి దేహతాక, విదాహము, తలనొప్పి కలుగును. నాడి, ౧౦౦ మొదలు ౧౨౦ దెబ్బలు మినిటునందు కొట్టుచుండును. నాలుక పొడిగాను దోషముకలిగి వుండును. ముఖము ఆశకలిగి, ముడుచుకొని, బాధ తెలుపుచు చేయుచుండును. గాభరా, పొత్తికడుపులో నొప్పి తెలిపితే యగా గర్భపాత్రము పెద్దదైనట్టున్న ఘట్టిగాను వచ్చిగానుండునటుల కనుకొనబడును. ప్రథమము గర్భము మెత్తగానుండును. క్రమమున బిగియబట్టి పొందును, స్రావమున్ను, పాలున్ను, తక్కువగుటగా నణగిపోవుటగాని, కలుగును స్రావము కొందరియందు దుర్గంధము కొట్టును. ఘడియఘడియకు మూత్రము గుటచె విశేషస్రావము నొందింపజేయుచున్నది. ఇందుచేత మూత్రము నిలచిపోవుటయు కలదు. ఈ వ్యాధినివారణలోగాని, గర్భపాత్రయందు కురుపును పుట్టించుటలోగాని, గర్భపాత్రను మెత్తబెట్టుటలోగాని, క్షీణించుటలోగా నంత్యముగుచున్నది. —— —— ——

నిధానించుట— పెరిటొనైటిస్‌తో కలసియుండునపుడు గ్రహించుటసాధ్యము. గర్భపాత్రము ప్రత్యేకము బాధనొందునపుడు బహుసులభముగా కనుకొననగును. —— —— —— ——

సాధ్యాసాధ్యము— రోగబలము విశేషముగా లేనపుడు అనేకమంది నివారణను సులభముగా నొందుదురు. గర్భపాత్రమందలి నొప్పి తగ్గుట, నాడివేగము తగ్గుట, నాలుక శుభ్రముగానుండుట, విరోచనములుగాని, విరోచనబద్ధముగాని, లేకుండుట, ఆకలికలుగుట, నిద్రపట్టుట వెనుకడుట, పాలుతగ్గకుండుట, మంచిగుణములుగా నెంచబడును. ఈ వ్యాధొకరినుండి మరొకరికి, వ్యాపించుచున్నది. విశేష తీవ్రమైనప్పుడు సన్నిపాతలక్షణములు కలిగిప్రాణహానిని తొలగించును ఇతరరుగ్మతలు దీనిలో కలిగియుండుట దుర్గుణము. —— —— ——

చికిత్స—జలగలను పొత్తికడుపు మీదనంటించిన తరువాత కావ
డమిచ్చి తవుడు పుటకించి కట్టవలెను. నల్లమందు కేలుమెలుకలిపి యిచ్చు
టచే మృతికలుగనివ్వక నిమ్మళించును. విరోచనములు కలుగునపుడు కేలు
మెలు వదిలి ప్రత్యేకము నల్లమందిచ్చి గర్భమున రసపలాస్త్రి రాయవలె
ను. తీవ్రగుణములు తగ్గగానే కమ్మని పాస్పలాస్త్రి వేసి దూది వేసి
కట్టవలెను. సులభముగా విరోచనములు విరోచనబద్ధముండునపుడు-
యివ్వవలెను. విశేష విరోచనము గాను నేని దుర్గుణములు కలుగును. రో
గము వ్యాపకరూపమునొందునపుడు బాకసు, వైద్యు, మొదలగునవివ్వవలెను.

నాదవాహులందు కలిగెడి ఇన్ఫ్లమేషను. .. ... ...

గుణములు—తీవ్రముగానుండ పెరిటోనైటిస్ లక్షణములవలెనుం
డును. నొప్పికొంచముగానుండును. పొత్తికడుపు పక్కనునొప్పిపుట్టి గజ్జ
లకున్ను తొడలకున్ను వ్యాపించుచున్నది, పరీక్షించుటచే వాపున్ను ఘట్టి
న్నిపచ్చిగానుండుటయును, నొప్పిగల స్థలముండును. ఈభాగమున
వాయించునెడల గర్భమువాయించుటచే కలుగుధ్వనికి విరుద్ధమైన దుబ్బు
మనియెడు నొకధ్వని కలుగును. యోనిమార్గమున శోధన చేయుటచే రో
గముండు స్థానము గ్రహించవలెను. యోనివేడిమిగాను నొప్పిగానుండి,
ఏభాగమున రోగముండునో ఆభాగమున నిండుగానుండును. .. ...

ఈ వ్యాధి కుదుపు, విదాహము, తలనొప్పి, చపలనాడి మొదలగు
పెరిటనైటిస్ గుణములు, కలిగియుండుటచే వాటిని తెలియచేయుటవశ్య
ముకాదు. రోగము తీవ్రముగానుండునెడల రోగివిశేషబడలిక నొందిచ్చు
తినొందును. నాదవాహులందును వాటి యండములయందును చీముకిలు
గుటయు కలదు... ... . ... ......

చికిత్స—జలగను నొప్పియుండు స్థానమున పట్టించవలెను. అగత్య
మగునెడల రెండవ పర్యాయమును పట్టించవలెను. అట్లుసెని కాపడము
ద్వారా సాధనములు జేసి కేలుమెలు, నల్లమందు యిచ్చి వేడిస్నానము నా
ప్పులు, ములుగు నటుక స్త్రీని కూర్చుండ నియోగించవలెను చీము పట్టి
యున్నల దానికి తగిన సాధనము జేయవలెను. ... ... ...

# సూతికా జ్వరము.

మెలిగినంటు ప్యూర్పెరల్ ఫీవర్. (Puerperal Fever.)

——‡) Septicemia. (‡——

ఈ రోగము వ్యాపకము నొందునపుడు తప్ప తరుచుగా కలగదు, ప్రసవము కాకుండనపుడును. కలుగును గాని, ప్రసవమైన రెండవనాటి రాత్రిగాని, మూడవనాటి వుదయమున గాని, రోగము గలుగుచున్నది. ఆలశ్యముగాకుండా కలుగుచున్నది. శరీరము కుదుపు. చీముల పాకినట్లుండుట. చలి నాడి, ౧౨౦ మొదలు ౧౪౦ గా నుండి బహు నీరసముగాను, అణచితే, అణవబడునట్టిదిగా వుండును.—దేహము కాక ౧౦౨ మొదలు—౧౦౮ వరకు హెచ్చును. విరోచనములు, వాంతి యుండును. దీనియందు పక్షవాత కలిగినపుడు పగలు సాధారణముగా వుండను... ... ...

చాలామంది రోగులు ప్రథమము గర్భాయములోనున్న, పేగులలో నున్న, గర్భపాత్రము యందున, నొప్పని తెలియజేయుచుందురు. రోగము హెచ్చినకొద్ది దుర్గుణములు గలుగుచుండును. తనుకాక తగ్గను- శరీరము పాలిపోయి కళాహీనమై యుండును. నేత్రములచుట్టు నీలివర్ణముగల జీరలుండును. నాడి, చురుకుగాను సూక్ష్మముగానుండ కడపటి దశయందు మధ్యమధ్య దెబ్బలు కొట్టక వూరకుండును.—శ్వాసము త్వరగా నుండును. తరుమగా సట్టూర్పులు గలిగియుండును. నాలుక తెల్లగాగాని పచ్చగాగాని దోషము కలిగియుండును. నాలుక వొణుకు పంటిచే గంట్లుబడియుండును. ఓకరింపును, వాంతియు నెక్కువగాని, తక్కువగాని గును, తరుమగా అసహ్యమగు తేనుపులు కలుగుచుండును. గర్భాయము విశేష బిగించబడియుండి సర్వదాగాని, అప్పుడపుడు గాని, నొప్పి పొడుచుచు విశేష వేడిమి గలిగి అంతటా పర్చిపుండువలె నుండును. విశ్రాంతి లేకుండ, గాభరానుండి, మతిక్రమమున చెడి సింపాదిగా గాని, త్వరగా గాని మృతినొందును, గాభరా కలిగినపిదప వూపిరి తిరుగక ముఖము నల్లబడి మృతిబొందుటయు గలదు.— — — —

సాధ్యాసాధ్యము—నాడియందు విశేష వేగము బలక్షీణమున్నూ

వమున్ను, పాలుతగ్గుట, శ్వాసమున దుర్వాసన యొగవ్యాపరి, కడుపునొప్పి విరేచనములు, లోతుకు బోయిన ముఖము, మొదలగునవి దుర్గుణములు, నాడి నింపాదిగా నుండుట, కడుపుయందు పొంగు తక్కువగానుండుట, శ్వాసము స్వాభావికముగా నుండుట, శరీరము, తడిగా నుండుట, పాలు కలిగుండుట, మంచి గుణములు నాడియందు వేగము తగ్గితేనే తప్పయితర గుణములను చూచి సంతోషించవలదు. —— ——

చికిత్స——రోగము కలిగిన పదిరెండు ఘంటలలోగానే గట్టిసాధనము జరిగించవలెను. టించెరుఐడను కడుపుమీదను రాయుటకలదు, కేలుమెలు, నల్లమందుతోగాని, ప్రత్యేకముగాని, స్వల్పముగాగాని, నధికముగా గాని, వాడుకచేయుట మనకు ముఖ్యసాధనముగా వున్నది. ౨ గ్రేనులకేలుమెలు, ౩ గ్రేనుల డోవర్సుపౌడరుతో కలిపి ప్రయోగింపనగును. రోగముయొక్క కొనదశయందు యీసాధనము కార్యము లేదు. పైని చెప్పిన సాధనముతో కర్పూరము పెద్దమోతాదులతోగాని, కేలుమెలు విడిచిపెట్టి కేప్సికము, బ్రాండి, టర్పెంటు యిలు, కలిపిచ్చుటగాని తగియున్నది. వాంతికి యివ్వవలసినయడల యివ్వవలెను. విరోచనములుండినేని కేలుమెలు విడచిపెట్టి రసతైలము పైని మర్ధనా చేయించవలెను. బారకు, నల్లమందుతోను, వైను, కడుపు కాపడము, వాడుకొనవలెను టర్పెంటైను, కడుపుకు పూయుట మంచిది. విరోచనబద్ధముండినేని తెల్లాము దీనితోనివ్వనగును. బలముకు భద్రపరుచు వస్తువులున్ను, వైనున్ను, లోపలికివ్వనగును. ప్రసవమునకు స్త్రీయున్నచోటు కలుగునపుడు రోగిని మరియొకస్థలమునకు మార్చవలెను. F నెం॥ ౨౧- ౨౨- ౪౯- ౬౫- ౯౮- యిచ్చేది.

జ్వరము విస్తారముగానున్నపుడు- F నెం॥ ౨౫- ౨౭- విరోచనములు కట్టుటకు నెం॥ ౪౭ శ్వాసమునకు చెడ్డవాసనకు, నెం॥ ౮౯ జ్వరము తగ్గినతరువాత- నెం॥ ౭౯ యిచ్చేది.—— —— —— ——

## సూతికావాతము. (Phlegmasia Dolens.)

ప్రథమ సంతానమందు కలుగును కాని తరువాత ప్రసవములకు త

రుచు నొక పరియాయము దీనిచె బాధనొంద నెడల తిరిగి ప్రసవమగున
పుడు స్వల్పమైనను హేతువలేనిది కలుగుచున్నది. ప్రసవమైన తరువా
త నెప్పుడైనను కలుగవచ్చును. — — — —

గుణములు—పొత్తికడుపులో నొప్పికలిగి వుండును. ఈ నొప్పి ప్రసవవేదన తరువాత వుండు నొప్పులవలె వుండును. కొందరియందు వణుకు కలుగును, సుస్తీ, దుర్బలము, తలనొప్పి, పిశేష దాహము కలిగి- వుండును. గర్భపాత్రమున నొప్పికలిగిన పిదప కాలు పిక్కయందు విశేషనొప్పికలిగి మడమవఱకు వ్యాపించి అటుపైని తొడయును గజ్జలునొప్పి చేసి పొత్తికడుపు దిగువను వుండులాగున నొప్పియుండును. ఒకానొక పుడు రోగప్రథమ గుణములు లేకుండనే కాలునందు నొప్పిపుట్టును. లేని యెడల వాతనొప్పివలెనడుములో పుట్టును. నొప్పి కలిగిన ౨౪ ఘంటలలో కాలువాచి నిగనిగలాడుచుండును. వేడిమికలిగి యెఱ్ఱగానుండును. తరుచుగా కాలి పిక్కనుంచి పైకి వాపెక్కుచున్నది. కొందరియందు గజ్జలనుంచి కిందకుదిగుచున్నది. ఇప్పుడు నెప్పితగ్గును. ఒకానొకపుడు కాలుచల్లగానుండును. యోనియు, పిర్రలును వాచి నిగారింపుగానుండును ఆరంభమందంత్యమందును నొక్కితే కాలు గుంటబడును. తొడలోపలి భాగము చాలామందియందు యెరుపుగానుండును. కాలునుంచి శుభ్రరక్తమును తీసుకొనిపోవు గొప్పరక్తనాడియగును. ఫిమరల్ వేన్, యనునది గజ్జలలోనుంచి తొడదిగువ వఱకు తాడువలె ఘట్టిగా వ్రేలుతో చూచినేని తెలియువచ్చును. ఈ నాడిపైని విశేష నొప్పిగానుండును కొందరియందు గజ్జలలో బిళ్ళలుదిగి చీముపట్టుట కలుగును. కుళ్ళు గలుగుటచే కాలుకోసి వేయుట కూడా క్వచితుగా కలుగును. ... ... ...

ఎడమకాలుయందు తరుచుగా నారంభించి నిమ్మళించునపుడు కుడికాలుయందు యీగుణములు కానబడుటకలదు. ఈ బాగు వాపుకలిగినతరువాత కాలు ముడుచుటకుగాని భూమిమీద మోపుటకుగా నశక్యముగానుండును. నాడి ౧౦౦ మొదలు ౧౪౦ వఱకు వుండి దుర్బలముగానుండును. నాలుక తెల్లగానుండును. విదాహమధికము ముఖముపాలిపోయియుండు

ఆకలి మందము, విరోచనబద్ధము, విరోచనములుగాని కలిగియుండును. మూత్రము చిక్కగానుండును. నిద్రలేకుండును. గాభరా విశేషముగా నుండును. విశేషతీవ్రమైన రోగమునందు శాకిమ కట్టిపోవుటగాని, తన్ను టగాని, కలుగును, యోనిలోపలనుండు భాగములు విశేషనొప్పి జేసియుండును. నివారణయందు, చీముపట్టుటయందు, చావునందు, రోగమంతమౌను.

చికిత్స—F నెం॥ ౭౮ ౮౩ యిచ్చేది, కాళ్ళయందు నొప్పిపైని. బెలడోనా పిగ్మెంటు. నెం॥ రాసి ప్లానెలుగుడ్డ చుట్టేది, లోపుకు నెం॥ ౧౨౭ యిచ్చేది. యోనిలో దుర్వాసనతో శాకివుంటే నెం॥౬౯ తో పిచ్చుకారీ చేయవలెను. విరోచనబద్ధముకు, నెం॥ యిచ్చేది. నిద్రకు, F నెం॥ ౧౧౧ యిచ్చేది.

ఫీమరల్ వేయిన్, పైని జలగలు వరుసగా వ్యాధి యొక్క పరిమితి కొద్ది పట్టించి అటు పైని పోల్టీసు వేయవలెను, గుణము కలుగనెడల రెండుమూడు పర్యాయములు తిరుగా పట్టించవలెను. విరోచనములు లేనియెడల వృష్పలసంబధమైన విరోచనసాధనములు జేయవలెను. వీటితో స్వల్పమోతాదులు నీలాంజనసంబంధమగు టార్టర్ రెమిటిక్కి ని వ్వనగును. కాళ్ళకు పొక్కు మందులు వేయనగును. టర్పెంటాయిలుతో. కాపడము చాలామందికి గుణమును కలుగజేసెను. గర్భపాత్రము వాపు కర యిుంప్లమేషనుందు నెడల. కేలుమెలు, నల్లమందివ్వనగును. నిద్రలేకుండునపుడు డోవర్సుపౌడరు గుణమిచ్చును. బొరకు, క్వైనను, గంధకపు ద్రుతితో నిచ్చుటవే కార్యకారిగానున్నది. మంది పత్యము, మాంసకషాయము. వైను, సారాయును, యివ్వవలెను. ... ... ...

## పాలజ్వరము:. (Weed.)

ఇది ప్రసవమైన తరువాత త్వరిత కాలములోగాని ఆలశ్యముగా గాని కలుగుజ్వరముగానున్నది. ... ...

హేతువులు —చలవ, అజీర్ణము, విరోచనబద్ధము, నొందలగునవి,

గుణములు — గాఢ రాత్రోన్, గుండెదడ, వణుకు, తలనొప్పి, వెన్నులోను, కాళ్ళుచేతులయందున్న నొప్పి, స్తనములు పచ్చి, చిదాహము వేగగతిగల నాడితోనున్ను, వచ్చుచున్నది. రోగి ఆవలించుచు వొడలు విరుచుచు నీరసముగానుండును. తరువాత వెచ్చనందు చలికలిగి దేహమంతటను వ్యాపించును, పొత్తికడుపు పుండువలెనుండును. శ్లీహముయున్ను, కాలెయున్ను, వాటిగుణమున భేదించియుండును. ఈ గుణములతరువాత ముఖము గాఢరించియుండుట, కణతలుకొట్టుకొనుట, కళ్ళపైనినొప్పి, వేగగతిగానున్న నాడి, స్తనములయందు నొప్పి, కడుపుపుండువలె నొప్పిగానుండుట కలుగును. అటుపైని విశేషచెమటపట్టి జ్వరము విడుచును. జ్వరము తీవ్రముగా గాయుట, మనస్సుచెదరుట, పరాకుకొందరియందు కలుగును. జ్వరము విడిచినవెంటనే తిరుగా కానబడును. రోజులో గాని, రెండురోజులలో గాని నివారణకుచున్నది. క్రమముగా సాధనము చేయునేని తిరుగా కలుగదు. అలక్ష్యపెట్టినేని, అహికజ్వరరూపము నొందును. — —

నిధానించుట — ఆరంభమందుండెడు వుద్రేక లక్షణములను పట్టి- ఫ్ర్యాప్‌వేరిల్ ఫీవరుగా నూహించబడును గాని కొన్ని ఘంటలకు వుద్రేకము తగ్గుట చేతనున్ను, గర్భమున పచ్చి లేకుండుట చేతనున్ను, కనుక్కొ- నదగును. — — — — —

చికిత్స — చలిరూపమందు వేడినీళ్ళచె నింపబడిన బుడ్లు శరీరమునదగ్గర నుంచుట, బూర్నీసులు కప్పుట, కాకజేయు మందులు నివ్వనగును. —
F నెం॥ ౮౮ యిచ్చేది — — — — —

కాకరూపమున చెమటపుట్టించు మందులివ్వనగును. చెమటపట్టునపుడు చలిగాలి శరీరమునకు తగలకుండ కాపాడవలెను. కర్పూరము, డాక్టరు కేంపుబెల్ వారు చెప్పినరీతిగా బహుప్రయోజనకారిగానున్నది. రోగోద్రేకము తగ్గినతరువాత బలముకలుగజేయు భోజనమిడవలెను. జ్వరము విడిచిన తరువాత చలిగాలివగైరాలు తగలకుండా దేహము కాపాడుకొనవలయును. F నెం॥ ౮౮, యిచ్చేది. —



## —*) సుఖజాడ్యములు. (*—

సంయోగము వలన కలిగెడు రెండు విధములైన విషములుండును. శగరోగము విషము మూత్రనాళ చెర్మమునందుపడి స్రవించుట వుత్పాదించును ఈ స్రావమునందుటచె రోగముపుట్టుచున్నది. రెండవతరహా విష మొకచోట తగిలినను పోటువుపుట్టించి క్రమముగ కురుపగును. ఈ కురుపు నుండి విషము గజ్జలకు వ్యాపించి బిళ్ళలను పుట్టించుచున్నది. రక్తములో- కలసిన పిదప కంఠమందు చెర్మమందు ముక్కునందు కురుపును కలుగ జే యును. —

### శగరోగము. (Gonorrhea.)

మూత్రనాళమున దీనివిషము చేరిన మూడు నాల్గు రోజులలో క లుగుచున్నది — — — — —

గుణములు — నాళములో మూత్రపు చుక్కొక్కటుండి నేని గుర గురలాడుట మొదట కలుగును ఇందు చేత రోగియాభాగమును జూచు నపుడు నాళపు చివర యెఱ్ఱగానుండి కొంచెము చీములాటి, స్రావమును. కనుగొనును. నాళమందు కాక, మూత్రవిసర్జనమున నొప్పికలిగియుండును

ఈ నొప్పి అంతకంతకు యెక్కువగును. ఒరుపుచె నాళము వాడి మార్గము సన్నమగుటచె మూత్రధార సన్నమగును, మూత్రము రెండు మూడు ధారలగాబడును. ప్రథమము స్రావము తెల్లగానుండి అంతకం తకు పచ్చబడును. రోగము బహుతీవ్రగతి యందుండునపుడు ఆకుపచ్చరం గుగాను రక్తమిశ్రితముగాను వుండును. ఈ రంగులచె రోగముయొక్క తీవ్రతను కనుగొననగును. దీనికి లోపలకు పైకి కూడా సాధనము చేయ నగును. ఇందు పోక వెనకకు చెర్మము రాకుండుట కలుగును. అంగము మీదనుండు నాళ్ళు ఒకపుడు పెద్దవై చీముపట్టును. గజ్జలయందు బిళ్ళను పుట్టించుచున్నది. ఈ రోగముచె బిళ్ళలు కలుగునపుడు రెండుమూడుం డును. కురుపువలన కలుగునపుడు భాగమున కొక్కటే గలుగును. దీనిచె మూత్రనాళము బిగియబడుట, కండలు లోపలను పెరుగుట, మొదలగున వి కలిగి మూత్రబద్ధము కలుగును. రాత్రిభాగమున లేపనము విశేషము గానుండు నింగలింగము వంకరగలుగును, లేపనమున నొప్పి కలిగియుండు

ను. తగవలన గురదాలయందు రోగమును పుట్టించుచున్నది. రోగయందు వాపుకలిగి రోగపైనుండు చర్మము ముందుకు రాకుండుటగాని, వెనక్కు జరగకుండుటగాని, కలిగియుండును.—

హేతువులు—పురుషులయందు విస్తారముగా స్త్రీసంగమువల్లను- బూజీలు వాడుకవల్లను. వాతరోగము, మేహరాళ్ళు, స్త్రీలయందెట్టి శ్రావములున్నను ఋతుమతిగానున్నపుడు సంగమము చేయుటచేత సౌజాడ్యము ఆస్త్రీలయందు లేకున్నసపుడు పురుషులందు గలుగుచున్నది.

చికిత్స— సుఖసంకటము తగులునను మానసము కలుగునపుడు పిచ్చుకారినిండా కొసనీళ్ళుతీసి పిచ్చుకారీచేసి చిన్నపగుళ్ళు గనుక—కలిగి యుండెనేని కాష్టికు రాసి పైని పొడిగుడ్డ అంటించవలెను. సంకటము తగిలినవెంటనే కాష్టికు రెండుగ్రేనులు యొనిమిది అవున్సులు నీటిలో కలిపి నాలుగు ఘంటలకొక పర్యాయము పిచ్చుకారీచేసి శ్రావము పలచబడి రక్తమిశ్రమమై కానబడు వేగమే మాని వేయవలెను. నీరక్తమగుపడుట అవుషధపుగుణము- తరువాతను సల్ఫేటుజింకు రెండుమూడు దినములు పిచ్చుకారీచేసి మరియొకమందు ఫిరాయించవలెను. రోజుకు మూడు పర్యాయములు, కోపేబాగాని చలవమిరియాలుగాని, పుచ్చుకొనవలెను చప్పిడిపత్యముచేసి సారాయి వగైరా కాకచేయు పదార్థములను భుజించకూడదు. రాత్రిభోజనము మానవలెను. నీటిలోగుడ్డముంచి అంగమునకు చుట్టుచుండవలెను పిచ్చుకారీచేయు నట్టివుషధము మూత్రనాళమునందు రెండుమూడు నిముషములు నిలుచునటుల మూతిని బిగించి పట్టియుండవలెను. వ్యాధి ముదురునపుడు రోగి సంచారముగాని, గుఱ్ఱపు సవారిగాని,మానవలెనుఅండత్రయములనూ సంచిపట్టి పైకెత్తికట్టి తడిఆరకుండ నీళ్ళుపోయుచుండవలెను, సోడావాటరు, గంజి, జిగురునీళ్ళు, అవిశగింజలకషాయము, జిగురుగల ద్రవపదార్థములున్నూ పుచ్చుకొనియోగించవలెనూ.—

తుమ్మజిగురు పొడుము... ౨ డ్రా॥—సోడాకార్బోనేట్, ౧ డ్రా॥

నల్లమందరఖు... ౧౦ మి॥— నీళ్ళు. ౭॥ పదున్నార అవున్సులు.

కలిపి ౧॥ అవున్సు రోజుకు నాలుగు పర్యాయములు నాళములో మంటకలిగియున్నపుడివ్వనగును.

లైకరుపొటాసీ ౨ డ్రాములు, టించరుహయ్యాసామి ౨ డ్రాములు నీరు ౮ ఔన్సులుకలిపి రోజుకు ౩ పర్యాయము లొక్కొకఔన్సుయివ్వవలెను. గోరువెచ్చనినీటను మలువులువరకు కూర్చుండనియోగించవలెను.—

జ్వరముతగ్గినలోడనే (Liqr Santalis Flave cububa et Buchu) లైకరు సేంటేలిక్యుబబీ ఎట్టు బకూ అను మందుగాని, చెందినీకేపూ౹ళ్ళుగాని F నె॥ ౧౬-౨౧-౨౫ ౭౦ యిచ్చేది.

కొపేబాగాని చలవమిరియాలుగాని పుచ్చుకొననగును. కొపేబాకేపూసిళ్ళు అన్నిటికంటె మంచివి మూత్రవయవరోగలక్షణములు కలిగియుండు నెడల జలగలు వృషణములకున్ను అపానమునకున్ను నడుముభాగముపై పట్టించవలెను. లింగమువంకర చాలాకాలముండెనేని రసపలాస్త్రిన్ని బెలడోనా రాత్రిలేపుచేయుచుండవలెను. గజ్జలయందుకలుగు బిళ్ళలు రోగిసంచారముమాని యుండుటచేగాని జలగలుపట్టించుటచేగాని పోవును

స్త్రీలయందుశగ. Gonorrhia, Females.

పురుషులయందుండునంత బాధకలుగచేయదు. మూత్రనాళమున కిరుప్రక్కలయందీరోగముపుట్టుచున్నది. మూత్రనాళమున చీమును స్రవించుచుండును. మూత్ర విసర్జనమున నొప్పి కలిగియుండును. మూత్రనాళము పొట్టిగానుండుటచె వుచ్చబుడ్డకూడా వరిశియుండును. యోనిముఖమున్ను, మూత్రద్వారమున్ను, కొపర్సుగ్లాండులను చిన్నబిళ్లలున్ను, ఎఱ్ఱగానుండును. చిన్నపిల్లలయందిట్టి స్రావము కలుగునపుడు కొందరు శెగసంకటము తగెలెనని తలంచుదురు—గానది వేరే జాడ్యముగానున్నది. చినపిల్లలయందు కలుగుస్రావము, కేలమెలు, సున్నపునీటను కలిపి పైకివేయుటచేతనున్ను, లోపలకు కేలుమెలు, రూబర్బు, జాలపుతో కలిపిచ్చుటచే కుదురును.

చికిత్స— (Aletris cardial) ఎలట్రిసుకార్డియలు అనుమందు

హుకార్యకారిగానున్నవి. రోగమారంభమందు F నెం॥ యిచ్చేది,

ద్రవపదార్థములను పుచ్చుకొనవలెను. అప్పుడప్పుడు సూక్ష్మవిరోచన సాధనములు చేయవలెను. — — — —

లైకరుప్లంబై సా బాసి లేటసీనీటను కలిపి అందుస్పంజిముంచి యోనిలోనుంచుకొనవలెను. ఇంప్లమేషను పోగొట్టునీళ్ళు పిచ్చకారీ చేయునగును. కోపేబా పిచ్చకారీ చేయుట రెండుజాతులందు నుపయోగించును. దీర్ఘకాలమూత్రము నేని టించరుఐరనుపయోగించును. శౌచముకట్టకుండనుండునపుడు స్త్రీలయొక్క మర్మస్థానమును తనిఖీచేసి గర్భపాత్రముమెడనుచూచి దానియందు దోషముండు నెడల కాస్టికు రాయవలెను. F నెం॥ ౮౪ యిచ్చేది. — — — —

---

సూక్ష్మముగా కొన్ని వ్యాధుల చికిత్స తెలియజేయునట్టి భాగము-

పొక్కు, రొచ్చు, కొరుకు. (Chancre.)

ఈ కురుపులు పురుషులందు తరుచుగా కలుగుచున్నవి. విషముప్రవేసించిన మూడుదినములు మొదలు ౧౧ రోజులలోగా కురుపు కానబడును. ఈ కురుపు నాలుగు విధములు. — — —

౧. పొక్కు- (Hard Chancre)

౨. రొచ్చు. (Soft Chancre.)

౩. కొరుకు. (Spreading)

౪. కుళ్ళు కొరుకు- (Sloughing Sore)

౧. పొక్కు పోకయందు, చర్మమందు పుట్టుచున్నది. చిన్నబొటిను లాగునగాని, కొట్టుకుపోయిన రీతినిగాని ప్రథమత గానుపించి కురుపగును. కురుపుచుట్టున్న అడుగున్న గట్టిగానుండును. కురుపు సుధ్యపల్లముండును.

౨. రొచ్చుకురుపు — కరడపొక్కువలె గాని — చీముపొక్కువలె గాని — ప్రథమత గలిగి పగిలి చీము కారును. పోకవిరుపు నందు కట్టుమీద కలుగునపుడు సొలవేయుచున్నది. ఇది క్రమంగా గుండ్రముగా పెద్దదగును.

౩, కొరుకు — ఈ కురుపు త్వరగా విస్తరించుచు నొప్పిఅధికము

గానుండును- కురుపు పచ్చగానుండి యెఱ్ఱటి చుక్కలు కలిగియుండును. గుండ్రముగానుండదు. పలచనిచీము విస్తారము స్రవించును. ఒకానొకచో లోపలకు విస్తారముగా తినివేయుట కలదుగాని, ప్రక్కలకు తినుటతరుచు.

౪. కుళ్ళుకలుగు కొరుకు—ఏకురుపైనను విశేషకాక చేయుటచే నిట్టిస్థితికి దీసుకొనివచ్చును. ఈ జాతియందు కుళ్ళుకలిగియుండును. ఇందంగములు చికిత్సలోపమున పడిపోవుటకలదు. మూత్రనాళములో నీకురుపులు కలుగునపుడు శగరోగముగా భ్రాంతినొందింప జేయునుగాని శాస్త్రజ్ఞానియగు వతడు గ్రహించును. స్త్రీలయందు కురుపులు మూత్రద్వారమునకు దిగువను కలుగునపుడు తప్ప బాధ పురుషులలో కలుగునట్లుండదు. ఈ కురుపులలో మొదటి విధము నైదురోజులలో నౌషధముచే కాల్చనపుడు దేహములోనికి వ్యాపించి మఱికొన్ని గుణములున్న వ్యాధులనున్ను, కలుగచేయును. కొన్నిపర్యాయములు కురుపు సంకటముచె బాధనొందినవారు టీకాపడ్డవారు మశూచకమును పొందనటుల తిరిగి కురుపుచె బాధనొందరు. — — — — — —

చికిత్స—వెంటనే కురుపును, కాష్టికుతో మాడ్చి విరోచనములకు మందిచ్చి వేడినీళ్ళలో గుడ్డముంచి కురుపుపైని చుట్టవలెను. వారమురోజులైనను కాష్టికు రాయవలెను గాని—నితరగుణములను పుట్టకుండ నపుడాపలేము. ఈలాగు చేయుట నవకాశమగునపుడు బ్లాకువాష్ లోగాని—ష్టేసిన్ లోషనులో గాని—లింటుముంచి కురుపుమీద వేయవలెను. సారా తాగకూడదు. విస్తారము తిండి కూడదు, (Iodoform) ఐడోఫారం జల్లుటచె కుళ్ళు పోవును, కురుపు మానును, రసపాలాస్త్రీలు, నీళ్లున్ను, పైకి-వాడేది. చలిఘాలిలో తిరగకూడదు. కుళ్లు కురుపుకు నల్లమందు కషాయము కాపడమిచ్చిన తరువాత, బాల్సమ్ పెరూ గాని—శంఖద్రావకము నీళ్లు గాని—పైని వాడుక చేయుటచె కుళ్లుపోవును, దీనియందు మంచితిండియున్ను వైను, సత్తువనిచ్చు పదార్థము లివ్వనగును. సుంగధి, పొటాసీఐడీన్ను, బారకు, కాడ్లివరాయిలు, నివ్వనగును, పోకకుట్టు తినివేసినపుడు కత్తిరతో బాగా కత్తిరించవలెను. — — —

ది షయున్నపుడు కురుపులకు కాష్టికు, మైలతుత్తము, సిల్వరునాయిం టుమెంటునను పలామ్రస్త్రీనాడుక చేయనగును, మూత్రద్వారములో కురు పు లుండునేని కసమందులతో పిచ్చకారి జేయవలెను. ... ...

## బిళ్ల. (Bubo.)

చికిత్స—కనబడిన వేగమే విరోచనసాధనములుజేసి కాపడమిచ్చి జలగిలను పట్టించి సంచారమును మానిపించిన యెడల హరించును —

రొచ్చుకురుపులకు వేయుగంధములు నొప్పితీసి వేయునట్టి గుణము కలిగియుండవలెను. రసము లోపలకు పుచ్చుకొనచుండెనేని మానవలెను. చీముపట్టినట్లుండినను, అయిడీను, మీదరాయించి చలవజేయునీళ్ళుపైని వేయించి విరోచనములకు మందిచ్చి బిగించి కట్టుకట్టుటచె నొకపుడు హరించిపోవు నిట్టిసాధనములకు లొంగక మొనదేరునపుడు చీముకారిపోవుటకు గంటుపెట్టి సాధారణమైన కురుపుకు, చికిత్స జేయునటుల జేయునగును. మానుట ఆలశ్యమగునపుడు లోపలకు సత్తువనిచ్చుమందులు సుగంధిమొదలగునవి యివ్వనగును. నొప్పి, మంట కలిగియున్నపుడు చలవజేయుమందులు నీళ్ళను గుడ్డముంచి పైనివేయుటచె శాంతిచ్చును. చీము విస్తారముగానుండెనేని మఱియొక గంటుపెట్టనగును. బిళ్లకురుపుచుట్టు నుండు చర్మమణగియుండి, నీలివర్ణముగానుండి పలచగానుండెనేని, పొటాసీఫ్యూజా, కురుపునకు రాయుటచె త్వరగా మానును— — —

బిళ్ళకు రంధ్రముచెసిన తరువాతను గుల్లదేరినేని పైచర్మము కత్తిరించివేసిగాని, పొటాసీఫ్యూజా రాసిగాని, కురుపు బాగా కనుపించునటుల జేసి వెండికాష్టికు నీళ్ళలో గుడ్డముంచి పైనివేయుటచె మానును. కురుపు మధ్య నొకానొకపుడు పలుకసి వాడుకజేసే బిళ్ల కలిగియుండునపుడు,

రొట్టెగుజురు. ... ... ౧ అవున్సు.

సవ్వీరము. ... ... ౨ డ్రాములు. — —

గంగసింధూరము. ... ౧ డ్రాము. — — —

కొంచము నీళ్లుకలిపి ముద్దజేసి పలుకులో గంటుబెట్టుము నిది నేని

కళ్ళవాడిపోవును. నాడి కురుపైయుండెనని చెప్పవలయును. ... ... చెప్ప
గాని చేయనగును.

సిఫ్లపిరంగివల్లగరా దద్దురులు. Secondary Syphilis.

కురుపుతగిలినపిదప ఐదు రోజులుతరువాతనైనను ఆరువారములత
రువాతనైన నీమధ్యకాలములోనైనను కానబడుచున్నది. ఈ వ్యాధుల నేక
విధములవుటచే వాటిని తెలియచేయుట లేదు.— — — —

చికిత్స— జ్వరము, గుండెలయందు, గొంతుకయందు, నొప్పికలు
గునపుడు పరోచనసాధనములు అంటుమోసీతో నివ్వవలెను. వేడినీళ్ళ
స్నానము చేయించవలెను. జ్వరలక్షణములు తగ్గినతరువాతను రోగి బల
ములో నుండిదివరలో రసముపుచ్చుకొని యుండ నెడల జ్వరగానిష్మాళించ
వలెనని మోంతాదు లధికముగా మందులు తినకూడదు. చే శరీరమునీరసిం
చి దుర్గుణములు కలుగచేయును. హిందువులు రసమిచ్చు నేర్పునెరుగక
దుర్గుణములనుపుట్టించి రోగగుణములుగా భావించుచుందురు గొంతు
కుయందు కురుపులు పుట్టునపుడు రసమివ్వకూడదు లోపలకప్పుడు సుగంధి
యు పైకి గొంతుకమీద పాకుడు మందులు వేయుట, జలగలుపట్టించుట, కా
ష్టికునీళ్ళతో గొంతుకలోతుడుచుట మొదలగుసాధనములు చేయనగును.
F నెం॥ ౧౦- ౧౧ ౧౮- ౩౩- ౩౯- ౪౨- ౫౧ యిచ్చేది— — —

పశిపిల్లలయందు సుఖవ్యాధి. Heridotary Syphilis.

మనుజుని దేహములో సుఖవ్యాధి విషము చేరి యుండినపుడు భా
ర్యకు కలుగచేయును. భార్యగర్భిణియగునపుడు కడుపులో నుండుశిశువా
వ్యాధినొందును. ఇందుచే స్త్రీలయందు తరుచుగా గర్భముపోవుచున్నది.
శిశువు జననమైనతరువాత నాలుగైదుమాసములలో మృతుడగుచున్నాడు
కొందరియందు శిశువు బహుకృశించి శరీరమందెల్లని మచ్చలుతోను నోట
యందపానమందు ఒకుపుతోనుపుట్టును. పుట్టుచున్నపుడు కూడా శిశువు
వ్యాధినొందునని తెలియవలెను. ఇట్టిరోగములుగల తలిదండ్రులిదివరలో
సిఫ్లపిరంగిక్రింద చెప్పినసాధనములుచే నివారణనొందవలెను. పలుమారుగ

ర్భశ్రావము కలుగుస్త్రీకి తీక్షణముచేయని రససంబంధముగు మందులివ్వ వలెను. (A letris cardial.) ఎలటిరిసు కార్డియలు అనుమందు గర్భశ్రావ ముకాకుండా నిలుపును. పిల్లలకు రసవలాస్త్రీ తోడయుండు సంకలందు మడమలందు మర్దనా చేయించవలెను. లోపలకు (Hy drag.C.creta.)హైయిడ్రార్జిరంకమ్‌క్రీటా ౧-౨ గేన్లు లేక ఒకగేను రాత్రభాగము గుణములుతగ్గువరకివ్వవలెను.

## పాండువ. (Anemia)

ఈ రోగములో రక్తమందుండు యెరుపురంగుతగ్గును- కొందరిలో రక్తముతగ్గును- దేహమందు నిరోగస్థితియందుండు రక్తములోకొంత ద్రవ పదార్థము కొంతద్రవహీనపదార్థము మిశ్రమైయుండు యీద్రవహీన పదార్థము చిన్నఅణువులువలెనుండును- యిందు యెఱ్ఱనివి మెండుగానుం డుఐతే పాండువలో నీయెఱ్ఱనివీకలు తెల్లగానగును.— — —

హేతువులు— జోబస్థలములలో నివాసము- యెండతగలకుండ తిండితిని సోమరిగా యుండుట- భోజనపదార్థములలో జంతుహారము లేకుండుట శరీరమునకు బలహీనతకలుగచేయు వ్యాపారములు- అతి సంగమము- హస్తముచే వీర్యపతనము చేసుకొనుట- చాలాకాలము రక్తవిరోచనములు [illegible] విరోచనములు, జ్వరములు, కురుపుల వెంబడి [illegible] ఖండము, ప్లీహముల గుండు వ్యాధి ప్రసూతి, గర్భిణీ, నాగాలేకుండా సర్వదా పనిచేయుచుండుట, జలగలు విస్తారముప ట్టించుట, విరోచనసాధనములు, రసౌషధములు, సత్తువలేనితిండి, లంఘనములు విస్తారముగా నుపయోగించినపుడీవ్యాధి కలుగుచున్నది. స్త్రీలలో పడుచువాళ్ళయందీరోగము కలుగునపుడు (Chlorosis) సెలిరంగువ్యాధిని వాడెదరు- దీనికారణము తరుచుగా వారిరహస్యావయవముల చే గలుగుచు న్నది. — — — — —

గుణములు— నీరసము, తరుచుగా శ్వాసము, నిట్టూర్పులు, ఊపిరిబాగాఅందకపోవుట మాంసమునందసూయ, గుండెదడ, యేమాత్రము పనిచేసినా అలియక కంఠమునకు యిరుప్రక్కలనుండు నాళ్ళుకొట్టుకొను

ట, సున్నతిరుమణి, సీమసున్నము, బూడిదె మొదలగు వస్తువలు తినుట అజీర్ణము, శరీరము, కళ్ళు, నోరు, పాలియుండుట, యీ పాలినవర్ణము రోగము బలముగానున్నపుడు మైనపురంగు కలిగియుండును. కనిపొట్లయందు, మీగాళ్ళయందు, చేతిమండలయందు వాపు, కడుపులో రక్తనాళ్ళు ఘట్టిగా కొట్టుకొనుట- అల్పాచమానము నిర్మలముగాను పలచగానుండును. దేహ కాకస్వాభావికముకంటె తగ్గియుండును గోళ్ళుకూడా పాలినరంగు కలిగియుండును విరోచనములుగాని విరోచనబద్ధముగాని యుండును రోగము ముదిరినకొలది నాలుకయందు నల్లనిమచ్చలు, వాంతి, నేత్రములయందు కొంచెము పచ్చదనము, వళ్లునులుపు, మాంద్యము, మూర్ఛ, అటుపైని మృతిసంభవించును. దీనియందు యితరరోగములు కలిగినపుడు ఆ యారోగముల గుణములు కలిగియుండును — — — —

సాధ్యాసాధ్యవివేకము— ఇతరరోగములతో కలసియున్నపుడున్ను వాంతి, మైకము, దేహమునులుచుకొనుట, మూర్ఛ, ఇవి కలిగినవారిలో నివర్తియగుట కష్టమౌను చికిత్స హేతువనుతీసి వేయవలయును. రక్తవృద్ధిచేయునట్టి కొంచము కాక చేయునట్టి మందులున్ను భోజనమియ్యవలయును యిందుకు సింకోనా, అమోనియా, లోహసంబంధమైన మందులు యిచ్చేది- విరోచనబద్ధములకు విరోచనసాధనముచే నివర్తింపచేయవలయును లోహజాతిమందులు విరోచనబద్ధము చేసితే వాటితో బిబరు సాల్టుగాని, ముసాంబ్రముతో చేయుమందులుగాని, కలిపివ్వవలయును. విస్తారము పాటుపడువారు పనిచేయకుండా వుండవలెను. మనస్సుచే పనిచేయువారికి ఫాస్ఫరసు (P hosphurus) స్ట్రిక్నియా (Strychnine) చేర్చిన మందులివ్వవలెను. F నెం॥ ౧౧౮ యిచ్చేది. — — —

(ఈ రోగమందు వాడుక చేసే మందులు)

టించెరు ఫెర్రై. T Ferri. — — —

ఫెర్రై అమోనియా సిట్రేటు. (Ferri eta mmonia citrat.)

ఫెర్రై క్వయినీ సైట్రేటు. (Ferri et Qunea citratis.)

యీస్టన్సు సిరపు. (Eastons Syrup) — —

పెల్లోజు సిరపు హైపోఫాస్ఫేటు. (Follows Syrup of Hyhophosph)

పెర్రంరిడక్టం. (Frreum Roductum. (లోహపాడి) మొదలగునవి బాలాకలవు అజీర్ణముకలిగియున్నపుడు పెప్సీను లోహముతో జేర్చి యిచ్చేది. అజీర్ణమునకు పాపాయీను (Paupain.) మంచిది. కొంచెము పచనమైనమాంసము మాంసకషాయము, పాలు, కోడిగుడ్లు, యివ్వావలయును. వెంటనే యివిఅన్నీ పెట్టవచ్చు F నెం॥ ౭౯- ౫౦- ౭౩- ౧౦- ౧౨- ౧౫ యిచ్చేది.

పరాకుమాటలు. (Delorium.)

ఇవి చాలా రోగములలో కలుగును ఇవి విస్తారముగాను, వెఱ్ఱివానిమాటలువలె కొన్నిజబ్బులలో నుండును. కొన్ని వ్యాధులలో మాటలు స్పష్టముగా తెలియకుండా నోటిలో సణుగుకొనినట్లుండును. తిట్టుట, వెక్కిరించుట, నవ్వుట, యేడ్చుట, కేకలు వేయుట, పాడుట, ఒకటఅడిగితే నొకటిచెప్పుట, ప్రలాపముకలిగియుండుట, చూడనివస్తువ తనకు కానవచ్చుచున్నదని చెప్పుట, యీ మొదలుగాగలవి యిందుచిహ్నములు, ఆహికజ్వరము, పాళీజ్వరము, సన్నిపాతజ్వరములలోనున్ను, వాతిరుగ్మతలయందున్ను, శిరోరోగములయందున్ను, క్రిమిరోగములయందు తరుచుగా నీగుణము కలుగును. నీగుణము నివారించుట లేనిచో గాఢమైన మైకములోకి తీసుకొనిపోవును. — — — —

చికిత్స— శిరస్సుమీద వెంట్రుకలుగొరిగించి మంచుగెడ్డ రబ్బరుసంచితో కట్టుటవల్లగాని, త్వరగాఆర్చుకుపోయే లోషనులు (Lotions) తలమీద గుడ్డతడిపివేయుటచేగాని నివారించును పొక్కుపాలాస్త్రీ మెడమీద వేయవలయును. లోపుకు డోవర్సుపౌడరు ౫ గ్రే॥ యిచ్చుటచేగాని F నెం ౧౧౧ యిచ్చుటచేగాని నివారించును.

శిరోరోగములలో నేపాళము, కేలుమెలుకలిపి విరోచనబద్ధముగానున్నపుడుయిచ్చేది. జ్వరతీవ్రముచే యీగుణముకలిగినపుడు జ్వరముతగ్గించె సాధనముచెయ్యుచూ యీసాధనముచెయువలయు యోగము యిచ్చేది—

## కళ్ళకలక. (Congunctivitis.)

కంటియొక్క తెల్లగుడ్డుపై పొరయందు రక్తమెక్కువచేరి యెరుపెక్కును. ... ... ... ... ...

గుణములు— కంటిలో యిసుకపడినట్లుండును. నొప్పిగాను, వెచ్చగానుండును. కంటివెంట నీరుకారును, పుసికట్టును, వెలుగుచూచినచో పోటుగానుండును, కలక విస్తారముగానున్నపుడు కొంచెము జ్వరము కలుగును. నొప్పి, సలుపుగుడ్డునందుండును- విశేషతీవ్రమైనకలకలో తెల్లగుడ్డుపై పొరవుబ్బి కంటియందు దబ్బసము చేరినట్లు పొంగియుండును. [illegible] అంటువ్యాధిగనున్నది. హేతువులు— వేడి, విశేషచలిగాలి, [illegible] లకలు మొదలగువస్తువులుపడుట కొన్నితరహాలకలక శగసం[illegible] రోగముచేకలుగును. యిందు బాధ విస్తారము కళ్ళు [illegible] వుండును. శగరోగస్త్రీలు శిశువులను కనునపుడు [illegible] కళ్ళ[illegible], పుట్టినవెంటనే కళ్ళకు జబ్బుచేసి వెంటనే తగినచికిత్స చేయనిచో పోవుటచే అంధులగుచున్నారు. మతియొకజాతికలకయందు [illegible] తెల్లగుడ్డు తెల్లగుడ్డుసంధినిగాని, తెల్లగుడ్డుపైగాని, [illegible] — —

సాధ్యాసాధ్యవివేకము— వట్టికలకిసు సాధ్య[illegible]

శ్రమసాధ్యములు— — — —

చికిత్స— కళ్ళు శుభ్రముగా కడిగి ఆడియం[illegible] పై నిఅద్ది F నెం॥ ౧ రలోవుక యిచ్చేది రెప్పలయందు [illegible] నెం ౬ కంట్లో వేసేది- సలుపు, పోటు, విస్తారముగానుం[illegible] కలు కంటిలో వేసేది. విరోచనబద్ధమునకు F నెం॥ [illegible] యిచ్చేది. శగసంకటమువల్ల కలిగేవాటికి కళ్ళు, తరుచుగా పిచ్చికారీతో కడిగి F నెం॥ ౭౦ వేసేది- పుట్టినపిల్లలకు కళ్ళు శుభ్రముగ తుడిచి నెం॥ [illegible] కంటిలో వేసేది. రాత్రినిద్రపట్టకుంటే నెం॥ ౧౧౧ యిచ్చేది.

## కుష్ఠు పెద్దరోగము. (Leqrosy.)

శరీరములో నొకవిధమగు పురుగు ప్రవేశించుటచే కలు[illegible]

౧ తిమ్మెరలోనుండునది. — — —

౨ కంతులలోనుండునది. — — —

ఈరోగము స్పర్శవల్లవచ్చునదైయున్నది. శరీరములో విత్తనములు ప్రవేశించినతరువాత మూడు మొదలు పదిసంవత్సరములవఱకు పైకి స్పష్టపడదు. — — — —

గుణములు — రాగిరంగుగలమచ్చలు దేహమునందు కానబడి దళమెక్కును- మొగముమీద చెవులమీద క్రమముగా దేహమంతటా కణుకులుపుట్టును- యీకణుకులయందు తిమ్మెరయుండును- క్రమముగా కణుకులు కురుపులగును- ఋషిమానుటకు చాలాకాల మపట్టును- చెవితమ్మలు పెద్దలుగా వ్రేలాడుచుండును- ముక్కుశరములపై తమ్ములు పెద్దలుగానుండును- చేతివేళ్ళు, కాలివేళ్ళు, కుళ్ళిపడిపోవును- ముఖముమీది వెంట్రుకలు రాలిపోవును- కనిబొమలవెంట్రుకలు రాలిపోవును- ముఖము చముకురాసినట్లున్నా ముడతలుబడిస్నియుండును- ముక్కువెంబడి చీముకారును-గొంతుకవిఱుగరాయును- ప్రథమమునందు చెవులయందు కాళ్ళయందు కొందరికి మంటలు చీములుపాకినట్లుండును- నీరసించిగాని, దస్తులవల్లగాని, అతిమూత్రమువల్లగాని, మఱి యితరవ్యాధివల్లగాని, మృతినొందును — —

చికిత్స— సాధనములచేత బాగుపడుటఅరుదు- రోగి శుభ్రముగా నుండుట శరీరము మెత్తబెట్టే లేపులు బలమునిచ్చేభోజనము కురుపులు వ్రణములు, యితరకురుపులవలె బాగుచేయడముకంటె యెక్కువచేయుటకు ప్రయత్నించుటకు ప్రస్తుతపు జ్ఞానముచాలదు- యీరోగములో నీదిగువను దహరింపబడినమందులు బహుకార్యకారిగా నొకొకొకగ్రంధకర్త నొకొకమందును శ్లాఘించిరి. — — — —

| | |
|---|---|
| స్ట్రిక్నియా. ... ... ... ... | Strychnia |
| ఫాస్పరసు. ... ... ...... | Phosphorus. |
| పాషాణము. ... ... ... ... | Arse nic. |
| రసము. ... ... ... ... | Mercury. |

పొటాసుఅయొడు.

| | |
|---|---|
| చాల్ముగ్రాతైలము. ... ... ... | Chaulmogra oil. |
| రిసోర్సీను. .. ... ... ... | Resorcin. |
| ఇక్తియోలిన్. — — — | Icthyolin. |
| కర్జునూనె. — — — | Gurjun oil. |
| వేపనూనె, ముషిణిసత్తు. — — | Neem oil anp strychnia. |
| జిల్లేడు. — — — — — | Mudar. |
| బొంకుడాకు. — — — — | Hydrocotyle asiatica. |



| | | |
|---|---|---|
| నెం ౧రు రోగములు-మాత్రలు· | No 1 | |
| క్వయినుమాత్రలు- | Quinine Pills | |
| క్వయినను. ... ... ౨౦ గ్రేనులు | Quinine | 20 gs |
| నిమ్మపంటిరసం. ... ... ... | Lime Juice | sq |
| కలిపి ౪ మాత్రలుచేసేది ౧ మోతా | Into 4 Pills, Dose 1 pill | |
| దు జ్వరములోనూ, తలనొప్పులలో | Given in fevers, head aches- | |
| ను, పార్శ్వనొప్పులలోను- | | |
| నెం॥ ౨ (కవాటరాట్) | No 2 | |
| మయిలతుత్థము. — — ౧ గ్రే | Copper Sulphate, | 1 gs |
| నల్లమందు. — — — ౨ గ్రే | Opium | 2 gs |
| కలిపి ౪ మాత్రలుచేసి ౧ మోతాదు | Into 4 pills, Dose 1 pill, | |
| రక్తవిరేచనములలోను చాలాకా | In Ch Dysentery and Diarrhea, | |
| లమునుండినవి విరేచనములలోను | | |
| గ్రహణులలోను. — — — | | |
| నెం॥ 3 (లోహకవాటం) | No 3 | |
| అన్నభేది. — — — ౨ గ్రే | Ferri Sulph | 2 gs |
| నల్లమందు. — — — ౨ గ్రే | Opium | 2 gs |
| కలిపి ౪ మాత్రలుచేసేది. ౧ మో | Into 4 pills,Dose 1 pill, | |
| తాదురక్తకుసుమ విరోచనములలో | In Amenorrhia and In looseness | |
| దుర్గంధములోను. | with fetid smell, | |
| నెం౪)యకృద్ధవినవిమోచనీరేచకం | No 4 | |
| కలోసింతుపిల్లు — — ౫ గ్రే | Pill colocynth comp, | 5 |
| కేలుమెలు. — — — ౫ గ్రే | Calom l- | 5 |
| ౨ మాత్రలుచేసేది- పరుండునపుడు | Into 2 pills, | |
| రాత్రిపుచ్చుకునేది- విరోచనబద్ధము | Dose 2 pills, at bed time. | |
| అజీర్ణములోను యిచ్చేది.— — | In Constipation and in Acute Dyspepsia, | |
| నెం॥ ౫ (శైత్యాంతకం) | No 5 | |
| పిల్ సిల్లా. — — ౧౨ గ్రే | Pillscilla, | 12 gs |
| యిపికాకు. — — ౨ గ్రే | Ipicac | 2 ss |
| యక్ట్రాక్టుఅయాసామి.— ౨ గ్రే | Extract Hyoscyami, | 2 gs |

౧ మోతాదు. — — — —
దగ్గులలో, కఫము తెగుటకు దీర్ఘకా
లమునుండిన శైత్యములలో— —

నెం॥ ౬ (అజీర్ణకుఠారం.)

పెప్సీను. — — — ౩ గ్రె
బిస్మత్తు. — — — ౫ గ్రె
౨ మాత్రలు చేసేది — — —
మోతాదుకు ౨ చొ॥ భోజనం చే
సేటప్పుడు అజీర్ణరోగాలలో. —

నెం॥ ౭ (ఆమాజీర్ణ రేచకం)

పిల్లురీయైకో — — ౨౦ గ్రె
౪ మాత్రలు— — — —
౧ మోతాదు— — — —
రోచనబద్ధము, అజీర్ణములలోను.

నెం॥ ౮ (స్వేదకరీమాత్రాం డరసం.)

డోవర్సుపౌడరు. — — ౧౨ గ్రె
టించరుఅకోనైటు. — ౮ మి
౪ మాత్రలు చేసేది. — — —
మోతాదు ౧చొ॥ శైత్యములలోను
జ్వరములలోను, వాతనొప్పులలోను

నెం॥ ౯ రు.

రసమాత్ర — — — ౩ గ్రె
సిల్లా— — — — ౧నర గ్రె
డిజిటేలిసు. — — ౧ నర గ్రె
౧ మాత్రచేసి రోజుకు మూడుమా
ర్లు యిచ్చేది. ఒళ్లువాపులలోను.

(నెం॥ ౧౦ రు)

కేలుమెలు — — — ౨ గ్రె
నల్లమందు — — — ౨ గ్రె
౪ లుమాత్ర చేసేది. ౧ మోతాదు.

Into 4 Pills
Dose 1
In chronich colds and coughs.

No 6

Pepsine, 3 gs
Bismith, 5 gs
Into 2 pills
Dos 2, with meals used in
Dyspepsia with besteffects,

No 7

Pill Rhii co 20 gs
Into 4 pills
Dose 1
In habitual Constipation and in
Dyspepsia

No 8

Dover's powder 12 gs
T, Aconite 8 gs
Into 4 pills
Dose 1 pill
In colds. Fevers. and Rheumatism
and Febrile Delerium.

No 9

Pill Hydrarg 3 gs
Pill Scilla $1\frac{1}{2}$ gs
Pul Degetalis $\frac{1}{4}$ gs
Into 1 pill. T D
In dropsy,

No 10

Calomel 2 gs
Opium 2 gs
Into 4 pills, Dose 1 pill,

సుఖరు క్షతలోను (బిళ్లపిరంగి)

నెం ౧౧ (సుఖామయఖడ్గము)

గ్రీను అయొడైడు మర్క్యూరీ ౧౨ గ్రే
యక్ట్రాక్టులిక్యూరిసు. ... ౬౦ గ్రే
నల్లమందు. ... ... ...౨ గ్రే
౨౪ మాత్రలు చేసి-
మోతాదు ౧ చొ॥ రోజుకు 3 మాత్ర్లు
పైత్యపుకుష్టుల యందు ఫిరంగి మొద
లగు సుఖసంకటములలో.... ..

నెం ౧౨ (అజీర్ణవిధ్వంసిని.)

పెప్సీను. ... ... ... ౩౨ గ్రే
యక్ట్రాక్టుఆలోజుబా. .. ౮ గ్రే
౮ మాత్రలు చేసి భోజనమపుడు ౧
చొ॥ పుచ్చుకొనేది. ఆమాజీర్ణము వి
రోచనబద్ధముతో కలిగినపుడు, ము
ట్లుకావడమునకున్నూ. ... ...

నెం ౧౩ (ఋతుహీనవిధ్వంసిని.)

రవకట్టించినఅన్నభేది. ... ౨ గ్రే
పిల్లుఅలోజుమర్రు. ... 3 గ్రే
౧ మాత్రచేసి భోజనమైనతరువాత
యిచ్చేది. — — — — —
ముట్లుకావడమునకు హిస్టీరియా
లో విరోచనబద్ధము, నీరసమున్నపు
డు యిచ్చేది. — — — —

నెం॥ ౧౪ (మహోదరరేచకం)

యెలిటీరియం. — — ౧ గ్రే
డిజిటాలిస్ పౌడరు. — ౨ గ్రే
యక్ట్రాక్టుజెన్షన్. — — ౧౨ గ్రే
౪ మాత్రలు చేసి రాత్రి ౧ మాత్ర ఇ
చ్చేది. ఒళ్ళు వాపులలో విస్తారము
విరోచనములు కావలిసినపుడు. —

Given in Syphilis secondary

No 11

Hydrarg Iodid verid 12 gs
Ext Lupuli 60 gs
Ext opii 2 gs

Into 24 pills. 1 thrice a day

In pustu lar and tubercular diseases of skin and in secondary syphilitic ulcerations

No 12

Pepsine 32 gs
Ext Aloes Barb 8 gs

into 8 pills Dose 1 pill In indigestion with constipation and in supressed menses

No 13

Granulated Sulphate if Iron 2 gs
Pill Aloes et myrrh 8 g

Into 1 pill, afer meals In amenorrhoea Hysteria with constipation and debility

No 14

Eleterium 1 gs
Digitalis Foleopul. ... 2 gs
Pul Dietalis 2 gs
Ext Gentian 12 gs

into 4 pills 1 at bed time
ns dropsical effections and where It is desirable to produce copio watery stools

నెం ౧౫ రు

పోడాఫిలంరెజిన్. — ౧నర గ్రే
రూబర్బ్. — — ... ౫ గ్రే
యక్ట్రాక్టుఅయ్యాసామి. ౩ గ్రే
౨ మాత్రలు చేసి ప్రతిరోజు పరుండు
నపుడుయిచ్చేది. హృద్రోగము పై
త్యరోగములు, కామర్లలోయిచ్చేది.

నెం॥ ౧౬ (శరతా[illegible]చంద్రిక)

సేలలు. — — — — [illegible] గ్రే
౧ మాత్ర చేసి రోజుకు ౩ మార్లు చొ॥
స్త్రీలలో శగరుస్మృతలయందు సిస్టై
టిసు అనురోగముందు చిన్నపిల్లల పు
లుసువిరోచనములు కట్టుటకు మంచి
మందు. — — — — —

నెం॥ ౧౭ (మూత్రకరీసారము.)

డయూరిటీనుబిళ్ళలు. — ౫ గ్రే
మోతాదు ౩ చొ॥ ఒళ్ళువుబ్బు, జ
లోదరము మొదలగు వాటిలో విస్తా
రముగా నీరుడిపోవుటకు. — —

నెం॥ ౧౮ రు

అయొడోఫారం. — — ౨ గ్రే
యక్ట్రాక్టుజన్షనుతో ౪ మాత్రలు చే
సేది. మోతాదు ౧
బల్లలలోను, ఉబ్బసదగ్గులలోను శు
ఖరుస్మృతలలోను. — — —

నెం॥ ౧౯ (మేనిసిరియ్యాకవాటం)

బ్లూపిల్లు. — — — ౨ గ్రే
యిపికాకు. — — — ౧ గ్రే
యక్ట్రాక్టుఓపియమ్. — ¼ గ్రే
౧ మాత్రచేసి మోతాదు ౧ చొ॥ రో

No 15

Pododhyli Resin ½ gs
Pul Rhei 5 gs
Extract Hyoscyami 3 gs
Into 2 Pills At bed time every day In Dropsies from Cordial renal or hepatic diseases and In Jaunbice

No 16

Salol 5 to 15 gs
Into 1 Pill thrice a day In Gono-rrhia Cystitis and acid Diarrhia in children

No 17

Diuretin (Kloll) tabloids each 5 gs
Dose 3 tabloids In general dropy àscitis A sure diuretic

No 18

Iodoform 2 gs
Ext Gentian gs
Into 4 Pills Dose 1 Pill In Asthma, Enlarged spleen and liver anb in syphilis

No 19

Blue Pill 2 gs
Ipicac 1 gs
Ext opii ¼ gs
Into 1 Pill Dose 1, thrice a day In Dysentery.

జుకు మూడు పర్యాయములు నలిగి
దుపులలోను. — — — —

నెం॥ ౨౦ (సర్వమూర్ఛాకృపాణం)

వెలిరియనేటుజింకు. — ౧౦ గ్రే
పాస్ఫేటుజింకు. — — ౧౦ గ్రే
యక్ట్రాక్టురూబార్బు. — ౨౪ గ్రే
౧౨ మాత్రలుచేసేది.
మోతాదు ౧ చొ॥
మూర్ఛలలోను. హిస్టీరియాలోను
నరములనొప్పులలోను. — —

NO20 gs

Zinci Valereanatis. 10 gs
Zinci Phosphatis. 10 gs
Extract Rhei. 24 gs
Into 12 pills
Dose I TD
In Ep elepsy, Neuralgea and Hysteria

నెం॥ ౨౧

వెలిరియనేటుజింకు. — ౧౨ గ్రే
క్వైనను. — — — ౬ గ్రే
రూబార్బుపిల్లు. — — ౨౦ గ్రే
యక్ట్రాక్టుఅంతిమెడిస్. ౨౦ గ్రే
౧౨ మాత్రలుచేసేది ౧ మోతాదు
హిస్టీరియాలోను, నరములనొప్పుల
లోను. — — — —

No 2I

Zinci Velreanatis 12 gs
Quenia Sulphatis. 6 gs
Pill Rhie comp. 20 gs
Ext Onthemedis. 20 gs
Into 12 pills Dose. 1
In Hysterrhoea and nueralgea.

# చూర్ణములు.

నెం॥ ౨౨ (లఘురేచకచూర్ణము)

చేదుసాల్టు. — — ౨ డ్రా
కార్బొనేటుమెగ్నీషియా ౨౦ గ్రే
౧ పొట్లము శొంఠినీళ్ళతోగాని, పె
ప్పరుమెంటునీళ్ళతోగాని, ఉదయం
యిచ్చేది- ఒకటిరెండు విరోచనము
లు అగును పైత్యము అణగిఅవును.

No 22.

Mag Sulph.... ... ... 2 gr.
Mag Carb. ... ... 20 gs
Pepermintwater. ... ...1 ou
Mix,
1. Dose.
Agentle purgative In fevers.
Dyspepsia and b.liousness.

నెం॥ ౨౩

డోవర్సుపౌడరు. — — ౧౫ గ్రే
బిస్మతు. — — — ౧౫ గ్రే
౩ పొట్లములుకట్టేది

No 23.

Dover's powder. ... 15 gs.
Bismith. ... ... 15 gs.
Into 3 powders. ... ...

౧ మోతాదు.

పలికడుపులలోను అజీర్ణశూలలలో

పక్షయములలో విరోచనములుకట్టుట

కువాడేది. — — — — —

నెం॥ ౨౪

సోడాబైకార్బు. — — ౨ గ్రే

గ్రేపౌడరు. — — — ౨ గ్రే

కార్బొనేటుమేగ్నీషియా. ౫ గ్రే

౧ పొట్లముకట్టి — — — —

రోజువిడచి రోజు రాత్రియిచ్చేది.

చిన్నపిల్లలకు విరోచనముచేసి ఫలు

పుపోవును. — — — —

నెం॥ ౨౫ (జ్వరములకు.

ఫినాసిటీను. — — — ౧౨ గ్రే

౧ మోతాదు. — — — —

జ్వరములలో తనుకాకవిస్తారముగా

యున్నప్పుడు న్యూ, న్యూమోనియా

లోను, నొప్పులలోనుబహుమంచిది

నెం॥ ౨౬

ఆంటిపైరీన్. — — ౧౦ గ్రే

నెం ౨౫ రు లాగున వాడేది.—

కడుపునొప్పి శాంతించును. — —

నెం॥ ౨౭ (శూలదవానలచూర్ణం)

సోడాబైకార్బునేట్. — ౧ డ్రా

రూబర్బు. — — — ౧ డ్రా

కలంబా. — — — ౧ డ్రా

౬ పొట్లములు. — — — —

మోతాదు ౧ పొట్లము. — —

ఆమాజీర్ణశూలలయందు. — —

నెం॥ ౨౮ (వాంతిక్)

ఇపికాకు. — — — ౨౦ గ్రే

Dose. I. ... ... ...

In Dysentery, Dys-pepsia and enteritis. ... ... ...

No 24.

Soda Bicarb.... ... 2 gs

Hydrarg cum creta. ... 2 gs

Mag Carb. ... ... ...5 gs

Into I powder. .. ...

To be given every other night, aperient in children. ... ...

No 25

Phenocetine.... ... 12 gs

Into I powder. ... ...

Used to reduce. ... ...

temperature inhigh fevers. Pneumonia and for various pains.

No 26

Antepyrine. ... 10 gs

to be used as No 25 and also in painful menustruation.

No 27

Soda Bicarb.... ... ... I Dr

Pul Rhei. ... ... ... I Dr

Pul Calumba. ... ... I Dr

Into 6 powders. ... ...

Dose I ... ... ...

In acid Dyspepsia. ... ...

No 28

Ipicac. ... ... ... 20 gs

— ౧ ఔ

కలిపి వాంతికి యివ్వది. — —

అజీర్ణములోను, కఫము చాల నిండా

మెండుగా యున్నప్పుడున్నూ. ...

నెం॥ ౨౯ రు

సల్ఫేటుజింకు ... ... ౨౦ గ్రే

వేడినీళ్ళు. ... ... ... ౧ ఔ

కలిపి ... ... ... ... ...

విషము కక్కించుటకు వాంతికి యి

వ్వది. ... ... ... ... ...

నెం॥ ౩౦ రు

క్రీమటార్టరు. ... ... ౨ డ్రా

సల్ఫరుసబ్లిమేటు. ... ౨ డ్రా

౪ పొట్లములు. ... ... ... ...

౧ మోతాదు. ... ... ... ...

మూలవ్యాధులకు. — ... ...

నెం॥ ౩౧ (సంతాపహారి)

సోడాబైకార్బ. ... ౨౦ గ్రే

౧ పొట్లము.

టార్టారికాసిడ్డు. ... ౧౫ గ్రే

౧ పొట్లము.

రెండును, రెండుగిన్నెలలో ౧ అ॥

నీటిలో కలిపి ఒకటితో నొకటి కలిపి

తే పొంగును, ఆవెంటనే పుచ్చుకోవ

లయును - జ్వరములలోను ఆమ,పై

త్య శాంతికి, వాంతికట్టుటకు, శూలల

లోను ఉపయోగమగును.

నెం॥ ౩౨ (అతిసారనిరోధిని)

గేలికాసిడ్. ౧౫ గ్రే

డోవర్సుపొడుము. ౧౫ గ్రే

Warm water. ... I Ounce

Mix. ... ... ... ...

I Dose. Emetic. ... ...

No 29

Zinc Sulph. ... ... 20 gs

Warm water. ... 1 Ounce

Mix... ... ... ...

To be given in cases of certain poiso nsto empty the stomach. ...

No 30

Cream of tart. ... ... 2 Dr

Sulph Sublimat. ... ... 2 Dr

Into 4 powders. ...

Dose 1 ... ...

In piles. ... ...

No 31

Soda Bicarb. ... ... 20 gs

Into I powder. ...

Acid Tart. ... I5 gs

Into I powder. ...

To be taken in effervescing in Fevers, Biliousness, in Vomitting and in Dys pepsia. ...

No 32

Acid Gallic. ... ... I5 gs

Dovers powder. ... I5 gs

మోతాదు ౧ పొట్లము.
సలికడుపులు, రక్తస్రావములు చీ
ము విరోచనములు, కడుపులలోను

నెం॥ ౩౩ రు

బోరైమైడ్రుమర్క్యూరీ. అర గ్రే
యక్ట్రాక్టుసార్సిలిక్విడ్. ౨ డ్రా
సుగంధికషాయము ౧౦ డ్రా
కలిపిరోజుకు ౩ మారులు ఇచ్చేది
శంఖరు వ్యాధివల్లకలిగెడి కుష్టులలోను
మొండిగానుండే బిళ్లఫిరంగి వ్యా
ధులలోను.

నెం॥ ౩౪ (మేహాంతకం)

పొటాసుఅయిడయిడ్. ౨౦ గ్రే
టించరర్ సర్ పెంటిరియా. ౩ డ్రా
గోయాకంమిక్స్చర్. ౮ అ
కలిపి ౬ వభాగము రోజుకు ౩ ప
ర్యాయములు ఇచ్చేది.
వాత నొప్పులలోను శగసంకటము
లలో వాతనొప్పులు, నడుమునొప్పు
లలోను గుణమిచ్చును.

నెం॥ ౩౫ (అంగుష్టవాతాంతకం)

పొటాస్ అయిడయిడ్. ౬ గ్రే
వైన్ంకొలిచిసై. ౪౫ చు
టించరుఅకోనేట్. ౯ చు
ఇన్ఫ్యూజన్‌రీవి. ౧ అ
కలిపి రోజుకు ౩ మారులు ఇవ్వవ
లెను పురాతనమైనటువంటిన్ని క్రొ
త్తగావచ్చినటువంటి వాత నొప్పుల
లోను గవుటునొప్పులలోనుఇచ్చేది

నెం॥ ౩౬ (ఉబ్బసలకుదివ్యౌషధం)

పొటాసుఅయిడయిడ్. ౫ గ్రే

Dose. I ... ...
In Dysentery, mucious diarrhea and hemorrhaes. ... ...

No 33

Hydrarg Bromid. ... ½ gs
Extract Sarsa Liquid. ... 2 dr
Decoct Sarsa Comp. ... 10 dr
Mix. ... ...

In Syphilitic Lepra and Obstinâte Secondary Syphelitic ereeptions.

No 34

Pot Iodid. ... ... 20 gs
Tinct Serpent. ... 3 dr
Mist Guaio . ... ...8 ources
mix. ⅙ part to be taken 3 times a day
Valuable in Chronic and Gonorrh eal Rheumatism in Lumbago, some forms of Neuralgea. ...

No 35

Pot Iodidi. ... 6 gs.
Vin Colchici. ... 45 ms
T. Aconite. ... 9 ms
Inf Rhei. ... I ounca
Mix to be taken thrice a day In acute and chronic gout.

No 36

Pot Iodid. ... 5 gs

